కృత్యంబులం దీర్చి శత్రుఘ్నుండునుం దానును దల్లులును వసిష్ఠ
ప్రముఖమునివర్గంబులును బంధుమిత్రామాత్యప్రభృతిపరివారంబును
ఫలజలంబులం దృప్తి నొంది మనోజ్ఞం బగునెడల విశ్రమించి యు
మ్మలునాఁటిప్రభాతంబునందు. 33౨.

గీ. గుహునిచేరామలక్ష్మణులు కుంతలముల
జడలొనర్చిన తెఱఁగు నేర్పడ నెఱింగి
తానుశత్రుఘ్నుఁడునుగూడితత్క్రమమున
జడలుసవరించి రెల్ల వారడలుచూఁడ. 333.

ఉ. అంతగుహుండొనర్చినమహోన్నతమైతగునావనెక్కి సా
మంతులుమంత్రులున్హితులుమానులుఁదల్లులుఁదోడరాఁగధీ
మంతుఁడుపద్మమిత్రకులమండనుఁడాభరతుండుజాహ్నవి
న్దాంటిరథాశ్వపఙ్క్తులఁబదాతిజనమ్ములఁగూడిదాఁటుచున్. 33౪.

క. చనిభారద్వాజమహా
మునియాశ్రమమొప్పఁడాసిముఖ్యజనముల
న్గొనియమ్మునిఁగనిమ్రొక్కిన
ననియెన్భరతునకతండునతికోపముతోన్. 33౫.

క. భరతాభువినీకొసఁగిశు
భరతుఁడుశ్రీరాముఁడడవిపాలైనను
ర్భరతరమగుసేనాసం
భరితుఁడవైయనికిఁదొడరఁబాడియెచెప్పుమా. 33౬.

వ. అనిన భరతుం డిట్లనియె. 33౭.

మత్తకోకిల. తాపసోత్తమరామభద్రుఁడుదారుణాటవి కేగసం
తాపమందిదివంబుఁజేరినతండ్రికింబరలోకసం

ప్రాపకంబగుసత్క్రియల్గ్రమభంగిఁదీర్చిమదగ్రజు
న్భూపతిత్వముఁగొమ్మురమ్మనిపూనిపిల్వఁగఁబోయెదన్.

క. మనమునరఘురామునకె
గ్గొనరింపఁదలంపనెప్పుడూహింపుముస
న్మునివరసర్వముదోఁచెడు
ననినభరద్వాజుఁడనియెనాభరతునితోన్. ౩౩౯.

చ. భరతమహీశ నామపదభక్తుఁడవంచునెఱింగినాఁడహృ
త్సరసిజమందునిన్నపురసజ్జనంబులఁగూడినేఁడుప్రే
మరసముతోల్కభోజనముపావనసీమనొనర్చిపొమ్మస
త్వరగతిఁజిత్రకూటగిరివాసునిశ్రీరఘురాముఁగానఁగన్. ౩౪౦.

వ. అని భరతు నొడంబఱిచి భరద్వాజుండు దేవశిల్పాచార్యు రావించి యద్భుతం బగునొక్కపురంబు నిర్మింపు మనిన నట్లయని యతండు.

క. వరరత్న హేమమయగో
పురములనంతంబులైనభోగములకుఁదా
పురముధరారమణికిని
పురమనఁగానచటనొక్కపురముఘటించెన్. ౩౪౨.

వ. అంత. ౩౪౩.

సీ. మహనద్భుతంబగుమణిగణఖచితమై
రాజగేహము వెల్గెఁ దేజమలర
హరిహయనిజసుధర్మాస్థాన మోయనఁ
బొవలుచునొకసభాసదనమమరెఁ
దన్మధ్యమునఁజిత్రతరభద్రసింహాస
నంబుప్రజ్జ్వరిలిమోదంబొనర్చెఁ

కక్ష్యాంతరంబులుఁ గనకకుడ్యంబులు
వజ్రకవాటముల్ వరుస వెలసె
మంత్రిసామంతులకుఁ దగుమందిరములుఁ
బౌరభటపరిచారికాభవనములును
నిఖలసేనానివహములనిలయములును
గలిగి కన్నులపండువుగాఁగ నొప్పె. ౩౮౪.

వ. ఇట్లప్పురం బతిరయంబుగా నిర్మించి విశ్వకర్మ యెఱింగించి చనిన నమ్మునివరుండు పురప్రవేశం బొనర్పం బంచుటయు భరతుండు సపరివారుండై తన్నగరీవరవిభవంబుల కచ్చెరు వందుచు సర్వజనంబుల నయ్యెయెడల విడియించి జనుల నంతిపురంబునకుఁ బనిచి శత్రుఘ్నసహితుండై మంత్రులతోడ సభాసదనంబునకుఁ జని యందు.

క. కనకమణిప్రభలొల్కెడు
ఘనతరసింహాసనంబుఁ గనియిది శ్రీరా
మునకే తగునని చెంతం
బనివడి కూర్చుండె నిఖిలపరిజనయుతుఁడై. ౩౮౫.

వ. అంత. ౩౮౬.

సీ. అల భరద్వాజసంయమియాజ్ఞ రంభాది
గణికాసఖీమణీగణములలరి
భరతుసన్నిధిఁ జేరి భరతశాస్త్రోక్తభా
వనలఁ జతుర్విధాభినయ మమర
నాట్యంబు లొనరింప నారదప్రముఖవి
పంచీనినాదముల్ పరఁగుచుండ
నమరగంధర్వగానములు దుందుభులని
స్వనము లెయ్యెడల బోరునఁ జెలంగఁ

త్రిదశులువిమానములపయిఁ దేజరిల్లి
యందుఁగలవైభవములకానందమొంద
నప్పుడప్పురవరమొప్పెనరసిచూడఁ
బాకశాసనుఁడేలుస్వర్లోకమనఁగ. ౩౪౭.

క. అంతటమునివరుపంపున
నెంతయుసురధేనువలరియేతెంచిననిం
తంతనరానివిధంబున
వింతగభరతాదులకునువిందుఘటిల్లెన్. ౩౪౮.

సీ. సరసాన్నములుమహాశాల్యాకృతులఁబొల్చె
భక్ష్యములిబ్బలపఙ్క్తులయ్యెఁ
గూరలుఁగాయలుఁగులగిరులనుమించెఁ
బలలంబులద్రులభంగిఁదోఁచె
ఘుమ్మనుఘృతముపెన్గాలువలైపాఱెఁ
బాయసంబమితకూపములునిండెఁ
జిత్రాన్నములుగడుఁజిత్రంబులైయొప్పె
వరుసదధిక్షీరసరసులమరె
నూరుఁగాయలువడియముశ్శైరమీఱె
ఫలరసంబులుమడువులభాగొనర్చెఁ
బానకంబులఘటములుబారుదీరె
నమరధేనువుమహిమనత్యద్భుతముగ. ౩౫౦.

వ. అప్పుడు. ౩౫౧.

క. కిన్నరగంధర్వసతు
ల్పన్నుగఁజనుదెంచిమిగులఁబరిచర్యలొన

ర్పన్నెగడి విందుగుడిచి
    న్నైన్నలరఁగ భరతుఁడఖిలసేనలతోడన్. ౩౫౨.

వ. ఇవ్విధంబున నింద్రుం డమరబృందంబులం గూడి యమృతోపహారం బొనర్చిన తెఱంగున భరతుండు రాఘవార్పణం బని బాంధుజనసహితంబుగా విం దారగించి మృగమదపఙ్కసంకలితం బగుసుగంధగంధానులేపనం బై పారిజాతప్రముఖ ప్రసూనంబుల ముడిచి కర్పూరతాంబూలంబులం దృప్తి నొంది సుఖశయ్యాతలంబున నిద్రించి ప్రభాతంబున మేల్కాంచి యద్దివ్యపురం బదృశ్యం బగుటయు భరద్వాజమునీంద్రునియద్భుతమహిమాతిశయంబున కానందం బంది జననీత్రయంబును సోదరుండును దోడరా నమ్మునివర్యుకడకుం జని ప్రమోక్కిన నతం డాశీర్వదించి యికాంత లెవ్వ రెఱింగింపు మనిన భరతుం డి ట్లనియె. ౩౫౩.

క. వాసవనిభుఁడగురాముని
    భాసురముగఁ గన్న పరమభాగ్యవతిధరి
త్రీసతిసమశమదమ యీ
    కౌసల్యాదేవిఁ గం టె ఘనమునివర్యా. ౩౫౪.

క. ఎడయక శ్రీరఘుతిలకుని
    యడుగుల సేవఁ జెలమిఁ గొలుచునాలక్ష్మణునిం
బడసిన యట్టిసుమిత్రం
    గడుఁ బుణ్యచరిత్ర నిపుడు గనుమి దె యనఘా. ౩౫౫

ఉ. ఏకడుఁ బాపజాతి కొలకీర్తి నిమజ్జనకుండు రాఘవుం
డేకతి నాత్మ రాలిపలు కేర్పడఁ జేయఁగఁ గాన కేగెన
న్నే కపటస్వరూప కనియె మ్మెడ మర్త్యశ మందఁ జేసెనా
కైకనఁ జేక మ్మఁ గుణవికాస మగాంచుమి దే మునీశ్వరా. ౩౫౬

వ. అని గద్గదస్వరంబున దుఃఖించి పల్కు భరతునింగని యాఋషిల్లు
మని భరద్వాజుం డిట్లనియె. ౩౫౭.

క. ఈ కైకాసతి యెంతో
లోకైకహితంబు మర్త్యలోకము మెచ్చ
న్జేకొని యొనర్చె నీకుం
బ్రాకటముగఁ దెలియు నింక భరతమహీశా. ౩౫౮.

ఉ. కావున నిష్ఫలంబితి నిటు కాఱులు పల్కుట మాని రాఘవ
త్మావరుఁ గానఁబొమ్మను చు సంయమి పంపుడు సర్వసైన్యసం
భావితుఁడై పురంబులును బర్వతముల్నదులున్వనంబు లెం
తే వడి మీఱ దాఁటి బహుధీయుతుఁడా భరతుండు నంతటన్. ౩౫౯.

సీ. చిత్రకూటనగముఁ జేరంగఁ జనుదేర
నపుడు రాముఁ డన్నగాగ్రమునను
మోదమలరఁగా వినోదవిహారంబు
సలుపుచుండి పలికెఁ జెలువతోడ. ౩౬౦.

ఉ. ఇంతిరో కాంచితే కనులనిమ్మహనీయగిరీంద్రవైభవం
బెంతని పల్కఁగాఁదగు మహీరుహజాలము లంబరంబు ప
ర్యంతముఁ దోఁచె డిన్నగమృగావులనంతముగా నిరంతరం
బంతట బంతులై చెలఁగి యాడుచునున్న విచింత దోఁచఁగాన్. ౩౬౧.

సీ. ఇరుల నెత్తావిగమ్మని విసరుచుండ
మత్తకోలంబ ఝంకృతుల్ హత్తికొనఁగ
నలవసంతుని కేళీగృహంబులనఁగ
నెగడు పొదరిండ్లఁ దిలకింపు నీలవేణి. ౩౬౨.

క. సెలయేళ్ల ఘుమఘుమారవ
ములు ఋషులని బ్రమసి పక్షులవిష్పకుతూ

హాలముననటనముసల్పుచు
    నలరుమయూరములఁగంటెయంబుజవదనా. ౩౬౩.

క. వనగజకుంభంబులువమ
    చనుఁగవలకుసాటిరాఁగఁజనునేయనివా
నినిగిరిముత్తెములఁగై
    కొనిచనుచెంచెతలఁజూడుకోమలగాత్రీ. ౩౬౪.

వ. అని యనేకవినోదంబు లవనీజాతకుం దెల్పుచు నిచ్ఛావిహారం బొనర్చుచున్న యెడ. ౩౬౫.

క. కరిబృంహితములుసైంధవ
    గురుహేషాధ్వనులుజనులకోలాహలము
ల్భరితస్యందనరవములు
    సరభసమొప్పారరామచంద్రుఁడువినియెన్. ౩౬౬.

క. వినియిదియేలోకోపరసై
    న్యనివహమేతెంచెననుచుననుజన్మునిఁజ
య్యనఁజీరియరసిరమ్మని
    పనిచినసతఁడప్పుడరిగిపటువేగమునన్. ౩౬౭.

మ. ఘనభూజాతమునెక్కి కాంచెనెదుటన్గాకుత్థ్సవంశావనీ
శనిజోద్దండవిచిత్రకేతనసితచ్ఛత్రాదులున్గంధదం
తినికాయంబునగణ్యఘోటకపదాతిన్బ్ఫాపరాగంబుఖం
బునఁగప్పంజనుదెంచుభూరివిసరంబున్లక్ష్మణుండత్తఱిన్. ౩౬౮.

క. కనిభరతుఁడనికిసైన్యముఁ
    గొనివచ్చుటగాఁదలంచిరుటజముడిగిది
గ్గననగ్నిగతినిమండుచుఁ
    జనిరామునిఁగాంచిపలికెసక్రోధుండై. ౩౬౯.

సీ. అడవికీరీతినిన్నుఁ బోనడిచి ధరణిఁ
దానె కైకొనియంతటఁ దనివిసనక
బలములను గూడి చనుదెంచె భరతుఁ డనికి
నెంత లేదని నీశాంతి యింత చేసె. ౩౨౦.

క. ననుఁ బంపుమ తనిఁ దద్బల
మును నిర్మూలంబొనర్చి ముదమునఁ బిర్వ
న్నినుఁ గొల్వవత్తు ననన
య్యనుజానిఁ గని రాముఁ డనియె నతిశాంతమునన్. ౩౨౧.

క. నాతమ్ముఁడైన భరతున
కీతలఁ పెబ్బంగిఁ గలుగు నెఱుఁగఁగవలదే
యోతమ్ముఁడనుం తైన
న్నీతివిచారంబుఁ దెలియ నేరవు సుమ్మీ. ౩౨౨.

గీ. పురము వెడలి మనము పోకన్ చుఁ గాంతార
సీమనుండు టెఱిఁగి చిత్తమునను
గుంది మిగుల శోకమందుట యే కాక
యతని యందుఁ గ్రోధమరయఁ గలదె. ౩౨౩.

క. భరతుఁడు సీకంటెను భ
క్తిరతుఁడు నాకెపుడు మనలఁ దిరుగ నయోధ్యా
పురికిం దోడ్కొని చనుటకు
నరుదెంచుట గాఁ దలంపు మయ్య మనమునన్. ౩౨౪.

వ. అని రామభద్రుండు పల్కుటయు సౌమిత్రి లజ్జావనతవదనుండై యూరకుండె నంత భరతుండు సర్వసైన్యంబులఁ బర్వతసమీపంబున నుండ నియమించి తల్లులం దోడ్కొని రా వసిష్ఠున కనుమతించి సుమంత్రుండును గుహుండును దోడ నడవ శత్రుఘ్నసహి

తుండై యయ్యద్రిరాజం బారోహణం బొనర్చి పర్ణశాల డాయం
జని యనతిదూరంబున రాఘవునిం గాంచి తన మనంబున నిట్లని
తలపోయం దొడంగె. ౩౭౫.

సీ. హాటకమయరమ్యహర్మ్యంబులను వెల్గు
ఘనుఁడు పర్ణకుటీరమున వసించె
హితబంధురాజిసహితముగఁ గొల్వుండు
ఱేఁడు మృగంబులఁ గూడి చెలఁగెఁ
బలువన్నె చేలముల్ పాటించి ధరియించు
దిట్ట వల్కలములఁ గట్టఁ దొడఁగె
రత్నకిరీటవిభ్రాజితుండగు ధీరుఁ
డెడపక శిరమున జడలు దాల్చె
నిట్టి దుర్దశలకు మది నెట్లు సైఁతు
నహహా విధికృతమిది యనియడలి బడలి
చేఁజను దెంచి యెన లేని చింతతోడ
వికృతవేషుని శ్రీరామవిభునిఁ గనియె. ౩౭౬.

క. కనిచనికరములఁ దత్పద
వనజాతంబులకు మ్రొక్కి వదలని దుఃఖం
బున రోదన మొనరించుచుఁ
దన సన్నిధి నిలువ రామధరణిపుఁ డంతన్. ౩౭౭.

క. అనుజన్ము లఘనముగ ప్రియ
మున నూఱార్చుచును మంత్రిముఖ్యుని గుహుని
న్మనిచి భరతునిఁ గనుంగొని
తన చెంతకుఁ జేరి పల్కెఁ దయ పెంపారన్. ౩౭౮.

గీ. భరతయేలయయ్యపార్థివత్వముమాని
మౌనివృత్తిఁబూనిమమ్ముఁబోలి
గురుమృగావళులనుగూడివర్తింపంగ
నడవులకునువచ్చితకటయిట్లు. ౩౭౯.

క. ధరణీశునకుశుభంబే
నిరతముఁదల్లులకుసుఖమెనెఱిబంధువులం
బరిపాలింతువెయనిన
స్మరతుండిట్లనియెశోకభరితుండగుచున్. ౩౮౦.

క. అడవులకునీరలరుగఁగఁ
బుడమీశుఁడుచింతచేనెపుడుభవదాఖ్యన్
నుడువుచునేడవదినమునఁ
బడసెన్సురలోకపదవిభవ్యవిచారా. ౩౮౧.

గీ. ఏనుబితృకార్యములఁదీర్చియిపుడుమిమ్ముఁ
గానవచ్చితిననుడుఁబెన్గాలిఁదూలు
తరువుకైవడిరాముఁడుధరణిమూర్ఛఁ
గూలితెలివొందిపెనుచింతఁగుందుచుండె. ౩౮౨.

క. సీతయునులక్ష్మణుండును
భూతలమునఁబొరలిశోకపూరితమతులై
రాతఱిఁగౌసల్యాదులు
నేతేరఁగనెల్లవారలేకముగాఁగన్. ౩౮౩.

క. కడుముఖరారావంబుల
నడరింపవసిష్ఠుఁడుడిపెనంతటరాముం
డడయకసురనదికినరిగి
నడపెన్గర్మములుకడగనస్నాంగముగాన్. ౩౮౪.

వ. ఇట్లు పితృకర్మ విముక్తి నొంది మఱలి పర్ణశాలం జేరె నా సమయం
బున దినాంతం బగుటయు నా రాత్రిఁ గడపి మఱునాఁటి ప్రభాతం
బున సంధ్యాదికృత్యంబులం దీర్చి మునిగణంబులు పరివేష్టింప దర్భా
సనాసీనుం డైయున్న రామచంద్రునిచరణకమలంబులకుఁ బ్రణమిల్లి
యంజలిబద్ధుం డై నిలువంబడి భరతుం డిట్లనియె. ౩౮౫.

క. దేవారాఘవవైకా
దేవినినున్వ్యాపినములకుదీసత్వమునం
బోవంబనిచినమునిక్రియ
నీవకుదేరంగఁజనునెనిజముఁగనసఘా. ౩౮౬.

క. నీపాలివెలయుసర్వమ
హీపాలనమేనొనర్పనెంతటివాఁడ
న్నీపాదంబులఁగొలుచుట
కాపాటిధృఢంబుగల్గనంతయెచాలున్. ౩౮౭.

క. రమ్ముపురమ్మునకును జే
కొమ్ముమహీభారమిపుడెకూరిమిమీఱ
న్నమ్మెల్లఁబ్రోవుమీవర
మిమ్మిమ్ముగనొల్లననకయినకులతిలకా. ౩౮౮.

క. పతిలేనిసతిగతిదివ
స్పతిలేనియహంబుకిరణిఁబరఁగునయోధ్యా
క్షితికీవెభర్తగాకది
సతిమగనేయొనులకెన్నసర్వజ్ఞనిధీ. ౩౮౯

వ. అదియునుంగాక. ౩౯౦

సీ. కంఠీరవమువెల్గుఘనగుహాంతరమున
ఫేరవంబుండిశోభిల్లుటెట్లు

ఘానుఁడు వృషసూపుపర్వతంబున మిణుం
    గురుపుర్వు ప్రాఁకి తేజరిలు టెట్లు
వాసుకిశిరమున మోసిన భువనము
    ల్లోనసిజల వ్యాళమును చు టెట్లు
లజుని చే నిర్మితంబగు నిఖిలంబును
    నజము తాఁగలిగింపనలరు టెట్లు
భవ్యుఁడగు నీవు వెలసెడు భద్రపీఠి
    సేవసింపఁగఁ గోరుట నీతియగునె
కానఁ నే నొల్ల రాజ్యంబుఁ బూనుటకును
    వేగ విచ్చేయుమయ్య వివేకధుర్య. ౩౯౧.

క. అటుగా దేనియు నీ క్రియ
    నిటుముని వేషంబుతోడ నేనీ వెంటం
బటుగతి వనములను జరిం
    చుట యేనామతము నిజము సుమ్ము మహీశా. ౩౯౨.

వ. అనిన భరతునిం గాంచి దరహాసితవదనుం డగుచు రామభద్రుం
డి ట్లనియె. ౩౯౩.

క. జనకుఁడు నిను ధరణీపా
    లనమునకున్ నన్ను నడవులను బదునాల్గేం
డ్లను ప్రొదఁ జరించుటకుం
    బని చెం గావునను ద్రోయఁబడునే చెపుమా. ౩౯౪.

గీ. అనఘ వినుపితృవాక్యపాలనము మనకు
    సరియె కావున నొండనఁ జనదు నీకు
ధర్మమార్గంబు దప్పకత విలిన్నడవ
    నిహపరసుఖంబులోనఁగూడు టెఱుఁగవలదె. ౩౯౫.

వ. కావున. ౩౯౬.

చ. పురమునకేగిరాజ్యపదభోగములందిధరిత్రియెల్లదో
షరహితమైచెలంగనరిసంఘములార్తిఁగలంగనేలుచు
న్గురుబుధబంధుజాలములకోర్కెలొసంగుచుభృత్యకోటుల
న్నిరతముఁగాంచిప్రోచుచునునిర్మలచిత్తుఁడవైచరింపుమా. ౩౯౭.

క. ఆనికృతనిశ్చయుఁడగుచును
మనుకులజుఁడుపల్కెనచటిమానులునింకం
జెనఁటియగుదశముఖాసురుఁ
డనిఁగూలునటంచునెంచిరాత్మలలరఁగాన్. ౩౯౮.

వ. అంత భరతుండు రామభద్రుని మఱలింపనోపమి నంతరంగంబున నత్యంతచింతాసమగ్రుండై వగచుచు మఱల నిట్లనియె. ౩౯౯.

గీ. పటుతరంబైనయుష్మహీభారమూన
నన్నయేనెటులోపుదునట్లుగాన
భవహరములగుభవదీయపాదుకలనొ
సంగుమర్ఘ్యాసనమునవెలుంగుటకును. ౪౦౦.

క. సకలవ్యవహారంబుల
నకలంకమతింగ్రహించియలరభవత్పా
దుకలందర్పించుచునే
నొకభంగిఁజరించుచుందునుర్వీరమణా. ౪౦౧.

క. పదునాల్గువత్సరంబులు
సదయాత్మకతావకాజ్ఞనలుపుదుమఱియొ
క్కదినంబధికంబైనను
సొదఁజేర్చుకచొచ్చువాఁడఁజుమ్మునిజముగాన్. ౪౦౨.

క. అనిభరతుఁడిట్లుపలుకఁగ
వినిరాఘవుఁడాత్మనెంచివినతామరహృ
ద్వనజాతనివాసితమగు
తనపాదుకలపుడొసంగెదయఁబెంపారన్. ౪౦౩.

వ. ఇట్లు భరతునకు రాఘవుండు నిజపాదుకాయుగళం బొసంగి కౌఁగ
లించి దీవించి శత్రుఘ్ను నాదరించి తల్లుల ననునయించి వసిష్ఠాదు
లకు నమస్కరించి నిఖిలబంధుజనసముదయంబుల మన్నించి పుత్తెం
చిన నందఱు నప్పర్వతం బవరోహించి తమతమవాహనంబు లెక్కి
యయోధ్యాభిముఖులై చనునప్పుడు భరతుండు. ౪౦౪.

సీ. గజముపైనలపాదుకలనుంచిగరిమమై
మౌక్తికచ్ఛత్రచామరములొసఁగి
తానుఁదమ్ముఁడుఁగొల్వఁదగుమానివర్గము
ల్గదిసిరాసైన్యసంఘములునడవ
వందికీర్తనములింపొందుమంగళవాద్య
మందందమిగులమిన్నందిమ్రోయ
ఘనదుర్గములునదుల్గాంతారములుఁగ్రమం
బునదాఁటిసాకేతపురముఁడాసి
జనులమఱిబంధుజనములనెల్లవా
రలనువిడిచిరామరహితమగుటఁ
జేసియచటనుండకోసినందిగ్రామ
మునవివాసియగుచుననుదినంబు. ౪౦౫.

గీ. కనకపీఠంబునను బాదుకలనమర్చి
యఖిలభూభరణంబుఁదదర్పితంబు

గా నొనర్చుచు రాఘవాగమన మెపుడు
భావమునఁ గోరుచుం డెనా భరతుఁ డంత. ౪౦౬.

క. అజగర రాజశయనమా
నిజనస్వాంత నిజసదన నిర్జితవృజనా
త్రిజగద్వందితచరణా
రజనీచరగహనదహనరవిశశినయనా. ౪౦౭.

మాలిని. అరిదరధర వీరా హాటకగ్రావధీరా
కరివరపరిపాలా గానవిద్యావిలోలా
చిరతరదరహాసా సింధుజాహృన్నివాసా
వరనరహరిరూపా వైరిభీమస్వరూపా. ౪౦౮.

గద్యము. ఇది శ్రీమదుత్తరరంగనాథకరుణాకటాక్ష వీక్షాసమాగత సరస కవితావైదుషీప్రవీణ పరమవైష్ణవకులకలశజలనిధిసుధాకర రామానుజ దేశికగర్భశుక్తిముక్తాఫలాయమాన శృంగారసారసంగ్రహాభిఖ్య లక్షణగ్రంథనిర్మాణధురీణ ప్రహ్లాదచరితయక్షగానవిధాననిధాన గాన విద్యానూన పాండితీస్థాన రంగయాభిధాన ప్రణీతంబైన శ్రీమద్రామోదయం బనుమహాపురాణంబునం దయోధ్యాకాండం బన్నది ద్వితీయాశ్వాసము.

---

# అరణ్యకాండము.

శ్రీలలనాస్థోరస్స్థల
బాలేందుధరార్చితాంఘ్రిపద్మయుగళసఁ
శీలజగద్విఖ్యాతవి
శాలోత్తరరంగకలుషసంఘవిభంగా. ౧.

వ. అవధరింపుము. ౨.

సీ. చిత్రకూటమునవిచిత్రవైఖరినుండి
రాఘవుండునిజాంతరంగమునను
దలపోసిమఱియయోధ్యాపురజనములు
పలుమఱునిటకురాఁగలరుగాన
నిచ్చోటుదగదనియచ్చటిసన్మౌను
లనుగనిపీడ్కొనిఘనతమీఱఁ
దద్గిరీంద్రముడిగ్గితమ్ముఁడుసీతయుఁ
దనుఁగొల్చిరావనాంతరములందుఁ
గ్రుమ్మరుచునత్రిమునిమహాశ్రమమ్ముఁజేరి
యమ్మహాత్మునిదర్శించియతఁడొనర్చు
పూజనములందియుండఁడభూమిజాత
నరసియనసూయమదిలోననాదరమున. 3.

క. ఘనమగువాఁడనివినులే
దినమునుమలినంబుగానిదివ్యదుకూలం
బనుపమమణిభూషణములు
దనివారనొసఁగిపల్కెఁదద్దయుఁబ్రీతిన్. ౪.

క. అమ్మాసీతలిదండ్రులు
సమ్మతినెటనుండు రెట్లుసరసుఁడు రాముం
డిమ్ముగ నినువరియించెను
సమ్ముదమునఁ దెల్పుమిపుడు చయ్యన నాతోన్. ౫.

వ. అని యనసూయాదేవి యడుగుటయు జనకనందన దరహసితానన యై యిట్లనియె. ౬.

సీ. వినవమ్మ జనకభూవిభుఁడను మిథిలేశుఁ
డధ్వరంబొనరింపన వనినొకట
దున్నుటయును నేనుదోఁచితి బాలనై
ధాత్రీశుఁ డాత్మీయపుత్త్రిగాఁగఁ
గొని సీతయను నామ మొనరించి నన్నుఁ బెంచి
యౌవనంబరుదేర నంత నెఱిఁగి
తన యింటఁ గల శూలిధను వెక్కువెట్టిన
వీరున కిత్తుని వ్వారిజాక్షి
ననుచుఁ జాటింపనిఖిలధరాధినాథు
లలరి చనుదెంచి విల్లెత్తనలవిగాక
తిరిగి యరిగిరి సిగ్గున దెసలుదప్పి
యొకరు చనుత్రోవ మఱియు వేఱొకరు చనక. ౭.

ఉ. అంతట గాధిసూనునిసహాయమునం బలితెంచి రాఘవుం
డెంతయు బాహువిస్ఫురణ మేర్పడ వారణ మిక్షుదండము
న్వింతగఁ ద్రుంచు భంగి హరువిల్లును మాడిన నువ్వరించి శ్రీ
కాంతుఁ డితండనన్ వినుతిఁ గాంచె జగంబున నెల్లదిక్కులన్. ౮.

క. అనిజనకజ వల్కినవిని
యనసూయ ముదంబునొందె నా సమయమునన్.

దినవాథుఁడస్తమించిన
జననాథులొనర్చి రెలమి సాంధ్యక్రియలన్. ౯.

వ. అంత. ౧౦.

క. అత్రిమునియాశ్రమమున నారాత్రిఁ గడపి
యుదయమున నిత్యకర్మంబు లొనరఁ దీర్చి
యతని వీడ్కొని యమ్మువ్వురతిరయమున
నదులు వనములు దాఁటుచు నడచి నడచి. ౧౧.

శ్రీరామలక్ష్మణులు దండకారణ్యముఁ జొచ్చుట.

గీ. భానుకులజులు గాంచి రపార ఘోర
గండభేరుండ వేదండ ఖడ్గ గవయ
కాండ సంశోభితంబై యగణ్యమునిశ
రణ్యమై యొప్పు దండకారణ్యమపుడు. ౧౨.

వ. ఇట్లు నానామృగసంకులభీషణారావంబును, దాలతమాలహింతాల రసాలసాలాశ్వత్థకపిత్థజంబుజంబీరాది శాఖోపశాఖతండంబు లగు మహీజాతంబులును, మహాభీలశైలజాలంబులును, బారావారోపమానపుణ్యాపగాసముదయంబులును, నిరంతరవ్రతధ్యానపరాయణ తపోనిష్ఠాగరిష్ఠమౌనిజనాకీర్ణపర్ణకుటీరంబులుం గలిగి మహోద్దండం బగుదండకారణ్యంబుఁ బ్రవేశించి పుష్పగంధసంభరితమందగంధవహంబున కామోదించుచు మధురసపూరితఫలంబులం దృప్తిఁ బొందుచు నిర్మలోదకపానంబులం దనియుచు భూరిభూరుహచ్ఛాయల విశ్రమించుచు హోమధూమవేదనాదంబుల నొప్పు పుణ్యాశ్రమంబుల నివసించుచుఁ జనుచున్నయెడ నమ్మహాగహనమధ్యంబునందు.

రాఘవుండు విరాధునిఁ దునుముట.

గీ. పక్షములుగల శైలంబుపగిదిఁ దనరి
పాదఘాతపరాగ మంబరముఁ గప్ప
శూలమంకించి కనులగ్నికీలలొలుకఁ
జూచుచు విరాధుఁ డటు పొడసూపుటయును. ౧౪

క. ఇనకులులద్దనుజునిఁ గని
మనమున వెఱఁగందుచుండ మైథిలి నసుఖం
డొనరఁ గొనిదివికి నెగసెను
వినతాసుతుఁ డహినిఁ గొంచు వెస నేగు క్రియన్. ౧౫

క. ఈకరణి నద్దురాత్ముఁడు
భీకరముగ నార్చి పేర్చి పృథ్వీజాత
న్జైకొని దివమున నిలఁబడి
యా కాకుత్స్థులను గాంచి యపుడిట్లనియెన్. ౧౬

ఉ. మానవులార మీరలను మానము నొందక నావనంబునం
బూనిచరింపఁగాఁ దగునె భూరిశరాసనపాణులైవినుం
డేను శతహ్రదాత్మజుఁడ నెన్నఁగఁ దండ్రి జయుండు ధారుణి
న్దానవవంశజాతుఁడను దారుణవిక్రముఁడన్ విరాధుఁడన్. ౧౭

క. శరములశస్త్రంబులసం
గరమున మృతిలేనివరముఁ గమలజుఁ డొసఁగె
న్సుర లెల్లవెఱచి పఱువఁ బడ
నరులెన్నఁగ నెంతవారు నాతోఁ బోరన్. ౧౮

ఉ. కావున నిత్తలోదరిసిఁ గానుక వెట్టి వనంబుఁ బాసి మీ
రేవగనైనఁ బ్రాణముల నేర్పడఁ గాచికొనుండు పొండనన్

దావహుతాశనాకృతినుదగ్రత వెల్గుచు కోషభీషణా
రావమునన్నిశాటుఁగని లక్ష్మణుఁడిట్లనియెం గఠోరతన్. ౧౯.

క. ఓరివిరాధుఁడ దుర్మతి
వైరాముని దేవిఁగొనఁగనగు నే నీకు
న్గ్రూరాస్త్రరాజి నిన్ను
న్ధారుణిఁబడ వైతు ననుచు దారుణభంగిన్. ౨౦.

క. కుటిలభ్రూకుటితోడ
న్నిటలాక్షుండనఁగ నొప్పి నిలువంబడి తాఁ
బటు నిర్ఘాతోపమశర
పటలిన్లక్ష్మణుఁడు వఱపె బలువేగమునన్. ౨౧.

వ. అంత. ౨౨.

ఉ. దానవుఁడుగ్రకోపమునఁ దార్కొని శూలముఁ ద్రిప్పి వైవఁగా
భానుకులుండు రాఘవుఁడు పావకసన్నిభ మార్గణంబునం
దానిహరింపఁగాఁ బ్రబలదండధరోపముఁడైన దైత్యుఁడా
జానకిఁ గ్రూరతం ధర వెసంబడవైచి నరాముఁడత్తఱిన్. ౨౩.

క. గరుడాస్త్రంబున సీత
న్ధరఁబడకుండంగఁ దిగిచి దనుజుని మేన
న్శరములు గుప్పెను జలదము
వరశైలముపైనిఁ గురియు వర్షము భంగిన్. ౨౪.

వ. ఇట్లు. ౨౫.

చ. భువనభయంకరాకృతులఁ బొల్చుచుఁ బైఁబడు బాణపఙ్క్తిఁ బో
వవిద్రిచి యార్భటించుచును వచ్చి మహోగ్రతతోడ నిల్చి యా
రవికులవర్యులం దనకరంబులఁ బట్టుక మూఁపునందుఁ జే
ర్చి వడిగ నంబరస్థలముఁ జేరె విరాధుఁడు రాతిభీముఁడై. ౨౬.

వ. ఇట్లు విరాధుండు రామలక్ష్మణుల మూఁపున నిడికొని నభోమార్గంబున కెగసిన నా జానకి యుపరితలంబు వీక్షించుచు రోదనంబొనర్ప నంత నా దాశరథులు మెల్లన మెఱుఁగుఁదీఁగెలం బోలు ఖడ్గంబుల నొఱ లూడ్చి కేల నమర్చి వానిబాహుద్వయంబు ఖండించిన నా రక్కసుండు వజ్రనిహతిం గూలువసుధాధరంబుకరణిం బడుటయు దశరథాత్మజులు పదతాడనంబుల నసువు లెడఁబాపఁ దొడంగ నతం డయ్యెడలు వీడి గంధర్వరూపంబున దివ్యవిమానారూఢుండై నిలువంబడి యా రామభద్రునిం గాంచి నమస్కరించి వినుతించి యి ట్లనియె. ౨౭.

క. జననాథ యేనుదుంబురుఁ
డనుగంధర్వుఁడనురంభనంగజకేళి
న్దనుపుచుఁ గొలువునకరుగుట
కునుదడసినధనదుఁ డెఱిఁగికోపముతోడన్. ౨౮.

క. మానగురూపమువిడియొక
దానవుఁడైయుండుమనుచుఁ దాశపియించెం
గానటులగుచు మెలఁగితి
నీనాఁటికినీదుకరుణ నేఁగడఁ గంటిన్. ౨౯.

క. పోయెదనాయున్కికిని
కాయముధరఁబూడ్చివిమలకాయులరైమీ
రీయడవిఁబాసిచనుఁడిం
కేయెడకైననిపల్కి యేగెనతండున్. ౩౦.

శ్రీరామలక్ష్మణులు శరభంగునియాశ్రమముఁ జేరుట.

వ. అంత. ౩౧.

క. ఇనవంశజులువిరాధుని
తనువున్ధరఁబూడ్చిమానితతులగ్గింపం

జనిశరభంగమహామునిఁ
గనువేడ్కఁదదాశ్రమంబుఁగదియుదునవుడున్. ౩౨.

చ. అమలమణిప్రభాలసితమైతగుదివ్యవిమానరాజమా
శ్రమముననుండిచయ్యనదిశల్వెలుఁగొందఁగనూర్ధ్వలోకమా
ర్గమునఁజనన్రఘూద్వహులుకన్నులపండువుగాఁగఁగాంచినె
య్యమునమహాతపోధనునినాశరభంగునిఁజేరినమ్రులై. ౩౩.

గీ. వినతులొనరించితమరాకవిశదముగను
దెలుపవినిమౌనివర్యుఁడాతిథ్యమొసఁగి
క్రమముమీఱంగనర్ఘ్యాసనములనునిచి
రామభద్రునిఁగాంచిసంభ్రమముఁబెంచి. ౩౪.

క. నిగమంబులరసికానని
జగతీశుఁడుదనకుఁదానెచనుదెంచెనునా
దగుభాగ్యమహిమననితా
నగణితగుణధాముఁరామునటఁబూజించెన్. ౩౫.

వ. అంత రామభద్రుం డంతరంగంబున నుప్పొంగి శరభంగమహాముని పుంగవునాననం బాలోకించి సుధారసమధురంబు లగువచనంబుల నిట్లనియె. ౩౬.

చ. మునివరయేమిమిమ్ముఁగనమోదితులైచనుదేరనిప్పుడీ
వనముననుండివెల్వడిదివంబుననొక్కవిమానమేగెనే
ఘనుఁడరుదెంచినప్పుడయిక్రమ్మఱఁబోయెనుదత్క్రమంబునే
వినఁదగునేనివీనులకువిందొనరింపుముతెల్పిసంయమీ. ౩౭.

వ. అనిన శరభంగమహామునీంద్రుఁ డానందకందళితహృదయారవిందుం డై రామచంద్రున కిట్లనియె. ౩౮.

క. అనఘపరమేష్ఠిలోకం
బునకున్ననుఁబిల్చిచనియెఁబురుహూతుండా
తనిదివ్యవిమానంబది
నినుమదిదర్శింపఁగోరినిలిచితినిచటన్. ౩౯.

గీ. కంటిరఘురామనీమూర్తికన్నులలరఁ
దలఁపులెల్లనునిండెనాతపముఁబండె
ధన్యుఁడనుసర్వవిబుధసన్మాన్యుఁడనయి
జన్మసాఫల్యమందితిజగములోన. ౪౦.

క. ఘనుఁడైనసుతీక్ష్ణమహా
మునియాశ్రమమొప్పుచుండుముందఁగనందుం
జనివసియింపుఁడుమీరలు
పనివినియెదననుచుఁబల్కెభావజ్ఞుండై. ౪౧.

క. మునిపతిశరభంగుఁడురా
మునిపరతత్త్వంబుహృదయమునఁజొన్పుచునా
వనగుహాభవలోకమునకు
ననలముఖంబుననుజనియెనమరులువొగడన్. ౪౨.

వ. అంత రామభద్రుం డమ్మునీంద్రునద్భుతమాహాత్మ్యంబున కంతరంగం
బున నచ్చెరు వొందు చున్న యవసరంబున. ౪౩.

సీ. అయ్యాశ్రమంబుననలరుతాపసవర్య
లనిలభక్షకులుజలాశనులును
వైఘానసులుమౌనవంతులనశనులే
కాంతులుదాంతులుశాంతియుతులు
వాలఖిల్యులుపర్ణశాలావిహీనులు
పంచాగ్నిమధ్యగుల్బహువయస్కు

లాదిగాఁగలమౌనులందఱుఁగూడి
చనుదెంచి రామునిశరణు చొచ్చి
దేవ రాఘవమాపాలిదిక్కు నీవ
రక్కసులుకక్కసంబుననుక్కుమీఱి
యెపుడుమాయాశ్రమంబులఁగపటవృత్తి
నెందువ్రతశీలములఁబాపుచుందురనఘ. ౪౪.

క. రక్షింపుముమాక్రతువుల
వీక్షింపుము మేమొనర్చువివిధవ్రతము
ల్శిక్షింపుముదుర్మతులగు
రాక్షసులన్వీడువకరసిరఘుకులతిలకా. ౪౫.

క. అనిమొఱలిడుమునివర్యులఁ
గనిరాఘవుఁడూఱడించికరుణాత్మకుఁడై
దనుజులనుద్రుంచిమిమ్మే
ననవరతముఁగాచెదననియభయంబొసఁగెన్. ౪౬.

రామలక్ష్మణులు సుతీక్ష్ణాశ్రమముఁ జేరుట.

వ. ఇట్లు శరభంగమహామునియాశ్రమవాసు లగుమౌనిపుంగవుల కభయప్రదానం బొసంగి వీడ్కొని సీతాలక్ష్మణసహితుండై రాఘవుం డవ్విపినంబునం జని చని సుతీక్ష్ణాశ్రమంబుఁ జేరం బోవుటయు నతం డెఱింగి మునితండంబులం గూడి యెదు రేగి యానతు లంది వారలం దోడ్తెచ్చి యుచితాసనంబుల నునిచి యాతిథ్యం బొసంగి పూజించి యిష్టగోష్ఠి నుండునవసరంబున నయ్యాశ్రమంబునం గల మునిసంఘంబు లా రామభద్రునిం గాంచి యి ట్లనిరి. ౪౭.

చ. రవికులసార్వభౌమనిజరాజ్యరమావిభవంబుఁబాసిమా
నివగుచుఁజిత్రకూటమునునిశ్చలచిత్తమునన్వసించుచో

మునివిమదిన్నినుంగనఁగమోదముతోడుతఁగోరుచుందుమో
భువనపవిత్రమావ్రతతపోవిభవంబుల నెంచిప్రోవుమా. ౪౮.

కం. దనుజులుగుమురులుగట్టుక
దినదినము మదాంధులగుచుఁ దెంపున మామా
వనములకు గాసి చేయుచుఁ
జనుచున్నారేమి తెల్పఁ జననవనీశా. ౪౯.

సీ. అగ్రహంబున మాయాశ్రమంబులఁ జొచ్చి
సోమపానముఁ గ్రోలి సురలఁ ద్రోలి
హోమవేదులఁ గూల్చి యూపంబులను గల్చి
స్రుక్స్రువంబుల నెల్లఁ జూఱఁబుచ్చి
తపములఁ జెఱచి పాదపముల ఖండించి
ఫలముల దుల్చి పుష్పముల రాల్చి
జపమాలికలఁ ద్రెంచి జన్నిదంబుల నూడ్చి
పర్ణశాలల నుర్విఁ బడఁగఁ ద్రోసి
కపటవృత్తుల నవేళఁ గఠినులగుచు
బాధలొనరించు దైత్యుల బారిఁ జిక్కి
దిశలు గాంచుచు నెవరేని దిక్కు లేమిఁ
గలఁగుచున్నార మిమ్మహాగహనమునను. ౫౦.

కం. నీయంత రాజు గలుగఁగ
దాయలకైవగ వమాకుఁ దగదటు గానన్
బాయక యమ్ముఁ గావుము
తోయజసన్మిత్రవంశతోయధిచంద్రా. ౫౧.

వ. అని యమ్మునివర్యు లత్యంతదీనాలాపంబులు పల్కుటయును. ౫౨.

ఉ. దానవకోటులం గదిసి దారుణభంగి నెలంగ బాణసం
ధాన మొనర్చి యంతకుని ధామముఁ జేరఁగఁ బుత్తు నింక మీ
ధ్యానములున్ దపంబులును దప్పక చేయఁగ నొప్పునంచు నా
భానుకులుండు మౌనిజనపఙ్క్తికొసంగె వరంబుఁ బ్రీతితోన్. ౫౩.

వ. అంత. ౫౪.

గీ. వారలుత్సహించి వలనొప్పఁ బూజింపఁ
బుణ్యకథలు వినుచుఁ బుణ్యులైన
మునులగోష్ఠి నెపుడు ముదమందు చుండిరి
దాశరథులు ఘనకృపాశరథులు. ౫౫.

గీ. అచట నున్కి గాఁగ నధివసించుట విని
యఖిలమునిగణంబు లరుగుదెంచి
దశరథాత్మజులను దమయాశ్రమములకుఁ
బ్రేమ రండటంచుఁ బిల్చుటయును. ౫౬.

క. రాముఁడు పుణ్యాశ్రమములఁ
బ్రేమను గన నాసుతీక్ష్ణప్రేరణ నటులన్
సామోదంబున వెడలెను
సౌమిత్రియు జనకజయును సంగడి నడవన్. ౫౭.

వ. ఇట్లు మునిజనాశ్రమంబులఁ గనువేడ్కం జనుచున్నయెడ రామ
భద్రునితోడ సవినయంబున జనకనందన యిట్లనియె. ౫౮.

చ. వనమునఁ దాపసాకృతుల వాసమొనర్చి వ్రతంబు సల్పవ
చ్చిన మనపూనికిన్ దీర్చి పురిఁ జేరెదు కోర్కెలమాని యీక్రియ
న్మునులకునై నిశాచరుల మున్నొకనిం ద్రుంపఁగఁ గోరఁ జెల్లునే
యినకులవార్ధిచంద్ర పరహింసలొనర్చుట పాపమే కదా. ౫౯.

గీ. తన్నుఁ ద్రుంపఁగోరు తాటకినైనను
    జంపఁదగునటం చ్రుజగతిలోనఁ
బరులకొఱకు నెరులఁ బట్టివధించిన
    కర్మసంచయంబుఁ గడవఁ దరమె. ౬౦

క. మునులకు వరమిూవైసఁగిన
    దినమాదిగ నాదుమదికి దిగులు జనించె
న్మనివృత్తిఁ గాననంబున
    దినములు గడపుటయె మేలు ధీరశిఖామణీ. ౬౧

వ. అనిన రాఘవుండు దరహసితాననుండై జనకతనూజాత కిట్లనియె.

క. శరచాపంబులు జేకొని
    ధరణీశ్వరియించుట నృపధర్మపరులు వే
శరణాగతులను విడువక
    పరిపాలించుటకుఁ గాదె పంకజనయనా. ౬౨

క. దానవుల నెల్లఁ దునిమి
    మానుల రక్షింతు నని ప్రమాణంబు గనేఁ
బూని పలికి యిటు తప్పిన
    భానుకులంబునకు మఱియపయశము గాదే. ౬౩

గీ. విడుతుఁ బ్రాణమైన విడుతు నిన్నైనను
    విడుతు ననుజునైనఁ దడవు మాని
విడువఁదగునె మానివిభుల సన్నిధి నిల్చి
    పలికినట్టి ప్రతినఁ బద్మవదన. ౬౪

వ. అని దాశరథి పలికిన విని విశ్వంభరాత్మజ తల వాంచి యూరకుండె నంత నమ్మువ్వురుఁ దాపసాశ్రమంబులు డాయం జని. ౬౫

క. భాసురముగ నొకచోటా
 న్స్నానంబులు నొక్కచోటఁ ద్రిమానంబులుగా
వేసరక మునివనములని
 వాసంబొనరించిరంత వానవసతులై. ౧౭.

గీ. మునిజనాశ్రమముల ముదమున వెలయుచుఁ
 దిరుగుచుండునట్టి తెరువునందు
యోజనాయతముగ నురుతరంబై యొప్పు
 కొలఁకుఁ గాంచి మఱియుఁ గోర్కెలలర. ౧౮.

క. ఆకొలని నడుమ నెంతయుఁ
 బ్రాకటముగ గీతవాద్యబహునాదముల
న్నాకస్థుల స్మృతంబుగ
 నాకర్ణించుచు నిలిచి యయ్యెడ నొకటన్. ౧౯.

గీ. ధర్మభృతుఁడను తాపసోత్తమునిఁ గాంచి
 మౌనివర యీసరోవర మధ్యమందు
సమధురముగ వాద్యఘోషముల తెఱఁగు
 దెలియ మాతోడ నానతీవలయు ననిన. ౨౦.

సీ. అతఁ డిట్టులనియె నో యనఘ శ్రీరామ యీ
 సరసిజాకరమందు సతతంబు
ఘనపుణ్యుఁడగు మాండకర్ణి తపోనిష్ఠ
 లొనరించుచుండంగ నుర్వి లేమి
విబుధేంద్రుఁ డత్తపోవిఘ్నంబొనర్చుట
 కచ్చర లేమల నైదుగురను
బనుప వారలు సని భార్యలై మెలఁగుచు
 నాటలఁ బాటల ననుదినంబు

నతనిమదికిఁబౌనఃపున్యతదారవంబు
వినఁగనయ్యెడునదెసుమ్మువింతదోఁప
రఘుకులాధీశపంచాప్సరంబనంగ
వఱలునది మొదలీసరోవరము వింటె. ౨౧.

చ. అనవుడుమాండకర్ణికపుడంజలిచేసిరఘూద్వహుల్వడి
స్వనములనద్రులన్నమలవన్నెమెకంబులఁబుణ్యభూముల
స్మునులవరాశ్రమంబులనుముఖ్యమహీజలతాగృహంబుల
ఘ్ననతరసత్తటాకములఁగన్నులపండువుగాఁగఁగాంచుచున్. ౨౨.

క. కాకుత్స్థాన్వయులిట్లుమ
హాకుతుకంబమరమునిజనాశ్రమములలో
నేకతమునఁబిలుదివియక
తేకువదశవత్సరములుదిరిగికడంకన్. ౨౩.

మ. ఘనుఁడైవట్టిసుతీక్ష్ణుఁగానఁగమదిన్గాంక్షించియేతెంచియ
య్యనఘున్గన్గొనినమ్రులైయతనిచేనాతిథ్యముల్పొందిత
ద్వనిఁగొన్నాళ్లువసించికుంభభవుసేవన్గోరియచ్చోటిమౌ
నినికాయంబులయాజ్ఞఁగైకొనిమదిన్నిండారుహర్షంబుతోన్. ౨౪.

గీ. దక్షిణంపుదెసకుఁదగనేగివనములు
నదులుగిరులుదాఁటినాగ్గిమోజ
నములుగడచిసంభ్రమముననగస్త్యును
జన్మఁగాంచిమ్రొక్కిసన్నుతించి. ౨౫.

క. అయ్యినకులేశుఁడిట్లను
నెయ్యంబలరారమౌనినేతంగనిమో
యయ్యయగస్త్యమునీంద్రుం
డెయ్యెడపసియించియుండునెఱిఁగింపఁగదే. ౨౬.

వ. అవియునుంగాక యమ్మహాముని మున్నిల్వలవాతాపు లనురక్కసుల
నుక్కణంచె నని విందు మత్తెఱంగు సాంగంబుగా నెఱిఁగింపు మనిన
నగస్త్యానుజన్ముఁడు రాఘవున కిట్లనియె. ౨౨.

సీ. వసుధేశ యిల్వలవాతాపులను ఘోర
రాక్షసుల్మున్నీయరణ్యమునను
గలరందువాతాపిఘనమేషమగుటయు
నిల్వలుండుమహామునీంద్రుఁడగుచుఁ
దద్దినంబనిపల్కితాపసోత్తములను
గొనివచ్చితన్మేషమునువధించి
వండిపెట్టఁగమునివర్యులుభుజియించి
యింపొందుచుండుచోనిల్వలుండు
రమ్మువాతాపియనసుదరంబుఁజీల్చి
కొనిబయల్వెడునిట్టులాకుటిలదనుజు
లెప్పుడుమునిజనకోటులఁగపటవృత్తి
నొక్కటనువధియింపుచునొక్కనాఁడు. ౨౩.

వ. అనఘాత్ముండగుకుంభసంభవునిఘోరారణ్యమార్గంబునం
గనియాయిల్వలుఁడోలిఁబిల్చికుడువంగాఁజేసికౌటిల్యభా
వనతోడన్మఱిభోజనాంతరమునన్వాతాపిరమ్మంచుఁజీ
రనగస్త్యుండనెజీర్ణతంబొరసితారానేర్చునేపిల్వఁగాన్. ౨౪.

క. అనుపలుకులువినిక్రోధం
బుననిల్వలుఁడమ్మునీంద్రుఁబొదువఁగనతఁడు
న్ఘనరోషమెత్తిదైత్యునిఁ
బనివడిహుంకరణమునభస్మమొనర్చెన్. ౨౫.

చ. అదియునుగాక వింధ్యగిరి వచ్చెను వెందన డంచి పేర్కొనం
బవమునఁ ద్రొక్కి దక్షిణపుభాగభువిన్సురిగాఁగ నిల్పెనం
పదలకుఁ బాపి యానవహుషుఁ బాముగ నుండ శపించె నంబుధి
న్బరక చేత రాఁదిగిచి పానము చేసెను వింటె రాఘవా. ౮౧.

క. మునిపతియగుఘటసంభవు
ఘనతరమహిమంబుఁ బొగడఁగాఁదరమె మహా
మునివేషంబున మెలఁగెడు
మనసిజసూదనుఁడుగాక సకాని యెతలఁపఁగ. ౮౨.

వ. అని యగస్త్యానుజన్ముఁడు తెల్పిన విని రామభద్రుం డమితహర్షాంత రంగుండై యమ్మునూఁ డమ్మునీంద్రుచే మార్గం బెఱింగి జానకీ లక్ష్మణసహితంబుగాఁ జని చని యొక్కయోజనం బుత్తరించి ముందట.

రామలక్ష్మణు లగస్త్యాశ్రమంబునకుఁ బోవుట.

సీ. ఘనసారసహకారకదళికాఖర్జూర
పనసక్రముకనింబపారిజాత
తాలరసాలహింతాలతక్కోలలత
మాలబిల్వాశోకసాలవకుళ
మాతులుంగలవంగమన్మథమాలూర
చూతభల్లాతకామ్లాతసరళ
చంపకపున్నాగజంబీరకేతకీ
ప్రముఖభూజాతముల్ఫలసుమముల
రాజిలుచు శుకపికకలరవముతోడఁ
గలసిహితముగ మెలఁగుమృగములతోడ
నంబరముఁ జేరు హోమధూమంబుతోడ
నమరుఘటజాశ్రమముఁ గాంచిరర్కకులులు. ౮౩.

క. కనియొకముని చేఁదమ రా
కనెఱుఁగం దెల్పిపుచ్చి కడువడి మీఱం
జనికుంభజన్మపదముల
కనుజుండును దాను మ్రొక్కె నతఁడును బ్రీతిన్. ౮౫.

క. దీవించి రామభద్రుని
భావించి కుతూహలమున ఫలసలిలంబుల్
ప్రావించి తదర్పితముం
గావించి ప్రియంబు దోఁపఁగా నిట్లనియెన్. ౮౬.

చ. అనఘ కకుత్స్థవంశకలశాంబుధిసోమ సురారిభీమ కా
ననమున కీవు తాపసజనంబులఁ బ్రోవఁగఁ బూని వచ్చుట
ల్విని మదినిన్నుఁ గాంచుటకు వేడ్క జనింపఁగ నుంటిఁ గంటిఁ బా
వనచరితుండవైన నృపవరశిఖామణి రామధీమణీ. ౮౭.

వ. అని పల్కుటయు నయ్యగస్త్యమహామునీంద్రునకు వినయావనతుండై రాఘవుం డిట్లనియె. ౮౮.

ఉ. అయ్య మునీంద్రచంద్ర జగదద్భుతమైన తగు నీ మహత్త్వము
న్నయ్యనసూయ మున్దెలుప సంభ్రమచిత్తుఁడనై చువచ్చి నే
నియ్యెడఁ దావకాంఘ్రియుగ మిప్పుగఁ గన్గొనఁ గంటిఁ బావనం
బయ్యె మదన్వయంబు సుకృతాత్ముఁడనైతి ధరాస్థలంబునన్. ౮౯.

క. అని రఘువర్యుఁడు పల్కిన
విని మానీంద్రుండు మదిని వేడ్కలలరనా
తనిఁ గౌఁగిట నిడి యెంతో
వినుతించుచుఁ బ్రియముఁ బెంచి వేగముగాఁగన్. ౯౦.

సీ. మహితయశుఁడగు శ్రీరామమనుజపతికి
ఖడ్గకోదండతూణీరకవచముఖ్య

సాధనంబులగస్త్యుండొసంగిమదిని
భావికార్యంబుఁజింతించిపలికెనిట్లు. ౯౧.

గీ. దశరథాత్మజగౌతమీతటమునందు
వన్నెకెక్కంగఁదగుపంచవటియనంగ
నొకట్టపుణ్యస్థలముగలదక్కజముగ
నదియుమునిజనసేవ్యమైయమరియుండు. ౯౨.

వ. కావున. ౯౩.

క. పంచవటీతీరంబున
కంచితమతినేగిమీరలచటిమునులభా
వించిబహుసఖ్యులనుగా
వించుకవిహరింపుఁడింకవేడుకలలరన్. ౯౪.

వ. అని యగస్త్యుండు పల్కుటయు నంతరంగంబున నుప్పొంగుచు నా రాత్రి తదీయాశ్రమంబున విశ్రమించి మఱునాఁటిప్రభాతంబున నమ్మునీంద్రునిచే ననుజ్ఞాతుండై జానకీసహితంబుగా రామసౌమిత్రుల మానుమం బగువనంబుఁ జొచ్చి యరుగుచున్నయెడ నాత్రోవయం దతిభీషణాకారుండును మేరుమందరోపముండును నగు నొకపక్షీంద్రునిం గని రామభద్రుండు లక్ష్మణున కిట్లనియె. ౯౫.

క. పెనుగొండకైవడినినొక
దనుజుఁడుపక్షిగతిఁదోఁచెఁదమ్ముఁడకంటే
యనునంతవిహగపతిరా
మునిఁగనుఁగొనిపల్కెఁబ్రేమమునుకొననపుడున్. ౯౬.

సీ. కశ్యపసూనుండుగరుడాగ్రజాతుఁడ
నూరుండుమాతండ్రిధారుణీశ

కంపితారాతియాసంపాతిమాయన్న
    ననుజటాయువటంచుఘనతమీఱ
ననఘభవజ్జనకునకుసన్మిత్రుండ
    మీకార్యధుర్యతమెలఁగువాఁడ
నీదారుణాటవినెల్లఁజోగుమురులై
    యసురలుదిరిగెదరట్లుగానఁ
దపనకులనాథవసుమతీతనయనెప్పు
    డేమఱకకాచికొనుఁడనిప్రేమమీఱఁ
దెల్పెఁదమతండ్రిదశరథాధీశుకరణి
    నతనిభావించిపూజించిరర్కకులులు. ౯౭.

రామలక్ష్మణులు పంచవటికిఁ బోవుట.

క. ఇటులజటాయువునకునతి
    ఘటియించిప్రియంబువల్కికాంతారంబు
న్నటువేగమునఁగడచిని
    వ్వటిలంబోఁడఁగనిరిపంచవటినిందటినిన్. ౯౮.

క. కనియచటివినోదములకు
    మనమునఁనుప్పొంగిరామమనుజేంద్రుఁడుద
మ్మునిఁజేరిలక్ష్మణాయీ
    వనమునకెనయైనపుణ్యవనమిలఁగలదే. ౯౯.

క. ఈగోదావరియందున
    బాగుగఁగ్రుంకినను గర్మబంధములెల్ల
న్వేగమెతొలఁగుటలరుదే
    వేగంటికినైనభువనవిఖ్యాతముగాన్. ౧౦౦.

వ. అదియునుంగాక. ౧౦౧.

సీ. ఫలపుష్పభరితమహాపాదపావళులును
గలకలధ్వనులిడుఖగచయములు
మకరందములఁ గ్రోలుమధుపఝంకారము
ల్మానుగా వీచుమందానిలంబు
వైరమార్గముమానివర్తించుమృగతతు
లతులితంబగుతాపసాశ్రమములు
నిగమనినాదముల్నిగిడించుమునిజను
ల్దోలఁగకుండెడుహోమధూమములును
గలిగిరమ్యముగనువిలసిల్లునిమ్మహా
పుణ్యభూమినుండఁబోలుమనకు
ననుచుఁబల్కి యప్పుడనుజుచేనొకపర్ణ
శాలఁగట్టఁబనిచిమేలిమిగను. ౧౦౨.
క. ఆపర్ణశాలలోపల
భూపుత్రీయుతముగానపుడురాఘవుఁడుం
గాపురముసలుపుచుండెను
తాపసజనులాత్మనలరితనుఁగొనియాడన్. ౧౦౩.

హేమంతఋతువర్ణన.

క. అంతఁదుహినమఖిలదిశా
క్రాంతంబైచలువవలువగప్పినక్రియన
త్యంతధవళచ్ఛవిన్హే
మంతర్తువుగానఁబడియెమహినమితముగాన్. ౧౦౪.
వ. అట్టియెడ. ౧౦౫.
క. రమణీయుఁదమ్ముఁడుఁగొల్వఁగఁ
క్రమమునరాముఁడుప్రభాతకాలంబునగా

తేమియందుఁగ్రుంకఁజనుచో
    నమితతుషారమునుగాంచియనుజనకనిమోర్. ౧౦౬.

క. ఇదెచూడులక్ష్మణాహిమ
    ముదితంబైయెల్లదెసలునొక్కటిగాఁగ
న్నెదలెడువెల్లఁదనంబున
    మదనునివెలిగొడుగనంగమహిపైనిపుడుర్. ౧౦౭.

క. సకలతృణావళులందున
    ధికముగహిమబిందువులుప్రతిదినమునందు
న్బ్రకటించికురియుచోమౌ
    క్తికములగతిఁదోఁపసాగెఁదెలిసితెయనఘా. ౧౦౮.

క. పక్షులుముడిచిపడఁకుచుఁ
    గుక్షిన్నిరములనునిఱికిక్కొనినిలుచుచునీ
వృక్షంబులపైనుండెడు
    పక్షులగుమిచలికినెట్లుభరియించునొకో. ౧౦౯.

క. వారణములుజలములకై
    ధారాళముగాఁగనడచితగఁదుండముల
న్నీరములముంచికిజ్జని
    ఘోరంబుగనఱచిపఱచెఁగుతలంబ్రదువర్. ౧౧౦.

గీ. ఎంచిచూడరానియీమంచునేమంచుఁ
    దెల్పఁదగునుమదికిఁదెల్లముగను
దంతములునుగలిగితానుండెనేనియుఁ
    గొఱికిచనదెయొక్కకొంతలేక. ౧౧౧.

క. బహుకంబళపటములరా
    త్ర్యహములయందేమఱకయయవనిజనంబు

ల్పహాజముగఁగప్పితనియక
నుహూహూయనిచలికినులికిమొదుఁగుదురుగదా. ౧౧౨.

క. పులివంటిచలికివెఱచుచుఁ
గలకంఠులఁగుచయుగములఁగనితమయురము
ల్గొలఁగింపక కౌఁగిళ్ల
న్వెలయింతురుసుమ్ముమగలువిరహము పేర్మిన్. ౧౧౩.

సీ. ఇట్టిహిమంబున నెట్లొకో భరతుండు
సరయూనదిని గ్రుంకుశంక లేక
యీచలికెబ్బంగిమైచలింపక యను
ష్ఠానంబొనర్చునుబూనికలర
నేరీతినా రాక నెదురుసూచుచుమదిఁ
దత్తఱింపక యుండుఁదాల్మితోడ
నిచ్చోటమనయునికి యెఱుఁగకనలుదెస
లరయించియెంతేనినలసెనొక్కొ
యేమిసేయునునింకనేనెందుఁజొత్తు
నాప్రియానుజుకుశలంబునాకుఁదెల్పఁ
జాలువారెవ్వరిలపైని మేలిమిగను
దైవఘటనంబుఁదెలియంగఁదరమె చెపుమ. ౧౧౪.

ఉ. పట్టముమానియేనడవిపాలయిగ్రుమ్మరుచున్న వాఁడఁదాఁ
బట్టముగల్గి తాపసునిభంగిఁజరింపఁగఁబూనెనాపయిన్
దిట్టపుభక్తిచేనతనిధీరతకేమనవచ్చునక్కటా
యిట్టిసహోదరుండవనినెన్నఁగలండెతిరంబుఁడోఁపఁగాన్. ౧౧౫.

గీ. అన్నదమ్ములపరిపాటియరసిభువిని
దెలియవలెభరతునిఁగనితేఁటపడఁగ

నేనుబితృవాక్యపాలనమూనిచేయు
 వెల్లనాతనివల్ల నేపల్లవించె. ౧౧౭.

వ. అని రాఘవుం డత్యంతదురంతచింతాసమాక్రాంతచిత్తుండై నిరంతరంబు గౌతమీప్రముఖపుణ్యతీర్థస్నానానుష్ఠాననిష్ఠాగరిష్ఠుం డగుచుఁ బర్ణశాలాంతరంబున ననేకమునిగణపరివృతుండై యుండె నంత.

క. దినదినములక్ష్మణుండును
 మనమునసతిభక్తియుక్తిమల్లడిగొనఁగా
వనమునసరు నేగిఫలముల
 ననువొందఁగఁదెచ్చియొసఁగునన్న కుఁబ్రీతిన్. ౧౧౮.

లక్ష్మణుండు జంభునికంఠంబుఁ దెగవ్రేయుట.

క. ఒకనాఁటిప్రభాతంబున
 నకలుషమతిలక్ష్మణుఁడువనాంతరమునఁబా
వకనిభమైకనుపట్టెడు
 నొకఖడ్గముఁగాంచివిగులనుత్సాహముతోన్. ౧౧౯.

వ. అమ్మహాఖడ్గంబుఁ గేల నవలంబించి చేరువ నున్న వేణుతండంబు ఖండించుటయు నం దొక్కమునివరుండు దెగుటం గాంచి తల్లడం బంది గడగడ వణంకుచు వేగంబునఁ బర్ణశాల డాయం బోయి యన్నపాదంబులపయిం బడి వగచుచుండం గని రాఘవుండు నివ్వెఱఁగంది యి ట్లనియె. ౧౨౦.

ఉ. ఏమిటికింతచింతిలఁగనెగ్గొనరించినవారలెవ్వరిం
 కేమిటొ యంతగల్గెఁబురినెల్లసుహృజ్జనబాంధవాళినీ
 వేమఱివచ్చుటో మరియునెవ్వరికైననుబల్కబొంకితో
 నీమదిఁదాఁచకన్నియునునిక్కముఁదెల్పఁగదయ్యలక్ష్మణా. ౧౨౧.

వ. అనిన లక్ష్మణుం డతిభీతచేతస్కుం డై యి ట్లనియె. ౧౨౨.

క. వనమున ఫలములఁ దేరం
జనుచో నొకఖడ్గ మెసరఁ జంచలకరణి
న్గనుపట్టినఁ గొనిదాన
న్ఘనమగు వేణుప్రచయము ఖండించుటయున్. ౧౨౩.

గీ. దానితోడ నొక్క తాపసవర్యుండు
ఖండనంబునొందెఁ గానమదికిఁ
బాపభీతి దోఁచి పటుదుఃఖ మొదవె నే
నిందుకే మొనర్తు నింకనిపుడు. ౧౨౪.

వ. అని యమోఘశోకపరవశుం డగు లక్ష్మణుం గాంచి రామచంద్రుండు బ్రమాన్పడి యుండె నయ్యవసరంబున నచ్చేరువ నున్న మునిజనంబు లేతెంచి యిట్లనిరి. ౧౨౫.

సీ. వసుధేశ వినుము రావణుచెల్లెలగు శూర్ప
ణఖయను ఘోరదానవిసుతుండు
జంభుఁడన్వాఁడిట్లు నప్తాశ్వుఁ గోరి త
పంబొనర్చిన మెచ్చి పద్మహితుఁడు
ఘనఖడ్గ మొసఁగుడుఁ గైకొన నొల్లక
కడఁ ద్రోయ సౌమిత్రి వడసి యిపుడు
దానఁ దద్రాక్షసుతలఁ ద్రెవ్వ నేసెను
దాపసులెల్లెడ ధన్యులైరి
కానసుంతైనఁ బాపంబు గలుగ దుడుగుఁ
డవనిపై దుష్టహరణంబు నఖిలశిష్ట
పాలనం బొనరింప నేర్పడ జనించి
వెలయుదురుగాదె మీరారలు వీరులగుచు. ౧౨౬.

క. అనిమునులువలుకదశరథ
తనయుఁడుమదిమోదమందితాపసవరులం
గనియిట్టిఘోరతపమా
దనుజుండేమిటికొనర్చెఁదగఁదెల్పుఁడనన్. ౧౨౭.

వ. అమ్మును లి ట్లనిరి. ౧౨౮.

సీ. అఖిలజగద్ద్రోహియగురావణుండుము
న్నమరులసాధింపనరుగుతఱిని
దనసోదరిమగండుదారుణవిక్రముఁ
డైనవిద్యుజ్జిహ్వుఁడనెడివాని
లంకఁగాచుటకునిశ్శంకతోడుతఁబూన్చి
చనఁగవాఁడద్దశాననునిగెల్వఁ
దగుమాయలభ్యసింపఁగఁబూనిపాతాళ
మునకేగుటయుఁబఙ్క్తిముఖుఁడెఱింగి
వానిఁద్రుంచిగర్భవతిగాఁగనొప్పుశూ
ర్పణఖనపుడుచీరిపడఁతినీవు
కోరినట్టిపతులఁగూర్చిరమింపుమా
మ్మనుఁడునదిచరించునన్నిదెసల. ౧౨౯.

క. ఆరక్కసిగర్భంబున
శూరుఁడుజంభుండనంగసుతుఁడుదితుండై
ధీరతఁదండ్రినడంచిన
యారావణుఁద్రుంపఁగోరియతిధృతివిరాజన్. ౧౩౦.

గీ. తపనునకుఁబ్రీతిగాఘోరతపమొనర్ప
నతఁడునొకఖడ్గమతికృపననుచుటయును

మెచ్చిచనుదేరకీవాలుఁబుచ్చెనినుఁడు
దీనినేనొల్లననియుండెదానవుండు. ౧౩౧.

గీ. అట్టిఖడ్గరాజమువలీలచేనంది
జంభునవనిఁగూల్చిసకలమునుల
భయముమాన్చిప్రోచెఁబరువడిసౌమిత్రి
వింటెరామచంద్రవిశదముగను. ౧౩౨.

వ. అని యమ్మునివర్యులు వల్కుటయును రామలక్ష్మణులు సంతసించి రంత శూర్పణఖ నిజాత్మజుం డగుజంభునకు నెప్పటియట్లశనంబుఁ జేకొని యచ్చోటి కరుదెంచి ధరణీతలంబున ఖండింపఁ బడియున్న తనూజునికళేబరంబుఁ గని నగంబులు ప్రతిధ్వను లిడ రోదనంబు సేయుచు నగ్నిసంస్కారం బొనర్చి మృత్యువుకైవడి జాజ్వల్యమానయై మండుచు నచ్చేరువ నున్న మునిజనంబులం డాసి క్రోధారుణాలోచనంబులఁ జూఱచుఱం జూచుచు నిట్లనియె. ౧౩౩.

సీ. ఓరిమానులమనియూరకెపేరిడి
తలనుమోపెడుజడల్దాల్చియొడల
భూతిఁదాలిచినారపుట్టముల్గట్టుక
జన్నంబునెపమునసంఘమగుచు
మేకపోతులఁజంపిమెండుగాభుజియించి
క్రొవ్విజంభునిఁదలఁగొట్టివైచి
మెఱుఁగనిక్రియనున్న నేనేలవిడుతుమి
మ్మెవ్వరిట్లొనరించిరెఱుకపడఁగ
నాకుఁదెల్ప రేనిమీకంఠములఁద్రెంచి
శోణితంబుఁబట్టిశూరుఁడైన

మత్తనూజునకునుమహిఁదర్పణమొనర్తుఁ
బాపలార ఘోరపాపులార. ౧౩౪.

క. అనియార్భటించిపల్కుచు
ఘనరోషావేశముననుగదియుడుమౌను
ల్వెనుకకుఁజనికడుభీతి
న్దనువులుగంపింపననిరిదానవితోడన్. ౧౩౫.

క. ఓతరుణీయిట్లొనర్ప
న్నాతరమే తెలియు మొక్కమను జేశసుతుం
డేతెంచివాలుఁగైకొని
సీతనుజునిఁద్రుంచిచనియెనిజముగనిపుడున్. ౧౩౬.

గీ. వాఁడుపంచవటినివలనొప్పనొకపర్ణ
శాలనుండునటకుఁజనుము వేగ
ననినలక్ష్మణుండుసనినట్టితెరువున
నడుగుజాడఁబట్టియరిగియరిగి. ౧౩౭.

గీ. కటములదరంగశిఖిశిఖల్గనులఁజెదరఁ
జటులహుంకృతిదిశలెల్లఁజిటిలిపడఁగ
గరళమాకృతిఁగొనివచ్చుకరణిదోఁప
శూర్పణఖపర్ణశాలవేఁజొచ్చియచట. ౧౩౮.

చ. సరసిజపత్రనేత్రునివిశాలయురస్కునిదీర్ఘబాహుని
స్మరదనిభాంగుశ్రీకరుఁబ్రశాంతునిశీతకరాస్యునిస్మహీ
ధరసమధీరునిన్సుగుణధాముని రామునిఁగాంచిదైత్యసుం
దరిమదిమెచ్చియిట్లనియెదర్పకసాయకపీడితాత్మయై. ౧౩౯.

క. ధారుణిపైనవమదనా
కారులపైచూడఁజూడఁగానంబడుమీ

రేరాజన్యునితనయుల
రేరాజ్యమునన్వసింతు రేర్పడ నెపుడున్. ౧౮౦.

క. మునివేషంబుననిక్కా
ననమునఁజరియించుకారణం బేమొకో చ
య్యనఁదెల్పుఁడనుడు రాఘవుఁ
డనిమెన్శూర్పణఖతోడనతిధీరుండై. ౧౮౧.

గీ. రాముఁడను నేను దెలియుమీ రామసీత
మత్సహోదరుఁడతఁడులక్ష్మణుఁడుదశర
థాత్మజన్ములమరయఁదదాజ్ఞఁబూని
వనముననుజరియింతుముఘనతమీఱ. ౧౮౨.

వ. అనిన దానవి యిట్లనియె. ౧౮౩.

క. దనుజాధీశుఁడగుదశా
ననుప్రియసోదరినిశూర్పణఖయనుదాన
న్నను జేశ కామరూపిణి
ననుఁగలయుమురతులముదముననుబరిగతులన్. ౧౮౪.

క. నీనవమదనాకారత
కేనేతగుదానఁగాననింపుదలిర్పన్
సూనాస్త్రుబారినఁబడి
పోనీయకయేలుకొనుముభూపకుమారా. ౧౮౫.

వ. అని రక్కసి వెక్కసంబగుమదనాశుగంబులఁ జిక్కి కక్కసంబునం
బల్కుటయును రాఘవుండు చిఱునగ వంకురింప నిట్లనియె. ౧౮౬.

క. సతియొకతెగలదునాకు
న్నతిమంతుఁడులక్ష్మణుండుమదినెల్లపుడా

క్కతేశావలెననియుండెడు
　　నతనికడఁజనుముకోర్కెలటసిద్ధించున్. ౧౪౭.

వ. అని పల్కి వీడ్కొల్పుటయు నద్దానవి లక్ష్మణుని పాయం బోయి క్రీడింపం బిల్చిన నతం డి ట్లనియె. ౧౪౮.

గీ. మున్ను మాయన్నఁ గోరితిముదితనీవు
　　యచటికేచనుమన్నఁ దానచటికరుగ
రాఘవుండందెపొమ్మనరక్కసియును
　　నటునిటులఁజనివేసారియాగ్రహించి. ౧౪౯.

మ. పటురోషంబునఁబల్కెనిట్లుమదినన్బాటింపకీరీతిగా
నటులంబొమ్మిటురమ్మురమ్మనుచునన్నాడింపఁగానానెయో
క్కటమిమ్మందఱఁబట్టిమ్రింగెదనువేగంబొప్పనంచున్మహో
ర్భటవృత్తింజనుదెంచెరాముపయిభూభాగంబుగంపింపఁగాన్. ౧౫౦.

లక్ష్మణుండు శూర్పణఖకర్ణనాసికాచ్ఛేదనం బొనర్చుట.

వ. అప్పుడు. ౧౫౧.

ఉ. రక్కసివెక్కసంబుగనురాఁగనిరాముఁడువంపలక్ష్మణుం
డొక్కటఖడ్గముంగొనిమహాగ్రతతోఁజనుదెంచిదానవి
న్ముక్కునుగర్ణయుగ్మమునుమూలముగాఁదెగఁగోసిపొమ్మనెం
జక్కటిమానివర్యులతిసంభ్రమమందుచుగేలిసేయఁగాన్. ౧౫౨.

వ. ఇట్లు కర్ణనాసికాచ్ఛేదనం బొనర్చి పుత్తెంచిన నాచుప్పనాతి దెప్పరం బంది తెప్పున జనస్థానంబునకుఁ బాఱి ఖరునిం గని బోరుబోరున రోదనం బొనర్చుచు ని ట్లనియె. ౧౫౩.

క. అన్న భవదాజ్ఞచేనే
　　నన్నిదిశల్దిరుగుచుండియాపంచవటిం

గన్నారఁగాంచియందొక
యున్నతమగుపర్ణశాలనొగిఁజొచ్చుటయున్. ౧౫౪.

గీ. అయ్యెడనురామలక్ష్మణులనెడురాజ
వరులఁబొడఁగనిమోహింపవారునన్నుఁ
గర్ణనాసికలనుగోసిగాసిచేయ
వెఱచివచ్చితినిపుడునీమఱుఁగుసారఁగ. ౧౫౫.

క. అమ్మనుజులమాంసమ్ముల
నిమ్ముగఁగొనివచ్చినాకునీయకయున్న
న్సమ్మతిగాదనవినిరేఁ
ద్రిమ్మరియగుఖరుఁడువల్కెధీరతతోడన్. ౧౫౬.

ఉ. ఇంతఅవంతకార్యమునకేనరుదేరఁగనేలనింద్రుఁడో
కంతునితండ్రియోగరళకంఠుఁడొకాలుఁడొనాపరాక్రమా
క్రాంతినిసైఁపనీనరులగర్వమదెంతహరింపఁబుత్తునో
కాంతరొయంచుదానవనికాయములన్వడిఁజీరియిట్లనెన్. ౧౫౭.

క. శూర్పణఖతోడఁజనిమీ
రోర్పింతయులేకనరులనురుతరశక్తి
స్దర్పించిదునిమిపలలము
లర్పింపుఁడుదీనికనుచుననిచెంగడిమిన్. ౧౫౮.

వ. ఇట్లంతకోపమాను లగుదైత్యకింకరులఁ బదునల్వురం బంచుటయు వారును వీరాలాపంబు లొనరించుచు నుద్దండగదాదండశూల ముసలాద్యనేకశస్త్రసంపన్నులై శూర్పణఖతోడ మృత్యువక్త్రంబుఁ జొరం బోవుకరణిం జని యట్టహాసం బొనర్చి రాఘవునిం బొదువు టయు నతండు కోపసంరక్తలోచనుం డగుచుఁ గోదండంబుఁ గేలం గొని గుణారావంబుఁ జెలంగించి వాఁడిశరంబుల నప్పదునల్వురం

దునుముటయు మహాభయభ్రాంతిమై వేగంబునం బాఱి యీ చుప్ప
నాఁటి చతుర్దశదనుజవీరులు రామభద్రునిచే హతులగుట నెఱిం
గించిన నా ఖరుం డాజ్యాహుతిం బ్రజ్వరిల్లు వైశ్వానరునిభంగి భగ్గ
భగ్గున వెలింగి యప్పుడు. ౧౫౯.

గీ. పెనుగిరులతోడ ధారుణి పెల్లగిల్లఁ
దారకలు డుల్లి దివి మొల్లఁ దల్లడిల్ల
దిక్కరులు మ్రగ్గ రణభేరి దిశలు నిండి
మొఱయ వేయించి సేనల మొనయఁ బంచి ౧౬౦.

సీ. పదునాల్గువేలదోర్బలయుక్తులగు దైత్య
వరుల రదముల పైనరుగు దేరఁ
దిరుగ కదూషణత్రిశిరులు సేనాగ్ర
మునను గ్రుమ్ములై కూడి మొనసి చనఁగఁ
బటహ భేరీముఖ్య బహుళనినాదంబులు
దిక్కుల మిక్కిలి పిక్కటిలఁగ
భూరిమాతంగఘీంకారంబు లశ్వహే
షారవంబులును నిండారఁ జెలఁగ
ధరణి గంపింపఁ బెంధూళి తరణిఁ గప్ప
సకలబలముల యట్టహాసములు ప్రబలఁ
గనకరత్నస్థగితశతాంగంబు నెక్కి
ఖరుఁడు వెడలె రణోత్సాహకలితుఁడగుచు. ౧౬౧.

ఖరదూషణాదుల యుద్ధము.

వ. ఇట్లు ఖరదూషణత్రిశిరులు త్రేతాగ్నులుం బోలె వెలుంగుచు బలం
బులం గూడి సంగరంబునకుం జనుదేర ననతిదూరంబున వారలం
గాంచి రాఘవుండు లక్ష్మణున కిట్లనియె. ౧౬౨.

క. ముక్కిడిదానవిసనిబలు
రక్కసులందోడి తెచ్చెరణమునకదెన
ద్దిక్కులునిండివెసన్నన
దిక్కునకైవచ్చుప్రాక్కిఁదెలిసితెయనఘా. ౧౬౩.

క. కావునజనకజదలఁకెడు
నీవెలఁదియునీవునిమ్మహీధరముపయి
న్వేవేగనెక్కినన్ను
న్భావింపుఁడుపీరితోడబవరమొనర్తున్. ౧౬౪.

వ. అని పల్కుటయు లక్ష్మణుండు వినయావనతుండై రామభద్రున
కిట్లనియె. ౧౬౫.

క. భవదాజ్ఞఁబూనియేనీ
భువనంబద్రువంగనడిచిపూర్వామరసం
ఘవిదారణమొనరించెద
నవనిజఁగొనియరుగుఁడన్నగాగ్రంబునకున్. ౧౬౬.

వ. అనిన రాఘవుం డిట్లనియె. ౧౬౭.

ఉ. ఏనొనరించుకయ్యముమహీసుతగాంచిమదింజెలంగఁగా
దానవపఙ్క్తులంగదిసిదారుణభంగిశిలీముఖంబుల
న్మానకత్రుంతునొక్కక్షణమాత్రమునంబదికోట్లనైననీ
జానకితోడనగ్గిరికిసత్వరమేగఁగదయ్యలక్ష్మణా. ౧౬౮.

వ. అని రాఘవుం డానతిచ్చుటయు లక్ష్మణుండు నమస్కరించి జానకిం
దోడ్కొని తత్సమీపంబునం దున్న నగాగ్రంబున కధిరోహించి
యొక్కగుహాంతరంబున నిలిచి కనుంగొనుచుండె నంత రామ
భద్రుం డభేద్యకవచతూణీరయుగళధారణుండై ధనుర్దండంబుఁ గేలం

బూని నారి సారించి దానవతండంబులగుండె లవియ గుణంబు
మ్రోయించి నిలువంబడి యుండె నప్పుడు. ౧౬౯.

మ. దివిజేంద్రాద్యఖిలామరుల్మునులుదేదీప్యంబులైయొప్పుది
 వ్యవిమానంబులనుండివెల్గుచునుదుర్వారంబయీసేనరా
 ఘవుఁడొక్కండెటుపోరనేర్చునొకొసంగ్రామంబునన్నిల్చియుం
 చువిలోకింపఁగరాముఁడత్తఱిమహాశూరత్వమంకించుచున్. ౧౭౦.

మ. శతకోట్యర్కసమానమైననిజతేజస్స్ఫూర్తినల్దిక్కులం
 దతితీక్ష్ణంబుగఁగ్రాలఁజేయుటయుదైత్యాళుల్భ్రమంజెందనా
 దితిసూనుండుఖరుండదల్చితనుమందెంపొప్పవారల్మహా
 గ్రతతోడంజనుదెంచితాఁకిరివడిన్గాకుత్థ్సవంశాగ్రణిన్. ౧౭౧.

సీ. దనుజబలంబులుద్ధతిరాఘవునిఁగిట్టి
 చాలముద్గరకరవాలశూల
పరశుతోమరగదాప్రాసపట్టసఖడ్గ
 చక్రముసలకుంతశక్తిభిండి
వాలప్రముఖశస్త్రజాలంబులనుగప్పఁ
 బ్రళయాంతకునిభంగిఁబ్రజ్వరిల్లి
రాముఁడొక్కొక్కశరంబుననన్నింటి
 మాయించిదైత్యులమాయలణఁచి
మండలీకృతచండకోదండుఁడగుచుఁ
 గాండకాండంబులనువారిగండడంప
విపులసైన్యంబులందందవిఱిగిపాఱి
 ఖరునిశరణంబుఁజొచ్చిరొక్కటనుమీఱి. ౧౭౨.

క. ఖరుఁడాగ్రహమునఁబొగలుచు
 దురకొనిసరించుటకునప్పుడుదూషణుఁబనుపం

బహువడిసతఁడబ్బలములఁ
బురికొల్పుచు రాముపైనిఁబోఁబనుచుటయున్. ౧౭౩.

మ. దనుజాళీభీషణభాషణంబులనుబంతంబొప్పఁగా నార్చుచు
న్వనదంబుల్ధరణీధరంబుపయి నిస్వర్షించుచందంబున
న్ఘనరోషానలముప్పతిల్ల విలసత్కాండంబులొండొండఁగ
ప్పినమధ్యందినభానుఁడోయనఁగ గంభీరాత్ముఁడై రాముఁడున్. ౧౭౪.

మ. ఘనజాంబూనదకింకిణీఘణఘణత్కారంబు సంధిల్లవి
ల్లన కేలంగొని వీతిహోత్రనిభగాంధర్వాస్త్రముం బూన్చి యే
సినఁ దద్బాణమగణ్యవైఖరిసునాశీరాదులగ్గింపన
ద్దనుజానీకముఁదాఁకి పెక్కుగతులన్ దండించె నిండారఁగాన్. ౧౭౫.

వ. ఇట్లమ్మహాస్త్రం బేకరూపంబున రామకోదండవిముక్తంబై దశశత సహస్రానీకంబులుగా నక్షయం బంది రథగజతురగపదాతివర్గంబుల ననర్గళప్రభావంబునం దునుముటయు ఖండంబు లగుమత్తవేదండంబులును, నొఱలుచుం బడుతురగరాజంబులును, శకలంబు లగు శతాంగంబులును, వికలంబు లగుశరశరాసనంబులును, మ్రగ్గెడు రథికులును, నుగ్గగు కేతనాతపత్త్రంబులును, రాలిన మణిభూషణంబులును, గూలిన ఛత్త్రచామరంబులును మొండెంబు లగుపదాతితండంబులును వ్యస్తంబు లగుమస్తకంబులును, దుమురు లగు నెముకలును, గుప్ప లగు మెదడుతిప్పలును, ప్రోవు లగుప్రోవులును, ప్రవాహంబులై పాఱురుధిరంబులు గలిగి భూతబేతాళంబుల కాటపట్టగుచు సంగరాంగణం బతిఘోరంబై యొప్పె నయ్యవసరంబున.

మ. బలముల్గూలుటఁగాంచి దూషణుఁడు కోపంబుప్పతిల్లన్మహా
జ్జ్వలవైశ్వానరుభంగి వెల్గుచు ధనుర్జ్యానాదముప్పొంగఁగాఁ

గలనన్నామునిఁద్రుంతునంచునుశరాంగంబుగ్రతండోలియ
మ్ములసోనల్గురియించెభూమియునభంబున్మెండునిండారఁగన్. ౧౭౭.

క. ఇనకులుఁడద్దనుజునిపై
    సునిశితశస్త్రాస్త్రసమితిఁజొనుపుటయునువాఁ
డనుపమబాణవితతులా
    తనిమేనన్నివ్వనేసెఁదత్ప్రతిగాఁగన్. ౧౭౮.

వ. ఇట్లిరువురు నన్యోన్యవీరాలాపంబులుఁ బ్రచండకోదండగుణారావంబులుం బఱపుచు దురం బొనర్చునెడ రాఘవుండు గోపాటోపాడంబరుండై వాఁడిబాణంబున వానిశరాసనంబు ఖండించుటయు నొండు విలుఁగొన నదియుం దునియ నేసి ఘోరభల్లంబున సిడెంబుఁ ద్రుంచి తురగసారథిసహితంబుగా రథంబు నుగ్గాడుటయు నా రక్కసుండు విరథుండై యాగ్రహంబున ధరణీతలంబునకు లంఘించి యప్పుడు.

క. పరిఘములిరుకరములఁగొని
    సరగునఁజనుదేరరామచంద్రుఁడుకోప
స్ఫురణమునఁదద్భుజద్వయిఁ
    గరమరుదుగఁదునిమియురముగాఁడఁగనేసెన్. ౧౮౦.

గీ. రాముబాణమపుడురంబుఁదూఱఁగనీల్గి
    దూషణుండువడియెదురమునందు
నంతఁగోపమెత్తియంతకుగతిమండి
    త్రిశిరుఁడరుగుదెంచెదిశలుగలఁగ. ౧౮౧.

క. మదకరికంఠీరవమున
    కెదురన్దారసిలుకరణినేఁచిత్రిశిరుఁడం
బుదనిభగాత్రునిరామునిఁ
    బ్రదరంబులనొంచినభమువగులఁగనార్చెన్. ౧౮౨.

గీ. రాఘవుఁడుకోపభరితసంరక్తలోచ
    నములనంతంతవిస్ఫులింగములుసెదర
దానవునిపైనిఁగదిసియుద్దండచండ
    కాండములనొంచెనత్యుగ్రఖండనమున. ౧౮౩.

క. సరగుననద్దైత్యవరుం
    డురుతరభల్లంబువుచ్చియురముననాట
న్నరకుఁగొనకరాముఁడుఘన
    శరమునవిలుద్రుంచివైచెఁజతురతరమెఱయన్. ౧౮౪.

క. ధీరతవేఱొకవిలుఁగొని
    యారామునిపైనిఁద్రిశిరుఁడాగ్రహమొప్పం
గ్రూరాస్త్రంబులువఱపిన
    వీరావేశంబుదోఁపవిభుఁడలుకమెయిన్. ౧౮౫.

క. కడువడిమూఁడంబకముల
    నడరించుచువానియుత్తమాంగత్రయముం
బడిడుర్లనేయనప్పుడు
    పిడుగడిచినకొండఁబోలిపృథివింబడియెన్. ౧౮౬.

వ. ఇట్లు మహోగ్రం బగుబాణజాలంబునఁ ద్రిశిరుండు గూలుటయుం గాంచి ఖరుండు కాలాగ్నియుం బోలె జాజ్వల్యమానుండై విజృంభించి రామునిపై రథంబుఁ దోలించి ఘోరనారాచంబులు నిగిడింపుచు నిట్లనియె. ౧౮౭.

ఉ. భూరితరాహవస్థలినిఁబోరియరాతిగణాళినెల్లసం
హారమొనర్చిమించియశమందినయట్టిఖరుండనేనున
న్నారయకిట్లురాఁదగునెయర్కకులేశనినువ్యధించియీ
పోరునమత్సహోదరికిబోనమొనర్చెదనేఁడుచూడుమా. ౧౮౮.

వ. అనిన రాఘవుం డి ట్లనియె. ౧౮౯.

చ. నినుబలవంతుఁడంచుమదినిక్కము నమ్మియ నేక దైత్యులీ
యని మొననాశరాగ్నికిఁదెయాహుతులైననిరంతకాలయం
బునకటుగాన వారిఁగనఁబుచ్చెదరమ్ము వృథాప్రసంగవా
దనమిఁక నేల బాహుబలదర్పముఁజూపుము రాక్షసాధమా. ౧౯౦.

క. అనవిని ఖరుఁ డాగ్రహుఁడై
కనుఁగవలన్నిగులనగ్నికణములు సెదర
న్మనుజానిశరవర్షముల
య్యినకులజునిపైఁగురిసె నెడఁబడకుండన్. ౧౯౧.

క. రాముఁడుఁదదధికముగనపు
డేమఱకయంపసోనలెసగించుటయు
న్భూమియునభమును నెల్లెడ
నామహితాస్త్రములునిండియర్కునిఁగప్పెన్. ౧౯౨.

క. కరవేగముశరవేగము
లురవడినొండొండఁ బెరసియురుజయమతితో
నిరువురుఁ బెనఁగిరిహరిహరి
కరికరిగిరిగిరియుఁదాఁకుకరణులుదోఁపన్. ౧౯౩.

వ. ఇట్లొండొరులు సముద్దండతండంబు లగుకాండంబులును, గర్జితంబు లగుసింహనాదంబులును, వికటాట్టహాసంబులును, ధనుష్టంకారంబులును, దిక్కులు పిక్కటిల్లం జెలంగింపుచు గండుమీఱి భండనంబుఁ జెల్లింపుచుండ నంబరంబున నాఖండలప్రముఖబృందారకసందోహంబులు రామవిజయంబుఁ గోరుచుండి రంత ఖరకరనిభుండగుఖరుం డొక్కవిశిఖంబున నమ్మానవేంద్రునికోదండంబు ఖండించి వాఁడిశరంబు లురంబు గాఁడ నేసిన రక్తసిక్తాంగుం డై రాఘవుండు

కుంభసంభవుం డొసంగిన వైష్ణవచాపం బెక్కిడి గుణారావంబు
మ్రోయించి ఘోరం బగునిశితాస్త్రంబు లద్దనుజునిపయి నిగి
డింపుచు. ౧౯౪.

క. శరమొకటవిల్లుఁదునుముచుఁ
దురగంబులఁగూల్చిరథముఁదుత్తునియలుగా
ధరఁబడ వైచెందనుజుఁడు
విరథుండైగదనమర్చి వెసనేతేరన్. ౧౯౫.

క. గదఁబూనినకరముగ్రగ
ప్రదరంబునఁద్రుంచుటయును భానుకులునిపైఁ
గదిసిపెడ చేతదనుజుఁడు
పదపడివృక్షంబువెఱికివడి పెంగడిమిన్. ౧౯౬.

చ. పరువిడిఁదన్మహీరుహముభగ్నమొనర్చిరఘూద్వహుండుదు
ర్భరతర ఘోర బాణమునఫాలము వ్రయ్యఁగ నేయనాఖరుం
డురుతరశక్రవజ్రహతినుర్విఁ దొరంగునగంబనంగ సం
గరమునఁద్రుంగెనిర్జరనికాయములభ్రమునం జెలంగఁగాన్. ౧౯౭.

వ. ఇట్లు రాఘవుం డొక్కముహూర్తంబును ముహూర్తార్ధంబునఁ జతు
ర్దశసహస్రరథికయుక్తంబుగా ఖరదూషణాదిదానవులనిశ్శేషం బొన
ర్చుటయును. ౧౯౮.

క. సుమవర్షంబమితోత్సా
హమునన్ సురవరులుగురిసిరచ్చరలేమ
లక్రమమొప్పనాడిరతిసం
భ్రమమునగంధర్వవరులుపాడిరివరుసన్. ౧౯౯.

వ. అంత. ౨౦౦.

క. జనకజఁదోడ్కొనిలక్ష్మణుఁ
డనువునగిరిడిగ్గివచ్చియగ్రజునకుఁబ్రమొ
క్కినరాఘవుఁడుశరాసన
మనుజునిచేనొసఁగిసీతనక్కఁజేర్చెన్. ౨౦౧.

గీ. అంతనమ్మువ్వురునుగూడిసంతసమున
నాహవక్రీడతెఱఁగెల్లనాడికొనుచుఁ
బర్ణశాలకుఁజనుదెంచిపరమమునుల
దీవనలుగాంచివెలసిరిధీరులగుచు. ౨౦౨.

చ. అపుడుసురంబునంబడినయాఖరదూషణముఖ్యదానవా
ధిపులనెఱింగిలంకకతితీవ్రగతింజనిరాక్షసేంద్రుని
న్నృపులపరాక్రమోజ్జ్వలునివింశతిబాహునిఁబఙ్క్తికంఠుఁగాం
చిపదములందునమ్రుఁడయిచెప్పఁదొణంగెనకంపనుండొగిన్. ౨౦౩.

గీ. దండకాటవిలోననుద్దండచండ
కాండకోదండధరులువేగంటిసములు
రామలక్ష్మణులనియెడిరాజవరులు
రాఁగనుంగొనిఖరుఁడుసంరంభుఁడగుచు. ౨౦౪.

క. పదునాల్గువేలరథికులఁ
గదనమునకుఁగూర్చికొనుచుఁగదియుడురాముం
డొంకఁగకనిలిచిమహోగ్ర
ప్రదరంబులఁదునిమెనెల్లబలములనధిపా. ౨౦౫.

వ. అనిన జ్ఞాతివధంబునకు మనంబున దుఃఖించి రోషారుణితలోచనుం
డగుచు రావణుం డకంపనున కిట్లనియె. ౨౦౬.

క. నరులనఁగనెంతవారలు
ఖరదూషణముఖులువిలయకాలాగ్నులసం

గరమున నే క్రియఁగూలిరో
    కరమరుదుగఁదోఁచెమదినకంపనవింటే. ౨౦౭.

ఉ. అనఘులన్నదీయసుమహాద్భుతమైతగుబాణపఙ్క్తుల
న్మానుగఁద్రుంచివేగమునమూఁఖరదూషణులేగుత్రోవసో
పానములన్ఘటింతుననుఁబద్మభవాదులుమెచ్చనిప్పుడే
పూనికతోడవత్తునటఁబోదమురమ్మననాతఁడిట్లనెన్. ౨౦౮.

గీ. రాక్షసాధీశవినుముశ్రీరాముఁడరయ
    భవుఁడో హరియొసరోజసంభవుఁడో గాక
మనుజమాత్రునకీశౌర్యమహిమగలదె
    దనుజవర్యులతోఁబోరధరణిలోన. ౨౦౯.

క. పదునాల్గుజగములైనం
    గుదురుగఁగలిగింపఁజెంపఁగూల్పఁగనెవ్వఁడు
న్మదినెఱుఁగునారఘూత్తముఁ
    గదియన్నీతరమెత్రిదశఘస్మరవినుమా. ౨౧౦.

క. రామునిసతియగుసీతా
    కామినినిటఁదెచ్చితేనిఁగడుసుఖమున
న్స్వామినతండుఁగృశించుం
    దామసమింకేలనొండుదలఁపకుమధిపా. ౨౧౧.

వ. అదియునుంగాక. ౨౧౨.

క. ఆమోహనాంగికైనయగు
    వామాక్షింగానవెచటవర్ణనసేయ
న్నీమహనీయవిభవమున
    కామహిళయెతగునుగాదెయసురాధీశా. ౨౧౩.

వ. అని యకంపనుండు వల్కుటయు దశగ్రీవుం డత్యామోదం బంది యతనిం బహూకరించి పుచ్చి కామాతురుండు లజ్జాభయవిరహితుండు గావున మనోజబాణపరంపరలం జిక్కి తత్క్షణంబ రథారూఢుండై సాగరావతరణం బొనర్చి యప్పుడు. ౨౧౪.

చ. విమలఫలప్రసూనములవిశ్రుతమైనమహీరుహంబులు
న్భ్రమరసమూహఝంకృతులుపక్షిమృగవ్రజఘోషణంబులం
దమగుకొలంకులుంగలిగిధారుణినొప్పెడు తాటకేయునా
శ్రమమునకేగెరావణుఁడుసత్వరమొప్పనకుంఠితాత్ముఁడై. ౨౧౫.

క. అటుచనిమారీచునిచెం
గటనిల్వనతండుపఙ్క్తికంఠునకపుడుం
బటుభక్తినమ్రుఁడైతా
నటఁబూజలొనర్చియున్నతాసనమొసఁగెన్. ౨౧౬.

వ. అంత రావణుండు తాటకేయు నాదరించి యిట్లనియె. ౨౧౭.

మ. ఇనవంశంబుననిద్ధరన్దశరథోర్వీశుండునాఁగల్గునా
తనిసత్పుత్రుఁడురాఘవుండుబలుకాంతారంబునస్థానియై
దినముల్ద్రోయుచుమాఖరాద్యసురపఙ్క్తింగూల్చెనంచయ్యకం
పనుఁడే తెంచివచింపఁగానెఱిఁగికోపస్వాంతుఁడైయిప్పుడున్. ౨౧౮.

క. రామునినాతనితమ్ముని
భీమపరాక్రమముదోఁపఁబిలుదివియకసం
గ్రామమునఘోరవిశిఖ
స్తోమంబడరించిత్రుంచితోడ్తోమఱియున్. ౨౧౯.

క. ఆకాకుత్స్థునిసతిసీ
తాకామినియసఁగనొప్పదానింబలిమిం

జేకొనఁగఁగోరిపోవుచు
నీకెఱిఁగింపందలంచినేవచ్చితిటఁ. ౨౨౦.

వ. అని రావణుండు పల్కిన విని మారీచుండు గుండె లవియ గడ గడ వణంకుచు మహాభయభ్రాంతుండై తడఁబడునుడువులతో దశ గ్రీవున కిట్లనియె. ౨౨౧.

క. ఓదనుజాధీశ్వరయిుపు
డేదుర్మతిదెలిపెనీకునీదుర్బుద్ధు
ల్నీవైనభోగములని
మ్మేదినిపైఁగూలఁజేయ మేకొనటులఁ. ౨౨౨.

ఉ. ఆరవివంశవార్ధిశశియైతనరారెడురామభద్రుని
న్మారహరాబ్జసంభవులుమార్కొనఁజాలరనంగదానవు
ల్భారితరాహవంబుననుబోరఁజనన్నగుబాటుగాదనే
నీరమణీయవైభవమునిల్పుటకైతగఁదెల్పఁబూనితిఁ. ౨౨౩.

క. ఏమిటికిటుతలఁచెదవీ
వామనుజాధీశుఁడెన్న నసురాభేద్యుం
డేమునివృత్తిఁజరించుట
రామునకున్వాఅ దికాదె రావణవింటే. ౨౨౪.

మ. మునుగాధేయుఁడొనర్చుజన్నమునునిర్మూలంబుగాఁజేయనా
యనుజుండేనుజనన్రఘూద్వహుఁడుదివ్యాస్త్రింబుసంధించిచ
య్యనసన్నీ మెడఁద్రోసెఁగానమతియేనారాముబాహాబలం
బునునొక్కింతనెఱింగినాఁడమదినాబుద్ధిన్వివేకింపుమా. ౨౨౫.

క. నీసతులసుతులహితుల
న్భాసురమగునట్టినిఖిలభాగ్యంబెల్ల

స్థీసహితకావఁబూనిన

నీసరికింజనుములంక కిదినీతిసుమీ. ౨౨౬.

వ. అని మారీచుండు పల్కుటయు రావణుం డప్పటి కొక్కభంగి నీయకొని రథారూఢుండై మఱలి లంకాపురంబున కరిగె నా సమయంబున. ౨౨౭.

శూర్పణఖ రావణుకడకుం బోయి తన భంగం బెఱింగించుట.

సీ. రాముబాణాగ్ని చేరణమునఁగూలిన

ఖరదూషణాదులఁగాంచివగచి

కడువేగఁబాఱిలంకాపురిఁజేరిత

న్నగరంబుననుమహోన్నతముగాఁగఁ

దనరునాస్థానసదనమునభటపరి

చారకగణములుసందడింప

గరుడోరగామరగంధర్వకిన్నర

రమణులునాలవట్టములు వీవ

భద్రసింహాసనోపరిభాగమునను

మించికొలువున్న రావణుఁగాంచియతని

పదములకుమ్రొక్కినిలిచెదౌర్భాగ్యనిరత

శూర్పణఖమృత్యుదేవతసాబగుదోఁప. ౨౨౮.

వ. ఇట్లు కర్ణనాసికాచ్ఛేదనంబుకతన జొటజొటం దొఱఁగురక్తధారల తోడఁ గానంబడు చెలియలివికృతాకారంబుఁ గాంచి రావణుండు దండతాడితమహోద్దండదుండుభంబుకైవడి భగ్గుభగ్గున మండుచు ని ట్లనియె. ౨౨౯.

క. నాకుంజెల్లెలవనిని

న్నీకొలఁదినెఱుంగ కెవ్వఁడొగ్గోనరించె

న్నా కాధిపుఁడైనన్నదిఁ
జేకొనకేఖడ్గమునను జెందెదఁగడిమిన్. ౨౩౦.

గీ. ఎఱుఁగఁదెల్పుమిప్పుడింతినీవెంటనే
నరుగుదెంచిశౌర్యమధికరించి
వానిఁదునిమిరక్తమానని చ్చెదనీకు
ననినఁజుప్పనాఁతియనియెనిట్లు. ౨౩౧.

సీ. దశరథక్ష్మాపాలతనయులురామల
క్ష్మణులనువారతిరణనిపుణులు
దమతండ్రిపనుపునదండకాటవిఁజేరి
పంచవటినివసియించియుండ
వారిరూపవిలాసవైభవంబులఁగాంచి
కామించియేఁబోయికవయఁబిలువఁ
గోపించినాముక్కుఁగోసిపుచ్చుటయును
వినిఖరదూషణుల్వేగమునను
విశదయశులగునాచతుర్దశసహస్ర
దనుజబలములఁగూడియుద్ధతిఁగడంగి
రాముబాణాగ్నినీఱైరిరాక్షసేంద్ర
తెలిసియందుండనోపకేతెంచితిటకు. ౨౩౨.

క. నీతోఁబుట్టువనంబ్ర
ఖ్యాతిగవిలసిల్లునన్నుఁగనిసురవైరు
ల్భీతిల్లిపాఱమనుజుని
చేఁతలనిప్పాటువడఁగఁజెల్లునెయధిపా. ౨౩౩.

క. అనుటయురావణుఁడిఱువది
కనులన్నిశిఖలుపర్వఁగానిట్లనియె

స్తనుజులమనుజుఁడుదునుముట
    వినియెఱుఁగముకాదెయట్టివీరుఁడుగలఁడే. ౨౩౪.

గీ. వానినాదుబాణవైఖరినుఱుమాడి
    నీమకోఱంతఁదీర్తునిక్కముగను
రమ్ముపోదమనినసమ్మతింపకచుప్ప
    నాఁతివల్కెదనుజనాథుతోడ. ౨౩౫.

ఉ. రామునిఘోరవిక్రమమురాజసభావమునాజినోర్వను
త్రామునకైనమన్మథవిరామునకైనఁదరంబెనీవుని
ల్లేమఱిపోవుటొప్పదిపుడేనెఱిఁగింతునుపాయమెట్లనం
గోమలిసీతనాఁదనరుఁగూరిమిభార్యయొకర్తువానికిన్. ౨౩౬.

గీ. దానిఁదెచ్చితేనిఁదాభార్యనెడఁబాసి
    యోర్వలేకయాతఁడుర్విఁగూలు
నింతెకాకయట్టియింతినీకబ్బినఁ
    గోదవల్లెల్లఁబండుఁగోర్కెనిండు. ౨౩౭.

ఉ. చూచితినిర్జరాంగనలఁజూచితిఖేచరనీలవేణులం
జూచితియక్షకామినులఁజూచితిఁబన్నగసన్నుతాంగులం
జూచితిదైత్యసుందరులఁజూచితిమానవకన్యలన్నిజం
బాచెలిసాటిముజ్జగములందునుగానదానవేశ్వరా. ౨౩౮.

ఉ. దానిమనోహరాకృతియుదానివయోవిభవాతిరేఖయు
న్దానివచోవిలాసమునుదానిమెఱుంగగుమేనికాంతియు
న్దానిదయార్ద్రచిత్తమునుదానిమిటారపుబెళ్కుచూపులు
న్దానికెకాకయిజ్జగతిఁదామరసాక్షులకొప్పదెప్పుడున్. ౨౩౯.

ఉ. చందురుఁగేరుమోముసుమసాయకువింటికొమల్బొమల్మదేం
దిందిరబృందముల్కురులుదిక్కరికుంభములెన్నఁజన్నులే

మందుఁగపోలముల్దళుకుటద్దములైతనరారుచుండునా
చందనగంధిసోయగమువన్నుతిసేయఁదరంబె యేరికిన్. ౨౪౦.

క. ఆచెలిసీచెలిమైన
   న్నీచెలువంబుగ్గడింపనేర్చునెవిధి నే
దాఁచక తెల్పితిదాని
   న్వేచేకొనఁదలఁపుమిపుడె విబుధవిదారీ. ౨౪౧.

క. అనిశూర్పణఖమహామో
   హానకరమగుచొక్కుఁజల్లినట్లుప్రబోధిం
చినవిధిప్రేరేపఁగన
   ద్దనుజాధీశుండుగామతత్పరుఁడగుచున్. ౨౪౨.

గీ. కొలువుఁజాలించిసీతపైఁగోర్కెఁబెంచి
   యరదమెక్కి మహాంబుధినటుతరించి
యందుమారీచుఁబొడఁగాంచియనునయించి
   రావణుఁడువల్కెమదిననురాగమెసఁగ. ౨౪౩.

గీ. వింటెమారీచరామునిబంటుతనము
   ఖరముఖులఁద్రుంచుటయుకాకకఠినవృత్తి
నపకృతియొనర్చెనాకునేనదియెఱింగి
   మఱలివచ్చితినీతోడమందలింప. ౨౪౪.

వ. అది యెట్లంటేని. ౨౪౫.

ఉ. మేదినినెల్లదిక్కులనుమేలిమితోడఁజరించుచుండునా
   సోదరిసద్గుణాఢ్యయగుశూర్పణఖంగనికర్ణనాసికా
   చ్ఛేదమొనర్చెరాముఁడదిచెచ్చెరనేడ్చుచురాఁగనామది
   ఖేదముజెంతెనిప్పగిదిఖిన్నతకేనెటులోర్తుఁదెల్పుమా. ౨౪౬.

క. కావుననేఁజనిరాముని
దేవింగొనియెదనుదత్ప్రతీకారముగా
నీవున్నాకుసహాయము
గావిచ్చేయంగవలయుఁగాననమునకున్. ౨౮౭.

క. కనకమృగాకృతిచేన
య్యినకులులభ్రమింపఁజేసియొటకేనియుఁదో
డ్కొనిజనుమేనాసమయం
బునరామునిసతినిఁదెత్తుఁబొంకమువిూఱన్. ౨౮౮.

క. తగదనకిటుగావించియు
నగధృతివైనచ్చితేనినారాజ్యమునన్
సగఁబాలునీకొసంగెద
నగణితముగనేలుచుండుమమరులుగొలువన్. ౨౮౯.

వ. అని రావణుండు వల్కుపల్కులు ముల్కులక్రియ నాటి హృదయ
భేదనం బొనర్పఁ దత్తఱంబున మారీచుం డి ట్లనియె. ౨౯౦

క. ఏమనుదెల్పినబుద్ధుల
నీమదినొక్కింతయైననిజమెఱుఁగఁగలే
కీమాడ్కిమఱలివచ్చితి
వేమనఁగాఁదగునురాక్షసేశ్వరనిన్నున్. ౨౯౧

క. తనకోఁతఁదానెఱుంగక
చనిమనశూర్పణఖరామచంద్రునిఁగామిం
చినముక్కుఁగోసిపంచెన
తనిపైఁగ్రోధింపఁదగునెదనుజాధీశా. ౨౯౨.

ఉ. రాముఁడుపిన్ననాఁడొకశరంబుననంబుధిఁద్రోసెనన్నునేఁ
డామనుజాధినాథసుతుఁడాహవభీముఁడుఘోరసాయక

స్తోమములొప్పమెప్పగనుశూలధరాదులకైననౌనెనం
గ్రామతలంబునందతనికెట్టెదుటన్నిలువంగరావణా. ౨౪౩.

క. రవమునినరత్నమనిన
 గ్రవియనరమణీయమనినరణశూరుఁడన
న్భువిరేఫాద్యాఖ్యలునా
 చెవిసోఁకినమదిఁగలంగుసిద్ధమువింటే. ౨౪౪.

క. సగపాలొసఁగెడననుచుం
 డెగువంబలికితివిరామదేవునకెదురై
మగుడినఁగదనీవెసఁగుట
 పగఁగొనిబ్రతుకంగఁదరమెబ్రహ్మాదులకున్. ౨౪౫.

వ. అదియునుంగాక. ౨౪౬.

చ. పరసతులన్మదాంధులయిబల్మినిఁబట్టఁదలంచునట్టిపా
పరతులయాయువుల్సకలభాగ్యములున్నశియించుఁగాననీ
చిరతరసంపదల్కులముఁజెల్వముఁగాచికొనంగడంగదే
నిరవికులేశుకూర్మిసతినింగొననెన్నకుమయ్యయిమ్మెడన్. ౨౪౭.

మ. సురసిద్ధోరగసాధ్యకింపురుషరక్షోయక్షగంధర్వకి
న్నరకాంతామణులెల్లనిన్గలసియానందింపుచుంగొల్వఁగాఁ
బరమప్రీతిఁజెలంగుటల్విడిచిదారాభాగ్యప్రయుక్తాత్మయా
నరభామన్మదిఁగోరఁజెల్లునెయిటుల్నాకారియూహింపుమా. ౨౪౮.

క. నీకాప్తుఁడనగుకతమున
 నీకరణిం దెల్పఁబూనితిదిబుద్ధిగనీ
వాకర్ణించిమదినిబటుధృతిఁ
 జేకొనిలంకాపురంబుఁజేరఁగనొప్పున్. ౨౪౯.

వ. అని తాటకేయుండు నానాప్రకారంబులం బ్రబోధించుటయు రావణుండు విధిప్రేరణంబున విన నొల్లమి నత్యాగ్రహుండై చుఱచుఱం జూచుచు నప్పుడు. ౨౬౦.

క. ఏనసురేంద్రుండనిసుం
తైనను భావింపకిటులనాడఁదొడంగె
న్నీనివధింతుననుచురాఁ
గానమ్మారీచుఁడాత్మగతముననవియెన్. ౨౬౧.

క. అనలమునఁబడెడుఫణినె
త్తినతాతనిమఱలఁగఱచుతెఱఁగుననిమ్మా
ఘునకుహితంబులుదెల్పిన
ననుఁదునుమందలఁచెనేమనందగునింకన్. ౨౬౨.

క. ఈనీచునిచేఁజచ్చుట
కైనన్రాఘవునిచెంతకరిగియతనికే
మేనొసఁగినాకపథమున
కేసరిగెదననుచునెంచియిట్లనిపలికెన్. ౨౬౩.

గీ. దనుజనాయకభవదాజ్ఞఁదలనుమోచి
కొనియొనర్చెదనెంతేనిఁగాదవలేక
యాగ్రహముమానివేవేగనరదమెక్కి
రమ్మునాతోడదండకారణ్యమునకు. ౨౬౪.

వ. అని యిట్లు మారీచుం డాడంబడుటయు నా రావణుండు హర్షాంతరంగుండై వానిఁ దనరథం బెక్కించుకొని చని చని దండకారణ్యంబుఁ బ్రవేశించి పర్ణశాల డాయం బోయి తా నొక్కచో నదృశ్యుండై యుండి మారీచునిం బనిచిన నమ్మాయావి యప్పుడు.

మారీచుండు మాయామృగం బగుట.

సీ. కపకంపుజిగిమేనికాంతియునీలాల
కెనయగుకన్నులునింపుగుల్కఁ
బవడంపుఁగన్నెమల్లవలీనుకర్ణంబు
లల్లనల్లనివాలమతిశయిల్లఁ
బచ్చలశృంగముల్బలుముత్తెములపాద
లైవైడూర్యఖురములువన్నెకెక్క
మాయాకురంగమైమారీచుఁడప్పుడు
సరగుననాపర్ణశాలకడను
హరుఁడుదనవిల్లురాముఁడీయతివకోఱకు
విఱిచెఁగావుననలయింతువీరినుచుఁ
జేతిమృగమునుబనిచినరీతిఁదనరి
మించియటుపొంచివంచించిమెలఁగఁదొణఁగె. ౨౬౬.

ఉ. వాలరుచిస్మయూరములవైఖరినాడఁగఁజేయునైజమై
డాలుననొక్కచోఁబసిఁడిడాలొనరించుచునిక్కిచూచుశం
పాలతరీతిబెళుకభ్రమపాటుగఁజెంగునదాఁటునీడకై
సాలముపొంతఁజేరుమృగజాలములన్బెదరించునేర్పడన్. ౨౬౭.

వ. మఱియు నమ్మాయాకురంగంబు నింగి కెగయుచు నిలాతలంబునఁ బవ్వళించుచు నిట్టట్టుఁ జనుచు ఖురంబుల నేలం ద్రవ్వుచు నాఘ్రాణించుచు నంతంతం బొడసూపుచుఁ జేరువకుం జనుదెంచుచుఁ జెవుల బిక్కిరింపుచుఁ గ్రేళ్లుఱుకుచు శచీంద్రులద్రోవల నృత్యం బొనర్చు నిర్జరవారాంగనచందంబున రామభూమిజానివాసం బగుపర్ణశాలం డాసి నటనం బొనర్చుచుండె నయ్యవసరంబున. ౨౬౮.

గీ. కాలసన్నిహితంబయ్యెఁగానఁబూని
లంకదగ్ధంబుసేయఁగారమ్మటంచుఁ
బిలువనేతెంచుయమదూతచెలువుదోఁపఁ
గనకమృగమప్పగనుపట్టెజనకజకును. ౧౧౯.

క. ఇటుతనకెదురుగఁదోఁచిన
మటుమాయమృగంబుఁజూచిమైథిలిమదిను
త్కటమగుసంభ్రమమందుచుఁ
దటుకునరాఘవునిఁగాంచితానిట్లనియెన్. ౧౨౦.

ఉ. ఎన్నఁడునిట్టివింతమృగమివ్విపినావనియందునెందునుం
గన్నదిగానువిన్నదియుఁగాదిదికన్నులపండువయ్యెనేఁ
బన్నగదీనిచర్మమునఁబండిసుఖింపఁగఁగోరుదానన
న్మన్ననచేసివేయరిగిమానకతెమ్మిఁకఁబ్రాణనాయకా. ౧౨౧.

వ. అని జనకతనూజ కపటదానవుతెఱంగు గా నెఱుంగక కనకమృగం బని భ్రమఁ జెంది దానిచర్మంబుఁ గోరుటయు నా సాధ్వీతలం పౌనర్పం బూని రాఘవుండు లక్ష్మణునిచేవి ల్లందుకొని పర్ణశాలయం దేమ ఱక కాచియుండునది యని నియమించి గొనయం బెక్కించి కరం బున శరం బమర్చి డాయం జనునప్పు డమ్మాయామృగంబు ౧౨౨.

మ. పొదలందూఱనుబాఱిమేయుటకునైపోవున్మహీజంబుమా
టొదవండాఁగునుమిట్టపల్లములపైనుంకించిదాఁటున్గిరు
ల్గదియంబ్రాఁకునునలైసల్దిరుగువేగంజప్పుడాలించిపె
ల్లదరున్గ్గనిపాఱునంతటనెమాయంబైమఱిన్గన్పడున్. ౧౨౩.

క. మృగమెటుచనురాఘవుఁడ
ప్పగిదింజనివెంటనంటిబలువడిమీఱ

న్నిగులవనంబునఁ గుమ్మతి
దగఁగొనియొక్కటనునిలుచుఁదకువులనీడన్. ౨౭౬.

క. మాయామృగమీగతిరఘు
నాయకునలయించికాననమునకు వేగాం
బోయియటుడించితామతి
మాయంబైచనఁదలంపమనుకులుఁడంతన్. ౨౭౭.

మ. అసురుండంచు నెఱింగిభీమమగుబ్రహ్మాస్త్రంబుసంధించిది
గ్విసరంబుల్చలియింపనిర్జరవరుల్విస్వీధిఁ గంపింపస
ప్తసముద్రంబులుదల్లడిల్లమునిసంతానంబులగ్గింపన
య్యసమానుండగురాఘవుండడలఁజేయన్మోసెనోదోంతముల్. ౨౭౮.

గీ. అమ్మహాస్త్రంబుదైత్యుపైనడరిహతము
సేయహాసీతహాలక్ష్మణాయటంచు
ఘోరనిర్ఘోషమొనరించికూలెలంక
గూలెరావణుఁడిలఁగూలెఁగూలెననఁగ. ౨౭౯.

వ. అంత నద్దైత్యుం డొనర్చునినాదంబు గర్భనిర్భేదనం బొనర్పం దల్లడం బంది లక్ష్మణుం జీరి జానకీదేవి దుఃఖంచుచు ని ట్లనియె.

శా. అన్నా లక్ష్మణవింటెరాముఁడిపుడత్యార్తారవంబొప్పఁగా
నిన్నున్నన్నును బేర్కొనెన్వనమునన్నిక్కంబుగాసిల్లెనో
యెన్నదైత్యులచేతఁజిక్కెమఱితానేయాపదంజెందెనో
కన్నారందిలకింపఁగాఁదగదె వేగంబోయినీవీయెడన్. ౨౭౯.

క. కనకమృగంబనిభ్రమసితి
దనుజుండగు టెఱుఁగనైతిఁ దప్పెనుగార్యం
బనఘాత్మయరసిరమ్మిటు
వనమునకీవరిగియిపుడ వశ్యముగాఁగన్. ౨౮౦.

వ. అని డోలాయమానమానసయై వగచుచుం బలుకుజనకజం గాంచి లక్ష్మణుం డి ట్లనియె. ౨౮౧.

గీ. తల్లినీవిపుడిట్లేలతలఁకెపలుక
    వీరుఁడగురాఘవునకొక్కవెఱపుగలదె
యట్టులైననుభువనమ్ములిట్టిపడవె
    యినుఁడుగూలఁడెధరణిపైనెఱుకవలదె. ౨౮౨.

గీ. మాయదైత్యుండురాముచేసాయకమునఁ
    ద్రుంపఁబడుచోమనలభ్రమియింపఁజేసెఁ
గానఁదలకంగవలదురాఘవుఁడువేగ
    రాఁగలండూఱడిల్లుముబాగుమీఱ. ౨౮౩.

వ. అని లక్ష్మణుండు వల్కుటయుఁ దద్వాక్యంబులు క్రూరనారాచంబుల భంగి హృదయంబు భేదిల్ల ధరణీజాతక్రోధశోకంబులు రెట్టింప ని ట్లనియె. ౨౮౪.

క. నిన్నతిభక్తుండనిమది
    మన్ననగావించుచున్నమనుజవరేణ్యుం
డెన్నికనిటుచీరినవిన
    కున్నట్లుచరించెదకటయొగిదాయవలెన్. ౨౮౫.

గీ. రాముఁడసురచేతరణమునఁబడుటయు
    నెఱిఁగినన్నుఁగలయనిచ్చఁదలఁచి
యున్నతెఱఁగొకాకయుర్వీశుఁడగుభర
    తునకొసంగఁగోరితోమనమున. ౨౮౬.

క. ఈతలఁపొప్పదువినుమా
    భూతలపతియైనజనకపుత్రినిగానా

గౌతమియుదుంబ్రాణము
    లీతఱిఁబాయుదును గాక యెంతు నెయెురులర్. ౨౮౭.

వ. అని యిట్లు విధిప్రేరితంబై పలుకుపలుకులు ములుకులక్రియ నాటినఁ గరంబులఁ గర్ణరంధ్రంబులు మూసికొని రామరామా యని వన దేవతలసాక్షిగాఁ గోరి కన్నీరు మున్నీరులై పాఱ వగచుచు జన కజం గని లక్ష్మణుం డిట్లనియె. ౨౮౮.

క. ఇదెపోయి తెత్తు రామునిఁ
    బదరకుమజ్జననియనుచు భక్తిదలిర్పం
బదములకు మ్రొక్కి మార్గము
    వదలక లక్ష్మణుఁడుసనియె వనమునకరయన్. ౨౮౯.

ఉ. అంతట రావణుండుదనుజాకృతిమానినిజాంతరంగమం
తంతఁజెలఁగనుబ్బుచు మహాముని వేషముఁబూనిపర్ణశా
లాంతరమందుఁజొచ్చికుముదాప్తునిఁ బాసినరోహిణీక్రియం
జింతిలుచున్న భూతనయ చెంతనునిల్వఁగ నవ్వధూటియున్. ౨౯౦.

క. మునివరుఁడనియాతిథ్యం
    బను వొంద నొసంగ నప్పుడమ్ముదిత నిజా
ననముఖ్యరూప యౌవన
    మునుగని మెచ్చుచును గపటముని యిట్లనియెన్. ౨౯౧.

ఉ. ఎవ్వరిదాన వీవుతరళేక్షణ భారతి వొ బ్రహ్మ దాని వొ
యివ్వనలక్ష్మి వొ రతి వొ యింద్రునికాంత వొ కాక యున్నచో
నివ్వసుధాస్థలిన్దలఁపనింతులకీచెలువంబు గల్గునే
జవ్వని యొంటినిట్లునికిచయ్యనఁ దెల్పుము దాఁచకిప్పుడున్. ౨౯౨.

వ. అనిన జానకి యిట్లనియె. ౨౯౩.

క. ఇనకులుఁడగుదశరథుప్రియ
తనయుఁడురాఘవుఁడునాకుఁదగుభర్తనను
జ్జనకజయందురులక్ష్మణుఁ
డనఁగానామఱఁదియతిబలాధికుఁడొప్పున్. ౨౯౪.

క. ఈకాననమునమువ్వుర
మేకడలందిరుగుచుండుమిందొకమృగము
న్నాకద్భుతముగఁదోఁచినఁ
జేకొనిరారాముఁడరిగెశీఘ్రగమనుఁడై. ౨౯౫.

గీ. అతనిరాకదడయనగ్రజుఁదోడ్తేర
లక్ష్మణుండుసనిమెలావుమెఱయ
నొంటినున్నదాననోమునివరభవ
దాగమనముఁదెల్పుమాదరమున. ౨౯౬.

వ. అనిన రావణుం డి ట్లనియె. ౨౯౭.

క. ధనదానుజుఁడనురావణుఁ
డనువాఁడన్నిఖలదానవాధీశుఁడన
వ్వననిధినివెలయుచుండెడు
ఘనలంకాపురమునేలుఘనుఁడనువినుమా. ౨౯౮.

గీ. అష్టదిక్పాలురెపుడునాయాజ్ఞఁదలఁచి
మెలఁగుచుందురుననుఁబోలుమేటివీరు
నండనుండిననీచెల్వమతిశయిల్లఁ
బేఁదమానవుపొందేలబిసరుహాక్షి. ౨౯౯.

గీ. రమ్ములంకాపురమునకుసమ్మతమున
ననుచుఁజీరుచుఁదననిజతనువుఁజూపఁ

గాంచిధరణిజభయమునఁగలఁగితొలఁగి
యడలిదిగులొందిమూర్ఛిల్లియవనిఁబడియె. 300.

వ. ఇట్లు ధరాతలంబునం బడి మూర్ఛం జెందియున్నజనకజం గాంచి రావణుండు దన పాలింటికాలమృత్యువుం గొనిపోవుకరణి నద్ధరణీజాత నెత్తి నిజరథంబున నిడికొని గగనమార్గంబున లంకాభిముఖుండై చనుచున్నయెడ. 30౧.

క. తనమూర్ఛఁదెలిసిజానకి
దనుజునిచేఁజిక్కి యెఱ్ఱఁగితనువువడంకం
గనుఁగవనశ్రులుదొరఁగఁగఁ
బెనురవమునరామభద్రుఁబేర్కొనివగచెన్. 30౨.

ఉ. అక్కటరామచంద్రదనుజాధముఁడో దశకంఠుబారినేఁ
జిక్కితిదీననైతినినుఁజేరెదవేగమెరాఁగదేమది
న్నెక్కసమైనభీతిఁబలవింపఁగఁదాఁగొనిపోవుచున్నవాఁ
డిక్కటినాత్మనింతునియనేయుమునాచెఱబాయనియ్యెడన్. 303.

క. పైఁడిమృగంబనిభ్రమగొని
పోఁడిమిచెడియడవికేలపొమ్మంటినినున్
వేడుకలుదలఁపనిట్లొడఁ
గూడుటలెఱుఁగంగనైతిఁగుతలాధీశా. 30౪.

క. అన్నాలక్ష్మణగుణాసం
పన్ననినిన్నాడుకఠినభాషణఫలము
న్నిన్ననమొందితినన్ను
న్నన్ననచేఁబ్రోవరమ్ముమదిదయపేర్మిన్. 30౫.

గీ. ఏమిసేయుదానని దానవాధముం
డేమొనర్చునొక్కొయెఱుఁగనేర

నమరులారయక్షతములారజనులార
ఖగములారనన్నుఁగావరయ్య. ౩౦౬.

సీ. తరులారనాసహోదరులారతెల్పరే
ధరణీశుఁడైననాథునితోడ
యతులారవిపినదేవతలారతెల్పరే
పలుదెఱంగులభానుకులునితోడ
నదులారజాజిపూఁబొదలారదెల్పరే
కడువేగలక్ష్మణాగ్రజునితోడఁ
గరులారఘనముకాఁగిరులారదెల్పరే
కోదండదీక్షాదిగురునితోడ
దనుజుఁడిబ్బంగిననుఁగోరితగనిదారి
నాపతినిడాఁగురించితిన్నగనుబొంచి
మించికొనిపోవుచున్నాఁడుమీరలిపుడు
పలుకుఁడీజాడమారామభద్రుతోడ. ౩౦౭.

క. అనియనిపేరెలుఁగునరా
మునిఁజీరుచులక్ష్మణునకు మొఱలిడుచునుబో
రునదుఃఖించుచుఁజనుసీ
తనుగనిదివిజులుగలంగితలఁకిరిమదిలోన్. ౩౦౮.

క. వనమునఁగలమృగతతులె
ల్లనుమేయుటలుడిగిదివినిలక్ష్యంబిడిలో
చనములనుసలిలధారలు
ఘనముగఁదొరఁగంగనిలిచికాంచుచునుండెన్. ౩౦౯.

జటాయువు రావణున కడ్డం బగుట.

గీ. అంతభూమిజాతయాక్రందనధ్వను
లెల్లెడలనునిండిపల్లవింప
నమ్మహానినాదమాలించిఖగకులా
ధ్యక్షుఁడగుజటాయువాక్షణమున. ౩౧౦.

గీ. పక్షవిక్షేపసంజాతపవనఘాత
చలితకకుభంతరాళుఁడైబలిమినెగిరి
భానుబింబంబుఁగప్పుస్వర్భానుభంగి
దశముఖునకడ్డమైపల్కెదర్పమొప్ప. ౩౧౧.

క. రావణముచ్చిలిరాముని
దేవింగొనితెచ్చితెంతధీరుండవునీ
హావసుధేశునితోనని
గావించినఁగాదెనీదుఘనమెఱుఁగఁదగున్. ౩౧౨.

క. పరదారాపహారకుదు
ర్భరకలుషమెకాకసుకృతభవనముగలదే
యరయకిటుచేయనేటికి
గురుతరమైవెలయుబ్రహ్మకులజుఁడవయ్యున్. ౩౧౩.

క. విడువుమిఁకనైనసీత
న్విడువకమొండొడ్డితేనివిడుతునెనిన్నుం
బొడిపొడిగానాపదములఁ
బడఁదన్నుదుఁగాకయొండుపలుకనుజుమ్మా. ౩౧౪.

వ. అని యట్టహాసంబునం బల్కుజటాయువుం గాంచి రావణుండు కోపసంరక్తవిలోచనుండై కోదండం బెక్కిడి శరపరంపరలు గురియింప నవ్విహగేంద్రుం డవ్విశిఖంబుల విఱిచి పోవైచి రథంబు

పయిం గుప్పించి వజ్రోపమానంబు లగునిజనఖంబుల నద్దనుజుమకుటంబుల డుల్చి తనువు వ్రచ్చి రుధిరప్రవాహంబు గావించి ధనుర్దండంబు ఖండించిన నాగ్రహంబు దోఁప దానవాధీశుండు పరిఘంబుఁ ద్రిప్పి వైచుటయు నతం డా శస్త్రరాజంబుఁ జూర్ణం బొనర్చి చేరం జనుదేరం గని ఖడ్గంబుఁ గేల నమర్చి పక్షయుగ్మంబును బదద్వయిం దునిమిన భీకరప్రహారంబునఁ బక్షంబులు దెగి పడు మహాపర్వతంబుభంగి జటాయు విలాతలంబునం బడియె నంత జనకతనూజాత దశగ్రీవునిఁ దృణీకరించి తృణంబుఁ గేలం బూని యిట్లనియె.

ఉ. ఓరిదురాత్మరాఘవునియుద్ధతిమీఱఁదొడంగిబంటవై
పోరజయంబునొందికొనిపోవకయీక్రియఁముచ్చిలించిన
న్నూరకెయొంటినున్నతఱినెయ్యనఁదెచ్చుటనీతిమార్గమే
చేరికనిట్టికర్మములుచెందిననుస్మరియింపకుండునే. ౩౧౬.

క. పాపాత్ముఁడవేవేగమె
నాపతినిన్నాఁగురించిననఁదెచ్చితివీ
పాపమునసీవునీసతు
లీపగిదింబాసివెతలనెంతయుఁజెడుఁడీ. ౩౧౭.

చ. వలదురపక్తికంఠరఘువర్యునికోపదవానలంబునీ
కులముబలంబుసంపదలుఁగూల్పకపోవునెయెన్నిభంగులం
దులువతనంబువీడఁగనుదోడనెనీవిఁకనన్నొసంగియా
జలజహితాన్వయాంబునిధిచంద్రునిమన్ననఁజెందుమియ్యెడన్.

గీ. రామభద్రునెదుటరానోడిపలువిడి
సకలజలధులందుస్వర్గమందు
నాగలోకమందుడాఁగియుండినఁగాని
వెతకిచంపునిన్నువిడువకతఁడు. ౩౧౮.

వ. అని ధరణీతనూజ వాపోవుచుం బల్కు-పల్కు-లఁ జెవి నిడక యప్పుడు.

గీ. రావణుండు రాము రాకకైతలఁకుచుఁ
బఱవఋశ్యమూకపర్వతమున
వానరులనుగాంచివసుమతీసుతతన
తొడవులంశుకమునముడిచివైచె. ౩౨౧.

క. అంతన్దశముఖుఁడంబుధి
నంతంతంగడచిలంకకతివేగమెతా
సంతసముసఁజనినైజని
శాంతంబునరథముడిగ్గెజనకజతోడన్. ౩౨౨.

వ. ఇట్లు రథంబు డిగ్గి కక్ష్యాంతరంబులు గడచి పోవుచు మైథిలి ననున యింపుచు రావణుం డిట్లనియె. ౩౨౩.

చ. సరసిజనేత్రకాంచితెవిశాలతరంబగుమద్గృహంబుభా
స్కరశతకోటితేజమునఁగన్పడనయ్యెడురత్నహేమవి
స్ఫురితముచూడుమెల్లపుడుపోల్పదివౌకసనాథముఖ్యది
గ్వరులనికేతనంబులెనవచ్చునెనిక్కముపల్కెదంజుమీ. ౩౨౪.

క. కిన్నరగంధర్వామర
పన్నగయక్షాదిసతులుభావములందు
న్నన్నెల్లమినీగతిఁజెఱ
నెన్నడుపడియున్నవారలెఱుఁగుముతరుణీ. ౩౨౫.

క. అదెసౌధాగ్రములనుస
మ్మదమునననుఁగూడిమెలఁగుముదితలుబహుసం
పదలంబొదలుచువిహరిం
చెదరుకనుంగొనుముచెలియచింతలుదొలఁగన్. ౩౨౬.

గీ. దివిజులనుగెల్చిదెచ్చినదివ్యరత్న
భూషణావళులొప్పవిశేషముగను
నాగభువనంబుననుగలనాణెమైన
మణులువెలిఁగెడునాయింటమగువకంటె. 3౨౭.

క. రణమొనరించిధనాధిపు
నణుమాత్రముగాఁగనెంచియతనికిఁగలయీ
మణిపుష్పకంబుఁగొంటిని
ప్రణుతింపందరమెదీనిఫణిపతికైనన్. 3౨౮.

ఉ. ఈమణిపుష్పకంబుఁదగనెక్కిజగంబులసంచరించియెం
తేమహిమాధికంబుగనుదిక్తతులేలుచునుందునెప్డునా
రామలువేలసంఖ్యలుతిరంబుగనెప్పుడురెల్లవారికిం
గోమలినీవెపెద్దవయికోరినభోగములందుచుండుమా. 3౨౯.

క. ఈమాడ్కిఁబొగులనేటికి
నామీఁదంగరుణఁదలఁచినన్నేలుమునీ
వామనుజులపైనాసలు
భామినివలదుడుగుమింకఁబ్రజ్ఞాన్వితవై. 330.

వ. అని రావణుండు పలు తెఱంగుల నిజసంపద్విలాసంబులఁ దెల్పుచుండుటయు వినరామింజేసి వగచుచు మనంబున ధైర్యం బవలంబించి జనకనందన యిట్లనియె. 33౧.

గీ. నీచరాక్షసనినునీదునిఖిలభాగ్య
వైభవములెల్లనిజబాణవహ్నిఁగాల్చి
నన్నుఁగొనిపోవుదశరథనందనుండు
సిద్ధమీమాటనమ్ముముబుద్ధియందు. 33౨.

క. అనిధరణిజఘనరోషం
బునఁబలుకఁగ రావణుండుభుజగము క్రియలో
చనములనగ్నులుదొరఁగం
గనుఁగొని త్రిజటాదిదనుజకాంతలకనియెన్. ౩౩౩.

క. ఈరామామణినినశో
కారామమునందునిడి ప్రియంబలరఁగనే
మాఱికబోధించినను
జేరంజేయుండటన్నఁజెచ్చెరవారున్. ౩౩౪.

క. కడుదుఃఖార్ణవమునఁబడి
యడలుచునున్నట్టిసీతనయ్యెడగుములై
పడఁతులశోకారామము
కడకుందోడ్కొనుచుఁజనిరికడఁకదలిర్పన్. ౩౩౫.

వ. అంతఁ గాంతారంబునందు. ౩౩౬.

శా. మారీచుం దెగటార్చి రాఘవుఁడునిర్మానుష్యమాఘోరకాం
తారోర్విన్వడి నేగు దేరఁగసుమిత్రానందనుండంతటం
జేరంబోయినమస్కరించుటయునాశ్రీరాముఁడయ్యుత్తమా
కారుంగాంచిమదింగలంగిమిగులంగంపించితానిట్లనెన్. ౩౩౭.

క. జనకజనొంటినిడించియు
వనమునకరుదేరఁదగునెవదలక దైత్యు
ల్మనపగతురగుటనెఱుఁగవె
మనమునలక్ష్మణయిదేలమఱచితివకటా. ౩౩౮.

వ. అనిన లక్ష్మణుం డత్యంతచింతాశ్రుధారాపూరితలోచనుం డగుచు
నిట్లనియె. ౩౩౯.

చ. దనుజుఁడుతావకాస్త్రహతిధారుణిఁబైఁబడుచోననుస్మహీ
తనయనుబేర్కొనంగమదిఁదల్లడమందుచుఁదద్వధూటిగో
బ్బునఁజనికాంచిరమ్మనుడుఁబూనికనేనపుడూఅడిల్లఁబ
ల్కినవిననొల్లకాత్మఁదలకింపుచునాపయిఁగోపగింపుచున్. ౩౮౦.

క. వినరానిదుర్వినీతుల
ననుఁబోనాడుటయువినిమనంబునదుఃఖం
బునుబెనఁగొననియ్యడవికి
నినుఁగానవచ్చినాఁడనిక్కంబనఘా. ౩౮౧.

వ. అనిన రాఘవుం డి ట్లనియె. ౩౮౨.

క. వనితలవివేకులెఱుఁగరు
వెనుకన్రాఁదగినకీడువివరముగాఁగ
న్జనకజమాటలకైరాఁ
జనునేసౌమిత్రిమదినిశాంతమువలదే. ౩౮౩.

గీ. ఇంతలోననింతియేమయ్యెనోమది
నెంతభీతిఁజెందిచింతతోడ
మనలనరయనెంచుఁజనియెనోయెఱుఁగరా
దరుగవలయువేగననుచునపుడు. ౩౮౪.

గీ. అనుజుతోఁగూడిరాఘవుండరిగియరిగి
శారికాహీనమైనపంజరముకరణి
హిమకరుఁడులేనిరాత్రిచందమునమిగుల
శూన్యమగుపర్ణశాలవేచొచ్చికాంచి. ౩౮౫.

గీ. అచటసీతఁగానకతిశోకదందహ్య
మానుఁడగుచురామమనుజవిభుఁడు

భూరిదుఃఖముననుబొరలుచుమహిఁదూలి
ముదితఁదలఁచితలఁచిమూర్ఛనొందె. ౩౪౬.

క. అదిగనిలక్ష్మణుఁడగ్రజు
నెదఁజేర్చుకసేదదేర్ప నెఱిఁగికనులనీ
రొదవఁగరాఘవుఁడయ్యెడఁ
బదపడివిలపింపఁదొడఁగెఁబరిపరిగతులన్. ౩౪౭.

మ. తరుణీసన్నరయుంగనేగిఘనకాంతారంబునంజిక్కితో
వరుసన్నాపముసల్కఁబూనియెచటన్వర్తింపఁగానేగితో
విరులంగోయఁగఁబోయితోసరగునన్విచ్చేయఁగారాదెనా
పరితాపంబిటుమాన్పిప్రోచుటకునైపాటించిపద్మాననా. ౩౪౮.

ఉ. నీనగుమోమునీకనులునీతళుకుస్మితినీనడల్హొయ
ల్నీనవమోహనాకృతియునీయెలప్రాయమునీవిలాసము
న్నీనునుమేనికాంతియునునీమృదుకోమలపాణియుగ్మమిం
కేనొకనాఁటికింగనఁగనెట్లుఘటించునొకోతలోదరీ. ౩౪౯.

చ. అనియనిచింతచేఁబొగలుహాయనితాఁగడువెచ్చనూర్చుచు
న్గనుఁగవబాష్పతోయములుగాలువలైచనుదేరనేడ్చుచై
లనువునఁగాఁగలింపఁజనునంతటసద్దెసలారయున్మహీ
తనయనుజీరుచున్మిగులఁదాపమునొందునుమాటిమాటికిన్. ౩౫౦.

వ. ఇట్లు రాఘవుండు దుర్భరం బగుదుఃఖార్ణవంబున మునుంగుచు దరి
గానమికి న్దమకించుచు నాత్మగతంబున. ౩౫౧.

గీ. దనుజుఁడెవ్వఁడేనిఁదలకొనిమ్రింగెనో
పొసఁగవనమృగములుమెసవెనొక్కొ
కాకయున్నసీతగన్పడకుండునే
బిసరుహాక్షిఁబాసిబేలనైతి. ౩౫౨.

ఉ. ఏనిఁక నే మొనర్తుజలజేక్షణ నెయ్యెడఁ గాంతు నా మదిం
బూనిన దుఃఖ మెప్పగిదిఁ బోవఁగఁ జూతు వనాంతరంబున
న్మానినిఁ బాసి యొంటి నెటు మాని క్రియం జరియింతు దైవమా
హా నను దీనమానవుని యాకృతిఁ జేయఁగ నోర్చె నక్కటా. ౩౫౩.

వ. అని యనేక దీనాలాపంబులం బ్రలాపించుచు రాఘవుండు లక్ష్మణున
కి ట్లనియె. ౩౫౪.

చ. జనకజఁ గోలుపోయి వనసంచరణం బొనరించి వీటికిం
జనజననుల్ సహోదరులు జానకి పోబడి వేఁడ నేమి ప
ల్కనగును సిగ్గుగాదె యది గాక విదేహధరాధినాథుఁడౌ
జనకుఁడు గాన వచ్చిన విచారము చే నెటు కాంతు లక్ష్మణా. ౩౫౫.

ఉ. మానిని దుఃఖదావశిఖిమగ్నత దేహముఁ బాసి యూర్ధ్వగుం
డైన నునన్ను నా దశరథాధిపుఁ డాత్మజుఁ డంచు నెంచు నే
పూనికఁ దీర్పఁడా మెనని బుద్ధి నిరోయును గాక యింకని
క్కానన మందు నెవ్వగలఁ గందుదుఁ గుందుదు నేమి సేయుదున్. ౩౫౬.

వ. అని యి ట్లపారదుఃఖసాగరనిమగ్నుం డై వగచుచున్న రాఘవుం
గాంచి యత్యంతచింతాకులితస్వాంతుం డగుచు లక్ష్మణుం డి ట్లనియె.

గీ. కటకటా నిన్ను నీవె యెఱుఁగంగ లేక
యిట్లు శోకింపఁదగునె యిం దెల్లదిశల
నెమకి కన లేని చో విధిప్రముఖసురుల
ధిక్కరించి ధరాసుతఁ దెలియ రాదె. ౩౫౭.

గీ. అనుచు లక్ష్మణుండు సగ్రజు బోధింపఁ
దెలిసి రాఘవుండు ధృతి వహించి
పర్ణశాల డించి పైనమై జనకజ
నరయఁ ద్రోణిఁ గేదరులఁ జఱులఁ గిరుల. ౩౫౮.

సీ. యతులార ఘనమౌనిసతులార ముగుద చెం
    చెతలార కానరే క్షితిజ నిపుడు
లతలార కుసుమసంతతులార కోయిల
    జతలార కానరే ఝషసమాక్షి
నళులార పల్లవావళులార ఘనమృగా
    వళులార కానరే వనజముఖిని
నదులార కొదమతుమ్మెదలార విరజాజి
    పొదలార కానరే సదమలాంగి
హంసతతులార కానరే హంసయాన
    నజగరములార కానరే యమలచరిత
సీతఱిని సీవనంబున సీతజాడ
    దెలిసియున్న నునాతోడఁ బలుకవలదె. ౩౬౦.

చ. పదములముద్దుటందియలు బాగుగ మ్రోయఁగఁ గంకణావళు
ల్గదలఁగ రత్నహారములు గబ్బిచనుంగవపై నటింపఁగాఁ
బదపడి క్రొవ్విరుల్గొనుచు బంగరుబొమ్మ తెఱంగుగాఁ గనిం
పొదవఁ జరించు సీత నిపుడో వనదేవతలార కానరే. ౩౬౧.

వ. అని యత్యంతదురంతచింతాభరంబునం బొగిలి మిగుల వగచుచు విరులపొదలం దిరుగుచుఁ బృథ్వీజంబు లెక్కుచు నదులం దాఁటుచు నగంబులం బ్రాఁకుచుఁ జఱులం దూఱుచుఁ గోనలకుం బరువిడుచు మృగంబుల నరయుచు భద్రేభంబులం దఱుముచుఁ గాంతారంబున నెల్లెడలం గ్రుమ్మరుచుం జని చని యొక్కచోట మిక్కుటం బగు రుధిరపూరితవసుధాతలంబునందు నిహితశరశరాసనంబులును డుల్లిన మణికిరీటంబులును రాలినభూషణంబులునుం గని యచ్చెరు వందుచుం దత్సమీపమునఁ బక్షంబులు పదంబులు దెగి మహాపర్వతంబు

కరణి ధరణిం బడియున్న పక్షీంద్రునిం గని రాఘవుం డౌర్వశిఖియుం
బోలె వెలుంగుచు లక్ష్మణున కిట్లనియె. ౩౬౨.

క. రక్కసుఁ డెవ్వఁడొ సీతం
గక్కసమునద్రుంగిపక్షిగతిని-చ్చోటం
జిక్కినవాఁడిపుడతివం
గ్రక్కించెదఁ దెమ్ము విల్లు కడువడి నన్ఘా. ౩౬౩.

వ. అని రాఘవుం డార్భటించుచు లక్ష్మణుని చేవి ల్లందికొనుటయు
నెఱింగి జటాయువు గద్గదకంఠుండై యిట్లనియె. ౩౬౪.

గీ. అయ్య దశరథసఖుఁడ జటాయువనెడు
పక్షికులజుఁడ నిపుడు నాపక్షములను
బదములుఁ దెగియు మీరాక నెదఁ దలంచి
ప్రాణములఁ బట్టియున్నాఁడఁ బ్రజ్ఞతోడ. ౩౬౫.

వ అనిన రాఘవుండు చేరం జని జటాయువుం గాంచి వగచుచు నిజ
కరంబున నతని మేను దడవుచు నిట్లనియె. ౩౬౬.

గీ. పతగకులనాథ నిన్నిట్లు పటురయమున
ధరనడంచినవాఁ డెవ్వఁ డెఱుఁగఁ బల్కు
వానినిర్జింతు నీకుఁగా నేనటన్న
వినిజటాయువు రామునకనియె నపుడు. ౩౬౭.

క. రావణుఁడనుదనుజుఁడు సీ
దేవిం గొనిపోవుటయును దెలిసి మహాక్రో
పావిర్భూతుఁడనైచని
యీ వీరునిఁ దాఁకినాఁడ నతిరభసమునన్. ౩౬౮.

క. వాఁడస్త్రశస్త్రనిపుణుం
డోడక ఖడ్గంబుతోడ నురుతరశక్తిం

బోఁడిమిచెడనాపక్షము
లూడిపడన్నపక్షిత్రోసెనుర్వీస్థలిపై. ౩౧౯.

గీ. కానసీదుపాదకమలసందర్శన
మునకుఁగాఁగఁబ్రాణములనునిల్పి
తింతతడవునింకనేగెదదివమున
కనిజటాయువటుగతాయువయ్యె. ౩౨౦.

వ. అనిన రాఘవుం డంతరంగంబున నంతంతం గుబులుకొను శోకంబున వగచుచు ననుజుండునుం దానును జటాయువున కగ్నిసంస్కారంబొనర్చి మంత్రోదకంబు లొసంగి యవ్వలం జని జనకతనూజాతను రావణుండు గొని చనుట జటాయువువలన నెఱింగియుండుటం జేసి యన్నీచునిలయంబు దెలియం గోరి వనంబునం గ్రుమ్మరుచున్న యెడ.

గీ. యోజనోన్నతముగనురుబాహుయుగ్మంబు
గలిగిసకలజంతుగణమునెల్లఁ
దివిచిమ్రింగుచునుబ్రదీప్తమధాంధుఁడై
పరఁగుచుండునాకబంధుఁగాంచి. ౩౨౧.

క. అచ్చెరువొందుచునృపసుతు
లచ్చేరువకరిగిబాహులలవడనొకటం
జెచ్చెరఁదునిమితదంగముఁ
జిచ్చునదరిక్రోల్పుటయునిశిచరుండంతన్. ౩౨౩.

గీ. దివ్యతనువుఁదాల్చిదివినుండిశ్రీరాముఁ
బ్రకటమహిమఁబొగడిపఙ్క్తికంఠు
తెఱఁగుదెల్పిశబరిఁదెలియుమార్గముఁజూపి
చనియెనిజనివాసమునకునపుడు. ౩౨౪.

గీ. ఆశబంధుఁడునిమినాశబంధువైనర్చి
పనిచిదాశరథులుసన్నిరయమునఁ
బుణ్యభూరుహములఁబొలుపొందుశబరియా
శ్రమముచెంతఁజేరుసమయమునను. ౩౭౫.

క. ఎదురుచనితోడ్కొనియరిగి
పదపంకజములకుమ్రొక్కిఫలజలములునిం
పొదవనొసంగిశబరియా
సదయాత్మునిరామచంద్రుసన్నుతిచేసెన్. ౩౭౬.

ఉ. అంతటరాఘవుండలరియమ్మునిభామినిసేయుపూజలన్
సంతసమందియచ్చటనుసమ్మతిచేనివసించినాఁటిరే
యంతయుసీతఁజేర్కొనుచుహాయనితూలుచుమాటిమాటికిం
జింతిలుచుండెనెవ్వగలుసెందఁగలక్ష్మణుఁడూఱడింపఁగాన్. ౩౭౭.

వ. అమ్మఱునాఁటిప్రభాతంబున నిత్యకర్మానుష్ఠానంబుల నెరవేర్చి శుచిర్భూత యై యేతెంచి రామచంద్రుచరణారవిందంబులకు వందనం బొనర్చి శబరి యిట్లనియె. ౩౭౮.

గీ. దశరథాత్మజభవదీయదర్శనమున
కెదురుచూచుచువసియించితింతవట్టు
భవ్యమగుతావకాంఘ్రిప్రభావమునను
దివ్యపథమునకరిగెదదిశలువెలుఁగ. ౩౭౯.

ఉ. మాయలఁబన్నిరావణుఁడుమానినిసీతనుగొంచులంకకుం
దోయధిదాఁటివేచనిమెఁదోడనెయయ్యెడకేగివానినిన్
సాయకవృష్టిచేఁగెడపిసాధ్వినిఁగూడియయోధ్యఁజేరిభూ
నాయకతన్ వెలుంగుముమనంబునసాధుజనంబుమెచ్చఁగాన్. ౩౮౦.

గీ. రాజవర్యులెపుడు రణమునకై పూని
    చనఁగ నెంటిఁ బోవఁ జనదు గాన
నిందుకొక యుపాయమే నెఱింగించెద
    వినుము రఘుకులేశ వివరముగను. ౩౮౧.

క. ఇనతనయుఁడు సుగ్రీవుం
    డను వానరనాయకుండహాశ్యోత్తమమై
కనుపట్టు ఋశ్యమూకా
    ద్రిని వెలయుచున్నవాఁడు ధీరతతోడన్. ౩౮౨.

గీ. అచటి కేగి మీరలతని సుస్నేహంబు
    గాఁచి తత్సహాయగరిమఁ జేసి
రావణుని వధించి రమణీలలామ యౌ
    సీతఁ గొనుఁడు చనుఁడు శీఘ్రముగను. ౩౮౩.

క. అని పల్కి రాము సత్పద
    వనజంబుల మదిని నిల్పి వలగొని భక్తిం
జని శబరి రాఘవార్పణ
    మని యనలముఁ జొచ్చి స్వర్గమయ్యెడఁ జెందెన్. ౩౮౪.

చ. అనలముఖంబునన్న బరి యద్భుతదివ్యపథంబు నొందుటం
గని చని రామలక్ష్మణులు గాంచనశైలసమానవైఖరిం
దనరెడు ఋశ్యమూకవసుధాధరముం బొడఁగాంచి చేరువ
న్వనరుహమ్ముల్మరాళములు వర్ధిలఁ బెంపగు పంపఁ డాయుచున్. ౩౮౫.

వ. ఆ మ్మహాసరోవరంబునఁ గృతస్నానులై తత్తీరంబునం దందంద కుంద
చందనమందారమాకందపనసఖర్జూరజంబీరబదరీకపిత్థచూతాది నా
నావిధక్షోణీజంబులును, శుకపికశారికామయూరపారావతపరభృత
ప్రముఖసకలపక్షిసంకులకోలాహలారావంబులును, నిఖిలమునిజన

సంచారోపయుక్తప్రదేశంబులుం గలిగి యొప్పుటం గాంచి యం దొక్క విశాలశాఖోపశాఖాయుతంబైన రసాలావనీజంబుచెంత రామభద్రుండు పర్ణశయ్యాతలంబున సౌమిత్రిపాదంబు లొత్తుచుండం బవ్వళించి పుష్పగంధవహాదిదివ్యశకునంబులం గని లక్ష్మణున కిట్లనియె. ౩౮౬.

క. అదె కనుములక్ష్మణా మన
కెదుటన్శుభసూచకంబులెంతే మదికిం
బొదవంగ దోంచెడునింకం
గొదవ ల్లానోడు నెల్లకోర్కులుగూడున్. ౩౮౭.

గీ. రవితనూజుఁడిటకు రానోపునతనిను
స్నేహమునను జేసి శీఘ్రముగను
దశశిరములవానిదండించి జనకజఁ
గొందునిందు కేమిసందియంబు. ౩౮౮.

వ. అని పలుకుచు సంతసించె నంత రామసౌమిత్రులు సుగ్రీవాగమనంబు గోరుచుఁ బంపాసరోవరప్రాంతంబున విశ్రమించి యుండిరపుడు. ౩౮౯.

క. వినతాసుతాధిరోహిత
వినతామరబృందకాద్రవేయాధిపత
ల్పనతార్తిహరణనిఖిలభు
వనపాలననిపుణనిగమవందితచరణా. ౩౯౦.

భుజంగప్రయాతము. సరోజాతనేత్రాలసద్దివ్యగాత్రా
సురారాతినాశావిశుద్ధప్రకాశా
ధరాభారహంతానతక్లేశశాంతా
పరబ్రహ్మరూపాప్రపంచప్రదీపా. ౩౯౧.

గద్యము. ఇది శ్రీమదుత్తరరంగనాథకరుణాకటాక్ష వీక్షాసమాగత సరస
కవితావైదుషీప్రవీణ పరమవైష్ణవకులకలశజలనిధిసుధాకర రామా
నుజదేశికగర్భశుక్తిముక్తాఫలాయమాన శృంగారసారసంగ్రహాభిఖ్య
లక్షణగ్రంథనిర్మాణధురీణ ప్రహ్లాదచరితయక్షగానవిధాననిధాన గాన
విద్యానూన పాండితీస్థాన రంగయాభిధాన ప్రణీతంబైన శ్రీమద్రామో
దయం బనుమహాపురాణంబునం దారణ్యకాండం బన్నది తృతీయా
శ్వాసము.

---

# కిష్కింధాకాండము.

క. శ్రీసనకసనందనముఖ
భాసురమునిబృందవినుతపావనచరితా
దాసజనహృత్సరోజని
వాసోత్తరరంగసీలవారిధరాంగా. ౧.

వ. అవధరింపుము. ౨.

క. పంపాతటమునరఘువరుఁ
డింపొందన్విశ్రమించియెల్లదిశలుభా
వింపుచునవ్వనమునఁగల
సంపదలంజూపిపలికెసౌమిత్రికిన్. ౩.

క. కనుఁగొనుములక్ష్మణాయీ
ఘనసరసీతీరమునఁగలవింతలనే
మనఁదగునెచ్చటనేనిం
గనియెఱుఁగముగాదెయిట్టికాంతారంబుల్. ౪.

సీ. ఇదివనస్థలియనియెంచిచూడఁగరాదు
ఝషకేతనాయుధశాలగాని
యివిమావిచివురనియేర్పరింపఁగరాదు
కామునివాఁడిఖడ్గములుగాని
పరికింపనివిపుష్పపఙ్క్తులనఁగరాదు
కందర్పబాణసంఘములుగాని
మోదించియివిభృంగనాదంబులనరాదు
రతిపతిచాపటంకృతులుగాని

యిందునను బోటికామినీహీనునున్కి
 రొప్పు దెప్పుడుఁదలపోయను గ్రమైన
కంతుశరవహ్ని యంతంతఁగ దిసినాదు
 విరహతాపాగ్నితోఁ గూడి వెలుఁగునకట. ౫.

సీ. ఈసరసినిబద్మ మేఁ బొడగాంచిన
 ట్లెలనాగముఖపద్మ మెపుడు కాంతు
నీశుకంబులపల్కు లేనాలకించిన
 ట్లిభయానమృదుమాట లెపుడు వింకు
నీయళులిటఁ దేనె లెసఁగంగఁ గ్రోలిన
 ట్లింతియధరమాన నెపుడు పొసఁగు
నీజలపక్షులీయెడఁ జేరియుండున
 ట్లింపొందసతిఁ గూడ నెపుడు కల్గు
నేల యూరిత్తతలపోఁత లెన్నఁ డేని
 నామనోహారినింక స్వప్నమున నైనఁ
గానన గునంచు నెంచుట కల్ల గాదె
 మహి నినను బోలినట్టి పామరుఁడు గలఁడె. ౬.

గీ. సతివియోగాగ్ని చే మేను సమసిసమసి
 ప్రాణములు నిల్వ నోప దెబ్బంగి నైన
వినుము సౌమిత్రి నా యాస విడిచి పురికిఁ
 జనుము నీ వింక నేల వేసటల నొంద. ౭.

వ. అని యపారదుఃఖార్ణవమగ్నుండై పల్కుచున్న యగ్రజు నాలోకించి యత్యంతవిషాదంబు నొంది లక్ష్మణుం డిట్లనియె. ౮.

క. సర్వజ్ఞుండవు నిఖిలను
 పర్వాణశరణ్యుఁడవు ప్రభావయుతుఁడవో

సర్వజగదీశ్వరుఁడవయి
నిర్వాస్యునిభంగినిట్లునీతిరొమవగవక. ౯.

ఉ. నీవుశరాసనంబుగొనినిల్చినఁగాంచనగర్భముఖ్యదే
వావళిసంచలించుఁగమలాప్తుఁడుదిగ్భ్రమనొందుదిక్కరుల్
తావులుదప్పువాసుకిపడంకుజగంబులుదల్లడిల్లునో
దేవపరాక్రమింపకిటుదీనతనొందఁగనీకుఁజెల్లునే. ౧౦.

క. సుగ్రీవుఁడిందురాఁగలఁ
డాగ్రహమునసరిగిరావణాదిఖలులన
త్యుగ్రాస్త్రశస్త్రములచే
నిగ్రహమొనరించికామినింజేకొనుమా. ౧౧.

వ. అని లక్ష్మణుండు ప్రబోధించుటయును రాఘవుండు ధైర్యం బవలంబించి యుండె నంత. ౧౨.

సీ. అయ్యెడఋశ్యమూకాద్రిపైసుగ్రీవుఁ
డనువానరాధీశుఁడాప్తమంత్రి
వరచతుష్టయముతోవర్తించుచుండియుఁ
బంపాసరోవరప్రాంతమునను
రవిసుధాంశులభంగిరహిమించిదేదీప్య
మానులౌరామలక్ష్మణులఁగాంచి
మదిఁదల్లడంబందిపెదవులుదడుపుచు
నడలుచుసచివులకనియెఁజూపి
వీరనసుఁగ్రుంపఁబ్రచ్ఛన్నవేషులగుచు
వాలిపనుపుననిటకురాఁబోలుఁగాని
కాకయున్నజటాభారకలితులైన
సన్మునులకేలశరశరాసనములరయ. ౧౩.

క. పగవాని కెదుట మెలఁగఁగఁ
దగదే వేళలకు నేమిదలఁకొను నాకో
మిగులభయంబాదవెడునే
గఁగఁదగునెం దేనిమనసుకుఁగడు వేగమునన్. ౧౪.

వ. అని యమోఘభయభ్రాంతుండై గడగడ వడంకుచుఁ దత్తఱం
బందుచున్న సుగ్రీవుం గని యాంజనేయుం డిట్లనియె. ౧౫.

క. సారవివేకవిచారులు
గారణపూరుషులుగానికపటులుగారి
ట్లీరూపంబునవచ్చిరో
వీరలఁజొప్పెఱుఁగకింత వెఱవఁగనేలా. ౧౬.

వ. అనిన సుగ్రీవుండు హనుమంతున కిట్లనియె. ౧౭.

క. మరుదాత్మజ వేగనరిగి
సరగునవారల తెఱంగుసకలంబు నెఱిం
గిరయమునవచ్చినాభయ
మరుగు తెరువుఁజూపుము దయనతిధృతిమీఱన్. ౧౮.

వ. అని పల్కి వాయునందను నీవడ్కొల్పి సుగ్రీవుం డచ్చోట నిల్వ
నోపక భయంబంది మంత్రులం గూడి మలయాచలంబునకుం
జనియె నంత. ౧౯.

ఆంజనేయులు శ్రీరాములసన్నిధికి వచ్చుట.

ఉ. మారుతితద్గిరిం డిగియెమర్కటరాజ్యమునందుభానుజుం
జేరుపజానకీతపముసిద్ధియొసర్పద శాస్యశౌర్యల
క్ష్మీరమణీరఘూద్వహునిచేనొసఁగంగనటంచుసర్వబృం
దారకులంబరంబునసుధామధురోక్తులఁబల్కుచుండఁగాన్. ౨౦.

వ. ఇట్లాంజనేయుం డగ్గిరీంద్రంబు డిగ్గి మధురసభరితం బగుఫలంబుఁ గేలం బూని మహావినయవిధేయత్వం బవలంబించి రామలక్ష్మణుల డగ్గఱి. ౨౧.

గీ. కొమ్ము సీతాశిరోరత్నమిమ్ము గాన
టంచు నిబ్భంగి నే నిత్తునన్న నూడ్కి-
ఫలముఁ శ్రీరాము కోర్కి సఫలముగాఁగ
నొసఁగి వలగొని మ్రొక్కి యింపెసఁగఁ బలికె. ౨౨.

చ. హరిహరులో నిభాకరసుధాంశులొ కాకనృపాత్మజన్ములో
పరమతపోధనాకృతుల భాసిలి బాణశరాసనంబులం
గరములఁ బూని యేకతమ కాననభూమిఁ జరింప నేల మీ
రిరవుగ నన్నియు న్దెలుపుఁడే విననర్హుఁడ నేని సత్కృపన్. ౨౩.

వ. అని యాంజనేయుండు మృదుమధురధారాసేచితంబు లగుశబ్దంబుల సంభాషించుట విని తన్మూర్తివర్తనంబులు నిరీక్షించి యత్యంత సంతుష్టుండై రాఘవుం డవ్వాయుజుం జూపి లక్ష్మణున కిట్లనియె.

శా. కంటే లక్ష్మణ యిమ్మహామహుని యాకారంబుఁ దేజంబుము
క్కంటిం బోల్చెదుఁ గుండలంబులలసత్కాంతుల్ దిశల్నిండెనీ
బంటున్నా కొనఁగూడె నేని మది సంభావింపమత్కార్యమే
వెంటన్నుంతకొ యింతగల్గు నెశుభావిర్భూతి గాకుండునే. ౨౪.

గీ. సరసవచనరచనచాతుర్యలంకృత
శబ్దశాస్త్రనియతిశాలిగాఁగఁ
దోఁచుచున్న దితనితోఁ జాగరూకతఁ
దెలుపుమన తెఱంగు దేఁటపడఁగ. ౨౫.

వ. అని రాఘవుం డానతిచ్చుటయు లక్ష్మణుం డాంజనేయుం గని యిట్లనియె. ౨౬.

సీ. దశరథరాజనందనులమీయనఘుండు
రామచంద్రుండేనుఁ లక్ష్మణుండ
జనకునిపంపునఁజనుదెంచి కాంతార
భువిఁజరింపఁగను రాఘవుని దేవి
సీతనుమమ్ము వంచించి రావణుఁడను
దనుజుండుగొనిపోవ వెనుకఁదగిలి
వాని నిర్జింపంగ వరశక్తిఁగలిగియు
రాజులకొంటిఁబో రాముగాన
శబరివలనను సుగ్రీవుశౌర్యమహిమ
తెలిసి యాతనిసాహాయ్యమిచ్చఁగోరి
యిచటికరుదెంచినార మింకెఱుఁగఁబల్కు
మయ్యనీదు తెఱంగెల్ల నెయ్యమలర. ౨౮.

వ. అనిన హనుమంతుం డత్యంతపులకాంకితాంగుం డై యానంద బాష్పపూరితలోచనంబుల రామచంద్రుం గాంచి దండప్రణామం బాచరించి ముకుళితకరకమలుం డై యిట్లనియె. ౨౯.

క. ఇనసుతుఁడగుసుగ్రీవుం
డనువనచరనాయకునకునాప్తసచివుఁడ
న్నేనుమనిలతనూభవుఁడను
హనుమంతుండనెడువాఁడ నర్కకులేశా. ౩౦.

గీ. ప్లవగనాథుండుమిమ్మునీపంపకడను
గాంచికలవర్తనములసాంగంబుగాఁగఁ
దెలిసిరమ్మనవచ్చితిఁ దెగువఁబూని
కల్యముగనాదుజన్మసాఫల్యమయ్యె. ౩౧.

చ. మునుకమలాసనుండునను మోదముతోఁ గనిపల్కె నిట్లు నీ
ఘనమణికుండలంబులను గన్గొనునాఁడె దేవదేవుఁడ
వ్వననిధికన్యకావిభుఁడవారితసత్త్వుఁడు వానిఁ గొల్వు పొ
మ్మనెనది గాననాఁడు మది నారయుచుండితి నింత కాలమున్. 3౨.

క. నాపుణ్యఫలంబులమీ
శ్రీపాదంబులను గొలువఁ జేకూరెను నే
నీపట్ల ధన్యుఁడనయితిఁ
దాపసమందారయొండు దలఁపనికేలా. 33.

క. మతిమంతుఁడధిక శౌర్యస
హితుఁడగు సుగ్రీవుసఖ్య మిపుడొనఁగూర్తున్
క్షితిమీకెవరుసమానులు
కుతలేశ్వరశత్రుజయము గొబ్బునఁ గొనుమా. 3౪.

వ. అని విన్నవించి హనుమంతుఁడు రామభద్రు వీడ్కొని మలయాచలంబున కరిగి మహాభయభ్రాంతచేతస్కుండైయున్న సుగ్రీవుం గాంచి యిట్లనియె. 3౫.

గీ. సీతపఃఫలంబు నేఁటికి సిద్ధించెఁ
గోర్కెలెల్లఁ బండెఁ గొదవలేక
నీవు వెఱవనేల నీశోకవనధికి
దేవ రాముఁడనెడి నావ దొఱకె. 3౬.

చ. ఇనకులధుర్యులౌ దశరథేశ్వరసూనులు రామలక్ష్మణు
ల్వనమునఁ దాపసాకృతుల వర్తిల నయ్యెడ రాముభార్య సీ
తను దగ వేదిరావణుఁడు దాఁగొనిపోవుడు వానిఁ ద్రుంపఁగాఁ
జనుచును నీదుసాయమును సఖ్యము వేఁడఁగ వచ్చిరిచ్చటన్. 3౭.

క. కావునరామునిచేసీ
వావాలినిఁద్రుంపఁజేసియగచరరాజ్య
శ్రీవిభవమందఁగాఁదగు
నావినిసుగ్రీవుఁడలరినగధైర్యంబై. ౩౮.

గీ. ఆంజనేయునిఁగొనియాడియపుడెకదలి
వేగమునఋశ్యమూకాద్రికేగియటకుఁ
దోడితెమ్మనిపనిచినఁబోడిమిగను
వాయుజుఁడుసనియారఘువరులఁగాంచి. ౩౯.

గీ. దేవవిచ్చేయుఁడగచరాధిపునికడకు
నతఁడుమీరాకకైమదినలరుచుండు
ననినసమ్మదితాత్ములైయర్కకులజు
లాంజనేయునివెనువెంటనరిగిరపుడు. ౪౦.

వ. ఇట్లు రామలక్ష్మణు లయ్యగచరోత్తమువెంబడిఁ జని ఋశ్యమూకా
చలారోహణం బొనర్చునెడ సుగ్రీవుం డెదుర్కొని మహావినయ
సంభ్రమంబులతోడ సాష్టాంగనమస్కారం బొనర్చి యంజలిబద్ధుం
డై నిలువంబడిన నాలింగనంబు గావించి రామచంద్రుం డిట్లనియె.

గీ. తరుచరోత్తమనీదువర్తనములెల్ల
మున్నెవినియున్నవాఁడనీయన్నయైన
వాలినవలీలఁగూల్తుభావముననెందు
దలఁపవలదూఱడిల్లుముధైర్యమునను. ౪౨.

వ. అనినఁ బరితోషితహృదయుం డగుచు నుప్పొంగి సుగ్రీవుం డి
ట్లనియె. ౪౩.

క. భూవరనీమదిలోనిఁక
నేవెంటన్వగవనేలనెంతేబలిమిఁ

రావణునిఁ ద్రుంచిసీతా
  దేవింగైకొనుము వేగధీరవిచారా. ౪౪.

వ. అని యొండొరులు సంభాషింపుచు నచ్చో నసలుం బ్రతిష్ఠించి తత్సన్నిధిం బాస లిడికొని యిష్టగోష్ఠి నున్నయెడ మున్ను జానకి వైచి చనినతొడవులం దెప్పించి రామభద్రుముందట నిడి సుగ్రీవుం డి ట్లనియె. ౪౫.

చ. దనుజునిచేతఁజిక్కి బెడిదంబగుశోకముతోడనంబరం
బునఁజనుచోమముంగనుచుబోరున నేడ్చుచుఁజీరకొంగున
న్జనకజసొమ్ములన్ముడిచిచయ్యన వైచినదాఁచఁబంచితిం
గనుఁగొనుమంచుఁబల్కుటయుఁగన్నులఁదోయముగ్రమ్మరాముఁడుౙ.

క. ముడివిడిచికాంచిహాయని
  పుడమింబడిమూర్ఛనొందిపొరలుచుదుఃఖం
బడరఁగనేడ్చుచునపుడా
  తొడవులుగైకొనియనుజునితోనిట్లనియెౙ. ౪౭.

గీ. నాదుపదములనుదినంబునుబన్నిటఁ
  గడిగియొత్తుచెఱఁగునడవికంట
కములకోసఁగిసీతకడుదుఃఖమందుచు
  నెచటనుండునొక్కొ యెఱుఁగమకట. ౫౮.

గీ. తొడవులడవియందుఁదడవక వైచియా
  పడఁతిప్రాణములనువిడిచెనేమొ
యింక నెచటఁగందు నెట్లొంటినేనుండుఁ
  దనువుఁబాసిపోదుఁదరుణినరయ. ౪౯.

క. అనిపెనుశోకారావం
  బొనరింపుచువగచుచున్న యుర్వీశునఁగ

గ్గైనిలక్ష్మణుండుదనమన
    మునవడలుచుదుఃఖజలధిమున్గుచునుండె. ౫౦.

వ. అంత సుగ్రీవుం డత్యంతమధురాలాపంబుల ననునయించుచు రామ
భద్రున కిట్లనియె. ౫౧.

గీ. సకలలోకములనుసన్నుతిఁగాంచునీ
    వితరుభంగినింతవెతలునొంద
నగునెధృతివహించియతిశౌర్యమంకించి
    దనుజాఁద్రుంపఁదలఁపుమనఘచరిత. ౫౨.

క. అనుచుఁబ్రబోధింపఁగన
    మ్మనుకులజాఁడుదిటవుబెంచిమర్కటపతితో
ననిమెన్నుచునీపగతునిఁ
    దునిమెదఁబిదపన్మరింతుకురమునసుర౯. ౫౩.

గీ. తెలియఁబలుకుముసుగ్రీవధీరుఁడవయి
    వాలికినినీకుఁగల్గినవైరమెల్ల
వినఁగఁగోరెదనిపుడుసవిస్తరముగ
    ననినఁదెల్పఁదొణంగెనయ్యర్కసుతుఁడు. ౫౪.

సీ. వాలియద్భుతశౌర్యశాలియైకపిరాజ్య
    భరముననుతికెక్కపరఁగుచుండ
మాయావియనుదైత్యనాయకుండరుదెంచి
    యనికిరమ్మనిపిల్వనాగ్రహించి
నాతోడఁగూడిదానవునిపైఁగదియుడు
    వెఱచివాఁడురుగుహానరసిచొరఁగ
నన్నువాఁకిటనిల్పిక్రన్ననలోఁజొచ్చి
    యొకవత్సరముపోరెనుడిగిచనక

యంతరుధిరప్రవాహంబువింతఁదోఁప
    నగ్రజుఁడువినిహతుఁడయ్యెననుచుమిగుల
వగచితద్ద్వారముఁనఘననగము వైచి
    యతనికిఁదిలోదకాదులనచటఁదీర్చి. ౫౫.

క. సరగునఁగిష్కింధాపురి
    కరుదేరంగాంచిమంత్రులర్థ్మిఁడననుచుం
దరుచరరాజ్యంబొసఁగిన
    గురుతరముగనేలుచుంటిఁగొన్నిదినంబుల్. ౫౬.

వ. అంత యయ్యసురం బరిమార్చి తద్గుహాద్వారంబున నున్ననగంబుఁ జూర్ణంబుగాఁ దన్ని వెడలి వచ్చి యచ్చో నన్నుం గానమి కత్యంత క్రోధావేశంబు నొంది కిష్కింధ కేతెంచి రాజ్యాభిషిక్తుండనైయున్న నన్నుం గాంచి యాజ్యాహుతి న్మండువైశ్వానరుభంగి వెలుంగుచు ననుసంహరింపం గమకించుటయు నేనయ్యగ్రజుపాదంబులకుఁ బ్రణామంబు లాచరించి కలతెఱం గెఱింగించిన నంగీకరింపక నా పత్ని యగు రుమాసతిం జేకొని నన్నుం దఱుము చుం బఱతేర వెఱచి పఱవిడి చతుస్సాగరాంతం బగుభూమండలంబెల్లఁ దిరిగి యి న్నగంబు వాలికెక్కరామిం దెలిసి యిచ్చట నివసించి యున్నవాఁడ ననిన విని రామభద్రుం డిట్లనియె. ౫౭.

గీ. అనఘవాలికిమ్మహాద్రి నెక్కఁగరామి
    కేమికారణంబొయెఱుఁగఁబల్కు
మనినరవిసుతుండుమనమునహర్షించి
    తెలుపఁదొణఁగెనపుడుతేఁటపడఁగ. ౫౮.

సీ. రామదుందుభియనురక్కసుండుమదంబు
    పెంపునమహిషమై పెరిఁగిజలధి

తోరణంబొనరింపఁదొడరుటయునుసరి
    తృతిభీతిఁజెందుచుఁబలికెనిట్లు
వాలిపరాక్రమశాలినీతోఁబోరు
    నరుగుమచ్చటికననసురుఁడపుడు
కిష్కింధకేతేరఁగీశాధినాథుండు
    ప్రళయాంతకునిభంగిఁబ్రజ్వరిల్లి
దిశలుఘూర్ణిల్లనార్చుచుఁదీవ్రముగను
    వానిపైఁజనిమిగులంగవాఁడిమెఱయఁ
గలహమొనరించితునుమాడికాలఁజిమ్మి
    యోజనముదూరమునవైచెనురుజవమున. ౫౯.

గీ. అయ్యసురరక్తమీయద్రియందుఁబడిన
    కతముననుజేసివాలికెక్కంగరాక
శాపమొసఁగెమతంగుండుకోపమునను
    గాననిర్భయముననుందుఁగదలకిందు. ౬౦.

క. శూలధరాదులువొగడఁగ
    లీలన్దుందుభినినునిమిలెక్కింపకోడ
ల్గాలనెగఁజిమ్ముటకునా
    వాలికిఁదగుఁగాకనొరులవశమేతలఁపఁగ. ౬౧.

గీ. ఆకళేబరంబునంతకన్ననుదూర
    మరుగఁజిమ్మితేనినధిపనీవు
వాలినణఁతువనుచుఁజాలనమ్ముదునన
    వినిరఘూద్వహుండునినజుఁగాంచి. ౬౨.

వ. తత్కళేబరంబుఁ గాన్పింపు మనిన సుగ్రీవుండు రామలక్ష్మణులం దోడ్కొని చని మేరుమందరంబులభాతిఁ గానంబడు దుందుభిశరీ

రంబుఁ జూపుటయు రాఘవుండు నిజపదాంగుష్ఠంబున దశయోజనం
బులం బడం జిమ్మిన నవ్వానరాధీశుం డిట్లనియె. ౬౩.

గీ. వాలిమీటునాఁడుచాలనిక్కాయంబు
పలలరక్తములనుబలిసియుండు
నిప్పుడస్థిమాత్రమింతయేకావున
సందియంబువదలదిందువలన. ౬౪.

వ. అదియునుంగాక. ౬౫.

గీ. సప్తతాళములుప్రశస్తంబులైయుండు
నదియునొకటిగాఁగనదిమివాలి
కోరిపత్రములనుగోయునందొకటైనఁ
గదలఁజేయలేరుత్రిదశవరులు. ౬౬.

వ. అమ్మహీరుహసప్తకం బొక్కశరంబునం బడనేయుబలియునిచే వాలి నిహతుం డగు నని యున్నగంబున వసియించుమతంగమునీంద్రుండు నాతోడ నెఱిఁగించెఁ గావున నట్లొనర్చి నన్ను నిస్సందేహునిం జేయు మని ప్రార్థించు చున్నసుగ్రీవుం గని రామభద్రుం డుత్తరువుల నెఱింగింపు మనిన వానరేంద్రుం డమ్మనుజనాథులం దోడ్కొని చని కాన్పించుటయును. ౬౭.

గీ. లక్ష్మణునిచేతివిలుగొనిరామవిభుఁడు
గొనయమెక్కించిధృతిఁబెంచిఘోరమైన
యంబకముఁబూన్చిదశముఖునాండ్రత్రాళ్లఁ
ద్రెంచువిధమొప్పఁగాఁదాళ్లఁద్రుంచెనపుడు. ౬౮.

క. రామునిఘోరశరంబున
భూమిందెగిపడినతాళభూరుహచయమొం

తేమదినుప్పొంగఁగఁగని
యామనుజేంద్రునకు మ్రొక్కి యర్కజుఁడనియెన్. ౧౯.

ఉ. దేవమహానుభావభవదీయమహోగ్రశరాగ్నికీలలం
దేవగనైనవాలిహరియింపఁబడుంగపిరాజ్యలక్ష్మినే
నేవరియింతుమింతుధరణీస్థలిఁగీర్తివహింతునన్నునీ
భావమునందుసత్కృపనుబంటుగనేలఁగదయ్యరాఘవా. ౨౦.

వ. అనిన రామచంద్రుండు దరహసితవదనారవిందుం డగుచు నిట్లనియె.

గీ. కపివరేణ్యానీవుగడువేగకిష్కింధ
కరిగిధీరుఁడవయిదురమొనర్చు
చుండుమేనుబొంచియుగ్రశరంబున
వాలినవనిఁగూల్తువన్నెఁగాంతు. ౨౧.

క. అనవినిసుగ్రీవుండ
య్యనకులజులువెంటనడవనింపుదలిర్పం
దనసచివులతోఁగూడుక
చనియెంగిష్కింధకపుడుసరభసమొప్పన్. ౨౩.

వాలిసుగ్రీవుల యుద్ధము.

క. ఇటుచనిదాశరథులనొ
క్కటనిడిసుగ్రీవుఁడపుడుగర్జిల్లుచువాఁ
కిటనిలిచిరణమునకుఁజీ
రుటఁగనియావాలిప్రళయరుద్రుండగుచున్. ౨౪.

గీ. గజముపైనిబొలుకంఠీరవముభంగి
నాగ్రహమునవచ్చియనుజుఁగదియ
ఘోరతరముగాఁగఁబోరికిఁబూనిర
య్యిరువురుగ్రుగులగుచునేపుదోఁప. ౨౫.

క. నగమునగముఁ దాఁకిన క్రియ
మిగులన్ సమవిక్రమములమించుచునపుడ
య్యగచరులురణమొనర్చిరి
గగనంబుననిలిచిసురలుగణుతింపంగన్. ౨౬.

క. పొడుచుచునడుచుచుఁ బదముల
వడిఁదన్నుచుఁగరనఖములఁ బ్రచ్చుచుఁ బుడమిం
బడిపొరలుచొండొరులపై
నడరుచువిహరించిరంతనాహవకేళిన్. ౨౭.

వ. ఇవ్విధంబున వాలిసుగ్రీవులు సంగరంబుఁ జెల్లించుచుండం గని రామచంద్రుండు తన మనంబున. ౨౮.

ఉ. ముక్కులుఁ జెక్కులుంగనులు మోములుమూఁపులుదేహకాంతులుం
బక్కలుడొక్కలూరువులుబాహులుఁగాళ్లునువ్రేళ్లుఁగర్ణము
ల్పిక్కలువాలముల్దలలుభీషణభాషణముల్దలంచుచో
నొక్కతెఱంగుగాఁగనిటులొప్పెడుభానుజుఁడెవ్వఁడొకదా. ౨౯.

క. సరగునసితీక్ష్ణంబగు
శరమురముననాటిమొవరిసమయించునొకో
యరయక వ్రేయందగదని
పరికించుచునుండె రామభద్రుండంతన్. ౩౦.

మ. సురనాథాత్మజుఁడప్డుకోపమెసఁగన్సుగ్రీవునింబట్టివే
కరముష్టింబదతాడనంబులఁగడుంగాసిల్లఁగాఁజేయఁబె
ప్పరియైభానుజుఁడొడ్డిసెంపుడిగితాపంబందితప్పించుకం
దిరుగంజూచుచుఁబొఱఁదోఁకమెడపైఁద్రేలాడఁదెంపేదియున్. ౩౧.

వ. ఇట్లతివేగంబునం బాఱి ఋశ్యమూకంబున నొక్కచో మహాచింతా
కులితచిత్తుండై యుండె నంత రామలక్ష్మణు లరుదెంచుటయు ఖిన్న
త్వంబునం దల వాంచి సుగ్రీవుండు రాఘవున కిట్లనియె. ౮౨.

గీ. రామనీలావునమ్మినేరణమొనర్ప
వాలిపైఁబోవఁజెల్లునేవసధినీఁద
గడ్డపారనుగోనిచనునెడ్డెకరణిఁ
దెలియకిటువంటినగుపాటువెలకుఁగొంటి. ౮౩.

క. వాలిరణమునగెలువఁగ
శూలాయుధపాణికైనఁజొప్పడదననే
నీలాగుపోవుటొప్పునె
నీలావిట్లగుటఁదెలియనేరకయకటా. ౮౪.

గీ. భానుకులజులెల్లఁబల్కిబొంకరటంచు
నమ్మినాఁడనిన్ను నెమ్మనమునఁ
బగతుచేతనన్నుఁబట్టియొసంగుట
లెఱిఁగియున్ననింతయేలకలుగు. ౮౫.

వ. అని యత్యంతదురంతచింతాశ్రుపూరంబు లొలుకఁ బలుకుసుగ్రీ
వునిం గని రామభద్రుండు గరుణార్ద్రచిత్తుండై యిట్లనియె. ౮౬.

చ. ఇనసుతనీవువాలియునునేమియునేర్పడకొక్క రీతిగాఁ
గనులకుఁదోఁచుచున్నరముగాఁడఁగనేసిననెవ్వఁడీల్గునో
యనిభ్రమనొందినాఁడవినుమద్భుతమాగజపుష్పమాలికం
బనివడిఁదాల్చిపొమ్మనికిఁబాకవిరోధిసుతున్మారించెదన్. ౮౭.

క. అనిపల్కిలక్ష్మణునిచే
ఘనమగుగజపుష్పమాలికనుఘటియింపి

చినలినహితసుతుగళమున
మనమలరధరింపఁబంచెమనుకులుఁడంతన్. ౮౮.

గీ. అట్లుగజపుష్పమాలికకాత్మనలరి
గళమునను దాల్చి వేగ రాఘవుల వెంటఁ
జనుచుఁ గిష్కింధ చెంతవృక్షంబుపొంత
వారలనుడించి తాఁబోయె వాలికడకు. ౮౯.

క. ఇనతనయుఁడరిగివాలిం
దనతోఁ బని చేయఁ బిలువ దర్పోద్ధతుఁడై
ఘనరోషంబున నాతఁడు
దనమనివాసంబు వెడలుతఱి నడ్డంబై. ౯౦.

గీ. తారయిట్లనిపల్కె నీతోరణంబుఁ
జేయ భీతిల్లి పరువిడి సిగ్గుమాలి
మఱలు సుగ్రీవు రాక నెమ్మదిఁ దలంప
వినుమొక బలిష్ఠుసాహాయ్యమునను గాదె. ౯౧.

వ. అది యెట్లంటేని. ౯౨.

చ. దశరథరాజనందనులు దారగుణాఢ్యులు రామలక్ష్మణు
ల్విశదయశస్కులై విపినవీథిఁ జరింపఁగ రాముభార్య యా
శశిముఖ సీత నెత్తికొని చన్న నిశాచరనాథుఁడైన యా
దశముఖు పైకిఁ బోవుటకుఁ దామర సాప్తజుఁ దోడుఁ గోరియున్. ౯౩.

క. చను దెంచి బుశ్యమూకా
ద్రిని నున్నారనుచు వింటిఁ దెలియఁగ వారిం
దనకు సహాయముగాఁ గొని
యినజుం డరుదెంచెనిప్పుడింద్రతనూజా. ౯౪.

క. ఆరాఘవుండు శ్రీమ
న్నారాయణుఁడనితలంపునగచరనాథా
యీరీతిఁబోవవలదని
వారించినవినక వాలివనితకునని యెన్. ౯౫.

క. ఏమన్న దమ్ములముసం
గ్రామంబొనరించుచుండఁగాఁ బైఁబడుచు
న్నామదినధర్మమనకా
రాముఁడునన్నే లక్షుంచు రాజీవాక్షీ. ౯౬.

క. పగతునిపైఁబోవుతఱిం
దగదనిపల్కంగవలదుతలఁగుమటంచు
న్మిగులఁదనుఁగాలపాశము
తగనీడ్చినమఱలవెడ లెధైర్యము పేర్మిన్. ౯౭.

వ. ఇట్లు రోషభీషణాకారుం డై వెడలి వాలి సుగ్రీవునిం గాంచి దవా
నలంబుభంగిఁ బ్రజ్వరిల్లుచు నిట్లనియె. ౯౮.

గీ. ఓరినాతోడఁబోరాడనోడిపాఱి
మఱలివచ్చితేమగ వానిమాడ్కిఁగాఁగ
సిగ్గుమాలిననినుఁబట్టినుగ్గొనర్చి
పుత్తునిప్పుడు కాలునిప్రోలికనుచు. ౯౯.

క. పెనునగములుగొనివైవఁగ
నినజుఁడుభూరుహచయంబు లెంతేకడిమి
న్వనచరపతిపైఁబఱపుచు
ఘనరణమొనరించిరిట్లుకపివరులపుడున్. ౧౦౦.

ఉ. వాలిపరాక్రమంబునకు వారిజబాంధవసూనుఁడెంతయు
న్మేలిమిదక్కఁ గ్రుక్కదన మేననొకింతజవంబు లేమికిం

దూలుచునత్తైసల్లనుచుఁడొట్రువడన్నదిఁ బ్రేమదోఁపఁగాఁ
గేలశరాసనంబుఁగొనికీర్తిరతుండగు రాముఁడత్తఱిన్. ౧౦౧.

గీ. తనువుమాటునఁబొంచియుద్ధతివహించి
గొనయమెక్కించివాలిపైఁగోపగించి
యురమునను దృష్టిసారించియూహఁబెంచి
మించి ఘోరశరంబుసంధించిపఱపె. ౧౦౨.

గీ. ఇనుఁడుసుతునిక్గాఆకునింద్రాత్మజునిఁద్రుంపఁ
దలఁచిశరముగాఁగవెలసెననఁగ
నమ్మహాస్త్రిముకుతరాగ్నిప్రభలతోడ
వాలియురముగాఁడినేలఁద్రోసె. ౧౦౩.

క. శరమురముఁదూఱిధరనురు
గిరిక్రియఁబడియున్న యట్టికీశాధిపతిం
బరువిడిఁగానఁగ రాఘవుఁ
డరుదేరంగాంచిపల్కెనతఁడాగ్రహుఁడై. ౧౦౪.

సీ. అక్కట రామధర్మాత్ముఁడవైననీ
విట్టిపాపంబొడిఁగట్టనగునె
తపనుజుఁడేనన్న దమ్ములమేమేనిఁ
గలహింపననుఁద్రుంపఁగార్యమేమి
సీదేవిఁజెఱఁగొన్న నీచరావణునిందుఁ
దేలేనెనాతోడఁదెలిపియున్న
మనువంశమునఁబుట్టిమునివృత్తినుండియు
మానవైతివకృత్యమార్గములను
రాజవగుటకతమునవరణ్యమునను
వేఁటలాడంగఁదగుమృగవితతిఁబట్టి

భూతలాధీశ యీరీతి నీతిమాలి
క్రోఁతిమాంసముఁ దిననేలఁ గోరితయ్య. ౧౦౫.

గీ. నన్నుఁ దునుమువాఁడ వెన్న నాకనుమ్రోల
నిలిచియున్నఁ గాదె తెలియనౌను
తరువుమఱువుఁ జేరి శరమున వ్రేయంగఁ
దగునె యిదియు రాజధర్మమగునె. ౧౦౬.

వ. అనిన రాఘవుండు వాలి కిట్లనియె. ౧౦౭.

చ. అనుజుని భామినిం గవయునట్టి మహాకలుషాత్ముఁడైనని
న్ననిమినఁ బాపముంగలదె దోర్బలశక్తి మృగాళిఁ జంపుచో
వనమునఁ బొంచి వ్రేయుట లవశ్యముగావున నట్లొనర్చితిం
జని సురలోకసౌఖ్యపదసంభ్రమమందుము వానరోత్తమా. ౧౦౮.

వ. అని రామచంద్రుండు వల్కుటయు నంత నా వానరేంద్రుండు శరవేదన సహింపం జాలక సొమ్మసిల్లి మూర్ఛ నొంది కొంత తడవునకుఁ గ్రమ్మఱం దెలివొంది రాఘవుం డాదినారాయణస్వరూపంబు గా నెఱింగి తన మనంబున నప్పుడు. ౧౦౯.

గీ. అచటికరిగి కాంచునట్టి పరబ్రహ్మ
మిచటికేగుదెంచి యెదుటఁ దోఁచె
నందరాని పదవిఁ జెందితి నింక నా
భాగ్యమెన్నఁ దరమె బ్రహ్మకైన. ౧౧౦.

వ. అని యత్యంతవినయసంభ్రమంబులు రెట్టింప రామభద్రునిం గాంచి వాలి యిట్లనియె. ౧౧౧.

గీ. రఘుకులాంబుధిసోమ సంగ్రామభీమ
జలధరశ్యామ భక్తహృజ్జలజధామ

బహుగుణోద్దామతారకబ్రహ్మనామ
రాక్షసవిరామభువనాభిరామరామ. ౧౧౨.

గీ. నిగమగోచరనిఖిలేశనీరజాక్ష
దేవదేవుండవనినిన్నుఁదెలియలేక
కాఱులాడితిశమియింపుకరుణఁబెంపు
వేగరక్షింపుమీవేళవిహగగమన. ౧౧౩.

వ. అని విన్నవించి సుగ్రీవునిం జీరి యంగదుం బరిపాలించునది యని యాజ్ఞాపించి సురేంద్రదత్తం బైనపరబలాపహారి యను హేమమాలిక నొసంగి రామచంద్రుమృదుపదయుగళంబు నిజమానసాంభోజంబునం గీలుకొల్పి వాలి సుగతిం జెందె నంతఁ దద్వృత్తాంతంబు విని. ౧౧౪.

ఉ. తారమహారవంబెసఁగఁదావిలపించుచులోచనద్వయి
న్ధారలుగాఁగవారిజనితంబయికాఱఁగరత్నహారము
ల్సారెకుఁజిందులాడఁగరసారసముల్కుచపాళిమోదుచు
న్వారకవచ్చివేగమునవాలిపయింబడివెచ్చనూర్చుచున్. ౧౧౫.

గీ. బోరుబోరుననేడ్చుచుఁబుడమిఁబొరలి
హామనోహరనవమదనావతార
హావలీముఖకులధుర్యయమితశౌర్య
యొందుఁబోయితినన్నుఁబాసియెఱుఁగఁజెపుమ. ౧౧౬.

ఉ. నీనగుమోముసొంపుఁదగునీతనుకాంతియునీవిలాసము
న్నీనయభాషణంబులునునీఘనరాజసవైభవోన్నతు
ల్మానసమందునెంచుచునుమాననిశోకభరంబునొందియుం
దేనెటులుండనేర్తుహృదయేశ్వరయెవ్వరుదిక్కునాకికన్. ౧౧౭.

క. జడదారియడుగుఁదమ్ముల
వడినళిక్రియననుదినంబు వ్రాలెదుశిరముం
బుడమింబడియిటులుండఁగ
నడలుచునేనెట్లుగాంతునగచరనాథా. ౧౧౮.

చ. సురలసురల్సుధాంబునిధిశూరతఁద్రచ్చుచునుర్బలాత్ములై
గురుభుజుఁడీవటంచునినుఁగోరఁగనేగిపరాక్రమించిని
ర్జరతతిచేనుతుల్గనినసత్త్వమునేఁడెటుపోయెరాముచే
శరమునధారుణింబడఁగఁజాలితివేమననేర్తువల్లభా. ౧౧౯.

క. రావణునిముడిచికొనిపా
రావారములందుముంచిరహిమించినయా
నీవాలమిలనుబొరలఁగ
నేవగసైరింతుమదినహీనచరిత్రా. ౧౨౦.

ఉ. రామనృపాలుఁడెన్నభృగురామునిగెల్చినశూరుఁడిప్పుడా
తామరసాప్తనందనునిఁదప్పకచేకొనియున్నవాఁడునీ
వేమఱియుందుఁబోకుమనియెన్నివిధంబులనీకుఁదెల్పిన
న్నామనవింగ్రహింపకరణంబునఁగూలితెజీవితేశ్వరా. ౧౨౧.

క. నీకన్నసూనుఁడంగదుఁ
డీకరణిన్వగచుచుండనిటురమ్మనుచు
న్శోకంబుమాన్పఁదగదే
నాకాధిపతనయప్లవగనాయకయపుడున్. ౧౨౨.

వ. అని యత్యంతదీనాలాపంబుల దుఃఖించుచున్న యా సఖిం దాసి యాంజనేయుండు హితవచనానురూపంబుగా ననునయించి కన్నీరు మున్నీరై పాఱ నంగలార్చునంగదు నూరార్చు చుండె నంతఁ దార రామచంద్రునిం గాంచి యిట్లనియె. ౧౨౩.

సీ. అవనిఁ జేకొనియునిన్న డవిపాలుగఁ జేయఁ
దగుభరతుఁడుగాఁడుతలఁప వాలి
కక్షంబునందునిన్గట్టుకయొగురంగఁ
గలవిరాధుఁడుగాఁడుతలఁప వాలి
బారలుచాఁచినిన్బట్టిత్రిమింగఁదొడంగ
నలకబంధుఁడుగాఁడుతలఁప వాలి
వంచించినీకాంతఁగొంచకకొనిపోవు
దశకంధరుఁడుగాఁడుతలఁప వాలి
నీయెడలనీక పీంద్రుండునిరపరాధుఁ
డగుచువర్తించునెప్పుడిట్లాగ్రహించి
పాపమనకయొకశిలంపుబాణమురముఁ
దూఱనేయంగఁదగునెయకారణముగ. ౧౨౪.

క. పక్షవిపక్షములెన్నక
రక్షింపుదువఖలభువనరక్షకనీకుం
బక్షమొకనియందిడుచువి
పక్షుఁడవైయొకనిఁదునుమఁబాడియెయనఘా. ౧౨౫.

క. నీసర్వసద్గుణములుధ
రాసుతతోఁగూడిచనెనెరావణుకడకు
న్గాసిల్లివిరహతాపము
చేసమసెనెయొఱుకవలదెచిత్తములోనన్. ౧౨౬.

క. వాలిందునిమినభంగి
న్నేలంబడవైచినన్నునిర్జరలోక
శ్రీలనుభవింపఁబంపుము
జాలంబిఁకసేయవలదుజలజాతాక్షా. ౧౨౭.

వ. అని యనేకప్రకారంబులం బ్రలాపించుచున్న తారాసతిం గని రాఘవుం డిట్లనియె. ౧౨౮.

క. పగతుఁ జెతిలకింపఁగనీ
యగచరనాథుండు నాకు నతివరో వినుమీ
జగతిపయి నెల్లవారికిఁ
దగ బ్రహ్మకృతంబు గోలఁదిదప్పునె చెపుమా. ౧౨౯.

గీ. వాలి తలనుగల్గు వ్రాఁతఫలంబెల్లఁ
గుడిచె చనియె దివికిఁ గొదవ లేక
యితని కిట్లు వగవ నేల యూఱటఁ జెందు
మింతి నీ మనమునఁ జింత నూని. ౧౩౦.

క. తపనతనూజు నిపిదపం
గపిరాజ్యభరంబుఁ బూనఘనునం గదునే
నిపుడు నియమించి పుచ్చెద
నపరిమిత సుఖంబుఁ జెందియతివరో మనుమా. ౧౩౧.

వ. అని తార నత్యంతమధురాలాపంబుల ననునయించి రాఘవుండు సుగ్రీవున కిట్లనియె. ౧౩౨.

గీ. వాలి మీయన్న హతుఁడయ్యె వరుసతోడ
నగ్నిసంస్కార మొనరించి యాగమోక్త
ముగను దగు క్రియ లెల్లను మొనసి చేసి
రమ్ము పొమ్మన నప్పుడా రవిసుతుండు. ౧౩౩.

గీ. అగ్రజు కళేబరమును సమగ్ర రత్న
భూషణాలంకృతు ల్వేడ్కఁ బూసఁగఁ దొడఁగి
శిబిక నిడి కొంచుఁ జని ప్రేతసీమయందు
దహనకృత్యంబు లెల్లను దగ ఘటించి. ౧౩౪.

క. సరగునరవిజుఁడువాలికి
వరుసన్దినదినమునిష్ఠ వైదికవిధులం
జరిపించిదశాహంబునఁ
బరలోకక్రియలొనర్చిపరిశుద్ధుండై. ౧౩౫.

క. అనిలాత్మజాద్యమాత్యులు
దనుఁబరివేష్టించికొలువఁదపనసుతుండుం
జను దెంచిమ్రొక్కినిలిచిన
జనవిభుఁడగురాఘవుండుసంతోషమునన్. ౧౩౬.

క. ప్లవగప్రముఖులవేగమె
రవిజునిఁగిష్కింధకపుడురాజుగమఱియున్
యువరాజుగవాలితనూ
భవునింబట్టంబుగట్టఁబనిచినయంతన్. ౧౩౭.

క. వారలుదత్పురమునుశృం
గారంబొనరించితగనగరునాస్థానం
బారూఢిగఁగై సేయుచుఁ
దోరణములుగట్టిరింపుతోరహిమీఱన్. ౧౩౮.

వ. అంత. ౧౩౯.

గీ. సింహపీఠికపైఁగపిసింహునునిచి
పుణ్యలగ్నంబుననుమహాపుణ్యవారి
సమరనభిషేకమొనరించియగచరాధి
కారమునకునుబట్టంబుగట్టిరపుడు. ౧౪౦.

గీ. అంగదునియౌవరాజ్యంబునందునిలిపి
రంతనంతఃపురంబునందమితమైన

మంగళంబులు వెలసెఁబ్లవంగసమితి
కలకలధ్వానములుపొంగెఁగడలిభంగి. ౧౮౧.

క. ఈకరణినినతనూజుం
డాకపిరాజ్యమున కెలమినభిషిక్తుండై
ప్రాకటసంపద లెల్లను
జేకూరఁగనాత్మనలరిచెన్నువహించెన్. ౧౮౨.

ఉ. భానుతనూజుఁడయ్యెడనపారములైతగుదివ్యరత్నము
ల్గానికగాఁగఁగొంచుఁద్రిజగన్నుతుఁడౌరఘురాముపాలికి
న్వానరసంఘముల్గొలువవైఖరితోఁజనుదెంచిమ్రొక్కియ
మ్మానవనాయకుంగనిక్రమంబునసన్నుతిచేసియిట్లనెన్. ౧౮౩.

క. దేవాకిష్కింధాపురి
కేవిధముననైనమీరలేతేరఁదగు
న్నావలనిప్రేమపెంపున
నీవిపుడొసఁగినదిగాదెనిఖిలంబనఘా. ౧౮౪.

వ అని విన్నవించిన వానరేంద్రునకు రామచంద్రుం డిట్లనియె. ౧౮౫.

గీ. తపనతనయవినుముతాపసులెందును
బురములందునుండఁబోలదట్లు
గాననీవుపోయివానరరాజ్యంబుఁ
బూనియేలుమెపుడుఁబోలుపుమీఱ. ౧౮౬.

గీ. వానకాలంబువెడసూపెవసుధనెందుఁ
బగలిపైఁబోవనొప్పదెప్పగిదినైన
మాల్యవంతంబునందునెమ్మదివసింతు
మరయశరదాగమంబుననటకురమ్ము. ౧౮౭.

క. చనుమనిపల్కి రఘూద్వహుఁ
డినజుని వీడ్కొల్పి తామహీసుత నెదలోఁ
గొని మాల్యవంతమునకుం
జనియెల్లక్ష్మణుఁడుగొల్వ సరగుననపుడున్. ౧౪౮.

సీ. మాల్యవంతంబునకు రామమనుజనాథుఁ
డనుజసహితంబుగా నేగియచటితరులఁ
జఱుల సెలయేళ్లఁ గోనలవిరులఁ బొదల
సంచరించుచునున్నట్టిసమయమునను. ౧౪౯.

వర్షాకాలవర్ణన.

క. ధరణిజఁదొలఁగి రాఘవుఁ
డురుతరశోకంబునొందుచుండెడునితనిం
బరికింపఁజాలననిరవి
తెరనిడికొనెననఁగఁదోఁచెదివిజలదంబుల్. ౧౫౦.

క. రావణుని రాజ్యలక్ష్మియు
నీవిధమునఁదొలఁగుననుచు నెఱిఁగించుక్రియ
న్వేవేగఁదటిల్లతలు
న్భావింపఁజలించె మేఘపఙ్క్తులనడుమన్. ౧౫౧.

క. సురవైరిప్రాణములుగొన
ధరణీశునకర్కసుతుఁడుదనపాశంబు
స్బరువడిఁబుచ్చెనొయనుగతి
సురపథముననింద్రధనువుచూపట్టెనొగిన్. ౧౫౨.

సీ. రాఘవుఁడురావణునితోడరణమొనర్ప
దండువెడలించుటకుమహోద్దండముగను

సురలుభేరులు మ్రోయింపఁ జొచ్చిరనఁగ
నురవడిగ నంబుదము లప్పు డుఱుమఁ దొణఁగె. ౧౫౩.

గీ. రాక్షసావళి మేన శ్రీరాము బాణ
పటలి యిబ్బంగి ఘోరమై పడుననంగఁ
గానఁబడియెను బర్వతాగ్రముల పైని
భూరినిర్ఘాతపాత మద్భుతము దోఁప. ౧౫౪.

గీ. పక్షికంఠుని ద్రుంచి మాబాధ మాన్పె
ననుచు రాముని పైనింక నమరవర్యు
లలరుసోనల నీరీతి నలరఁ జేతు
రను విధంబునఁ గరకలు దనియ రాలె. ౧౫౫.

క. ఉరుగతి రావణుని యశ
స్స్ఫురణము రాఘవుని చేతఁ బొలియుంగ నసీ
కరణి నన రాజహంసలు
సరగునఁ జని చేరె మానససరోవరమున్. ౧౫౬.

సీ. అంతంత టనుభూనభోంతరాళంబులో
క్కటఁ గారుచీకట్లు గ్రమ్ముచుండఁ
జండమారుతము లుద్దండత భూపరా
గంబు ఖంబున నిండఁగ వ్వచుండ
దిక్కుదిక్కుల యందుఁ బిక్కటిల్లఁగ మ్రోసి
బలువిడి మేఘముల్ వ్రాలుచుండఁ
దళతళ మెఱయుచుఁ దప్పకెల్లెడల వి
ద్యుల్లతలోలి భాసిల్లుచుండ
దనుజబలముల పైమహోదగ్రముగను
భళి చు రాఘవు శరపరంపరలనంగఁ

కుంభినీస్థలిపంకసంకులముగాఁగ
　　ఘోరతరవర్షధారలుగురియఁదొణఁగె. ౧౫౭.

సీ. దినదినంబొక్కత్రుటియైనఁదెఱపిలేక
　　జల్లుజల్లునఁబెనుజల్లు వెల్లివిరిసి
మిణ్గురుపల్లంబులేకమైమెఱసిమిగుల
　　నఖిలదిశలజలార్ణవంబయ్యెనపుడు. ౧౫౮.

క. వననిధిదశరథతనయుని
　　ఘనతరబాణాగ్నిరుచులఁగ్రాఁగుటవినియం
దొనరఁజనుటుడిగివఱదలు
　　చనిచెరువులయందువెలయఁజనెననిలిచెన్. ౧౫౯.

క. కంటకుఁడగురావణులోఁ
　　గొంటివనుచురాఘవుండుకోపించుటయు
న్వింటిమనితెల్పుగతిమి
　　న్నంటన్ఘోషించియేఱులంబుధిఁజొచ్చెన్. ౧౬౦.

సీ. అంతవానలువెల్చెనన్నిదేశంబులం
　　దంతవిరిసెగాఢాంబుదములు
దిశలెల్లవెలుఁగొందెదినకరప్రభలతో
　　ధరణినిష్పంకమైతనరఁజొచ్చె
ఋక్షగణములతోఁ జేలఁజంద్రికలొప్పె
　　నిర్మలోదకములైనిలిచెసరసు
లంచలుకాపురంబరుదెంచెఁగొలఁకుల
　　కలరారెనిఖిలమృగాళులరయఁ
దెరువరులకతిసౌఖ్యంబుదేజరిల్లెఁ
　　గ్రమముమీఱంగసర్వసస్యములువండె

వడినుడిగినదులపుడుకాల్నడలునయ్యె
మహిమమీఱశరద్రుతుమహిఁబొడమె. ౧౬౧.

ఉ. అంతకుమున్నె వాయుజుఁడహర్పతిసూనునితోడ వర్షబు
త్వంతమునయ్యెనింకఁబ్రియమారఁగ రామునికార్యమెల్లనొ
క్కింతకొఱంత లేకక్రమమేర్పడఁజేయుమటన్న నారుమా
కాంతుఁడుదిగ్గునం దెలివిఁగైకొనినీలునిఁజీరియిట్లనెన్. ౧౬౨.

క. వివిధసరిద్ద్వీపంబుల
నవిరళమగునగములన్మహారణ్యముల
న్భువి నెల్లెడలవసించెడు
ప్లవగంబులఁదోడితేరఁబనుపుముకపులన్. ౧౬౩.

గీ. ఒక్కఁడేనిరాక దక్కినశిక్షింపు
మనిననీలుఁడధిపునాజ్ఞఁబూని
తరుచరులనుబిల్వఁదగువారలనుబంచి
యరయుచుండెనప్పుడతిరయమున. ౧౬౪.

వ. అంత నమ్మాల్యవంతంబునందు. ౧౬౫.

సీ. వానకాలంబెల్లవసుధేశుఁడగురాముఁ
డనుజుండుఁదానునయ్యద్రిమీఁద
గుహాలందువర్తించిగురునిపాదంబుల
మాటునవసియించిమరులుమించి
కుసుమకోమలిసీతగుణములుఁబ్రాయంబుఁ
దలపోసితలపోసితాల్మిదక్కి
యాహారనిద్రాదులన్ని విసర్జించి
విరహానలంబునవెతలుచెంది

దినదినంబునుసీరీతిదీనవృత్తి
నలసిఖగములకలకలములకునులికి
తెలివిఁబోఁబుచ్చిమదినొచ్చితిరుగుచుండి
మఱిశరత్కాలమేతేరమనుజవిభుఁడు. ౧౬౬.

క. అనుజునిఁజేయూఁతగఁగొని
మనమునసీతావియోగమగ్నతతోడ
న్ఘనదుఃఖాంభోరాశి
న్మునుఁగుచునున్మత్తుచందముననుండుతఱిన్. ౧౬౭.

చ. మనుకులధుర్యసీవిటులుమానినిఁబాసిమదింగలంగిచిం
తనుబలవింపనేలభుజదర్పమెలర్పఁగఁబత్త్రికంధరుం
దునిమిధరాసుతంగొనఁగఁదోడనెపొమ్మనితెల్పవచ్చునా
ప్త్రునిక్రియనంబరంబుననుదోఁచెసుధాంశుఁడుదేజరిల్లుచున్. ౧౬౮.

గీ. పట్టపగలుగాఁగఁబరిపూర్ణకళలచే
నిందుబింబమప్పుడెల్లెడలను
వెలుఁగుచుండవిరహవేదనకోర్వక
యినకులుండువలికెననుజుతోడ. ౧౬౯.

క. చూచితెలక్ష్మణభాస్కరుఁ
డీచందముగాఁగఁబొడమియెంతోవడిని
ట్లేఁచఁదొణంగెనుమనమిఁక
వేచనఁదగుఁదరులనీడవిడియఁగరమ్మా. ౧౭౦.

వ. అనిన లక్ష్మణుం డిట్లనియె. ౧౭౧.

గీ. అధిపయిదిరాత్రిగానియహంబుగాదు
కైరవాప్తుండుగానిభాస్కరుఁడుగాఁడు

కాంచుమదెమృగలాంఛనంబంచితముగ
ననినహాయనిపలవించియడలఁజొచ్చె. ౧౭౨.

ఉ. బాలమృగాక్షినిన్నిటులఁబాసిమదిన్విరహాగ్నికీలల
న్మేలిమిదక్కిస్రుక్కికడుమించినశోకభరంబునింకనే
లీలసహింతునెన్నటికిలేమరొనిన్బొడఁగందుఁగన్నుల
న్వాలలనాశిరోమణిమహామృదుభాషిణియెందుఁబోయితో. ౧౭౩.

వ. అని యత్యంతసంతాపంబునఁ బలవించుచు మూర్ఛిల్లుటయు లక్ష్మణుండు శిశిరోపచారంబుల సేదఁ దేర్చినఁ దెలి వొందె నంతఁ బ్రభాతం బగుటయు ధైర్యం బవలంబించి రాఘవుం డి ట్లనియె. ౧౭౪.

గీ. కంటెలక్ష్మణసుగ్రీవుకార్యమెల్ల
వానకాలంబుఁగడపితావత్తుననుచుఁ
బలికిచనిరాకతడసెనుబాటిదప్పి
క్రోఁతికేరీతిఁగల్గుసద్గుణముతలఁప. ౧౭౫.

క. ఏనానరించినయుపకృతి
మానసమునమఱచిరాజ్యమత్తుండగుచు
న్మానినులతోడఁగలయుచుఁ
దానేమఱియున్నవాఁడుధైర్యంబలరన్. ౧౭౬.

గీ. అనఘనీవుపోయియర్కజుఁబిలువుము
రాకతడసెనేనిరాముచేత
వాలిఁగూల్చినట్టివరశరంబున్నది
కాలదుండుభంబుకరణినసుమి. ౧౭౭.

వ. అని రాఘవుండు పనిచిన లక్ష్మణుండు రోషాగ్నిజ్వాలాభీలలోచనుం డై చని కిష్కింధాపురిం డాసి ప్రళయాంతకుం బోలి పురద్వారంబునం దీపించుటయుం దద్ద్వారపాలకు లతిభయంబునం బరువిడి

యంగదుం గాంచి తెల్పుటయు నతండు తారారుమాసహితుం
డైయున్న సుగ్రీవునిం జేరి యి ట్లనియె. ౧౬౮.

క. రామునికార్యం బేమఱి
 రామలతోఁ గలసియిట్లు రాజిల్లఁ దగునే
భూమీశుఁడనుపనల్లదె
 సౌమిత్రిమహాగ్రహమునఁ జనుదెంచెఁ జుమీ. ౧౬౯.

క. అనుటయుఁ దత్తఱమందుచు
 నినజుండతివినయమొప్ప నిటుఁ లక్ష్మణుఁడో
డ్కొని రమ్మని పనుపఁగఁ దాఁ
 జనియంగదుఁ డర్కకులుని సన్నిధి నపుడున్. ౧౭౦.

గీ. వందనమొనర్చి దేవ తావకపదాబ్జ
 యుగళసందర్శనార్థమై యుబ్బుచున్న
వాఁడు సుగ్రీవుఁ డటకు రావలయు ననిన
 నంగదునితోడఁ బురిఁ జొచ్చి యంత నతఁడు. ౧౭౧.

గీ. అప్పురీవరవైభవ మొప్పు మీఱ
 నారయుచు వేగ రాజగేహంబుఁ జేర
రాఁగ సుగ్రీవుఁ డపుడు తారాసమేత
 ముగ నెదుర్కొని మ్రొక్కి కేల్మొగిచి నిలిచె. ౧౭౨.

వ. అంత నవ్వానరేంద్రుం గాంచి యాగ్రహోదగ్రుండై లక్ష్మణుం
డి ట్లనియె. ౧౭౩.

క. ఓరి కృతఘ్నుఁడ యిటువలె
 శ్రీరామున కెగ్గు సేయఁ జెల్లునె మఱచి నీ
కీ రాజ్యసంపదలు నే
 ధీరునికృపఁ గల్గెనది యెఁ దెలియఁగవలదే. ౧౭౪.

క. వానలుగడచినయంత
    న్నానకచనుదెంతుననుచుమనుజేంద్రునితోఁ
బూనిపలికితడసితివిటు
    మానఁగలేవైతివకటమర్కటబుద్ధీ. ౧౮౫.

క. భూరిబలుండగువాలి
    స్థిరతఁబడవైచి రామధీమణిచేత
న్గ్రూరాహికరణివెలిఁగెడు
    ఘోరశరంబిపుడునిన్నుఁగూల్పకయున్నే. ౧౮౬.

వ. అనిన సుగ్రీవుం డడలున నొడలు గడగడ వడంక మాటాడ నోరాడక తడఁబడుచుఁ బెదవులం దడుపుచుండం గని తార లక్ష్మణునకు వినత యై యిట్లనియె. ౧౮౭.

క. ఈవానరనాథునియెడ
    నావంతయుఁదప్పులేదహార్యచరులవే
రావింపుచున్నవాఁడిటు
    లావునలంకపయిఁబోవలక్ష్మణవింటే. ౧౮౮.

క. మీరలొసఁగినదిగాదే
    యీరాజ్యసుఖంబులెల్లనినజునకునిజం
బేరీతినైనభృత్యునిఁ
    గారక్షింపంగవలయుఁగరుణదలిర్పన్. ౧౮౯.

వ. అని సవినయంబునం బదపంకజంబుల వ్రాలి విన్నవించుతారాసఖ వచనంబులకు లక్ష్మణుం డాగ్రహంబు మాని శాంతుఁ డగుటయు సుగ్రీవుం డర్చనంబు లొసంగి తోడ్కొని చని సింహాసనాసీనుం జేసి కరకమలంబులు ముకుళించి నిలువంబడి యిట్లనియె. ౧౯౦.

ఉ. రామనృపాలుకార్యమును రాగము మీఱ నొనర్పఁ బూనిసం
గ్రామధురీణులౌ కపులఁ గట్టడ సేయఁగఁ బిల్వఁబంచుచి
శ్లేమఱకున్న వాఁడ మది నే క్రియ నన్నుఁ గృతాపరాధుఁగా
నోమనువంశమౌళిమణి యారక దూఱఁగ నేల తెల్పుమా. ౧౯౧.

క. తామరసాప్తాన్వయునికృ
పామహిమాతిశయమునను బ్రతికితినిఁక నే
స్వామిద్రోహ మొనర్తునె
సౌమిత్రీ మదినిఁ గొంత శాంతము వలదే. ౧౯౨.

క. బలములఁ గొని రఘువరుపద
జలజాతంబులను గానఁ జనఁదగు నింకన్
జెలఁగుచు ననిలత్మజునిం
గలయంగనిపల్కి జగముగనుకొడుకపుడున్. ౧౯౩.

క. హనుమంతునిఁ గనుఁగొని యి
ట్లనియె న్నన వీటఁ గల్గు నగచర కోటి
జ్జననాథచంద్రుఁ గాన
జ్జనుటకుఁ బయనంబొనర్పఁ జను వేగమునన్. ౧౯౪.

వ. అని యాజ్ఞాపించి తారాది సఖీమణుల వీడ్కొని ప్రస్థానభేరి మ్రో
యించి రత్నఖచితాందోళిక యందు లక్ష్మణు నారోహణంబొనర్పం
బంచి ఛత్రచామరాలవట్టధ్వజపతాకాదు లెత్తించి పుచ్చి తాను
శిబికారూఢుండై మంగళవాద్యారావంబులును వందిమాగధుల
కైవారంబులును నింగి ముట్టం జెలంగ సకలవానరకోలాహలంబుల
తోడఁ జనుదేర నక్కలకలం బాలించి రాఘవుండు సుగ్రీవు రాకఁ
గా నెఱింగి శాంతంబు నొందియుండె నంతఁ దత్సమీపంబున శిబికం
డిగ్గి సుగ్రీవుండు లక్ష్మణసహితుం డయి చని రామచంద్రునకు సా

ష్టాంగవందనంబు గావించి తదాలింగనంబుఁ గైకొని మహావినయ
సంభ్రమంబులు రెట్టింప నిట్లనియె. ౧౯౫.

క. ఇన్నిదినంబులుతరుచరు
లున్నెడలకుఁబిల్వఁబంచుచుండితడసితి
న్నన్ననచేయుమునాపై
సన్నుతగుణజాలరామచంద్రనృపాలా. ౧౯౬.

క. వచ్చెదరదెకపివీరులు
చొచ్చెదరెంతైనఁగానిశూరతదోఁప
న్వ్రచ్చెదరునిఖలదనుజుల
సచ్చరితుఁడవైననీకుసత్కృపచేతన్. ౧౯౭.

వ. అని సుగ్రీవుండు విన్నవించుటయు రామచంద్రుండు హర్షాంత
రంగుండై యిష్టగోష్ఠి నుండునవసరంబున. ౧౯౮.

సీ. హనుమదంగదనీలవినుతమహానాద
పనసమైందసుషేణపావకాక్ష
జాంబవద్గిరిభేదిశతబలినలధూమ్ర
గంధమాదనగజగవయసుముఖ
శరభకేసరితారజంఘాళుదధిముఖ
విముఖగవాక్షసద్వేగదర్శి
ముఖబహుమర్కటముఖ్యులుదమతమ
సుతహితబంధుసంతతులతోడ
సమరభీకరమూర్తులైశమనుచేతి
కాలదండములోయనగణనకెక్కు
కోట్లకోలఁదిభటావళిగొల్వవెడలి
రలవిభాకరసుతునాజ్ఞఁదలనుదాల్చి. ౧౯౯.

గీ. నేలయీనినకరణినిబిడమగుచు
నెచటఁజూచినఁదానయై యేపుదోఁప
బటురవంబులఁ బ్రహ్మాండభాండమద్రువఁ
గడలికైవడివచ్చెనాకపిబలంబు. ౨౦౦.

గీ. శ్వేతకృష్ణరక్తపీతవర్ణంబుల
కపులసంఖ్యములయిగండుమీఱి
వివిధగతులనిండివెల్లువలైయొప్పెఁ
దపనసూనుమూఁకలపుడుచెలఁగి. ౨౦౧.

వ. ఇట్లు భూనభోంతరాళంబులు సెవుడువడ నార్చుచుం బఱతెంచు బలంబుల విడియించి దండనాయకు లరుదెంచి మ్రొక్కి నిలిచిన సుగ్రీవుండు రామానుజ్ఞాప్రకారంబున సీతాన్వేషణం బొనర్ప సమకట్టి యప్పుడు. ౨౦౨.

క. వినుతసుషేణశతబలుల
నొనరంగనుబూర్వపశ్చిమోత్తరములకు
న్వనచరనాయకుఁడయ్యెడ
జననాథునిదేవివెదకఁజననియమించెన్. ౨౦౩.

క. నలజాంబవంతగవయా
నిలజాంగదమైందపనసనీలాదిమహా
బలులన్దక్షిణమునకై
ఖిలినరయంబోవఁబుచ్చెధీరతతోడన్. ౨౦౪.

వ. ఇట్లెల్లదిక్కులం గలయం గ్రుమ్మఱి పురంబులు నగంబులు కాననంబులు నదులు వనధులు ద్వీపాంతరంబులు నతిప్రయత్నంబునఁ గనుఱెప్ప వెట్టక యారసి వివిధోపాయంబుల జానకితెఱం గెఱింగి యొక్కమాసంబున రాక తక్కిన నాజ్ఞ యొనర్పం బడు నరుగుం

డనిన వారునుం దదాజ్ఞాప్రకారంబున నొక్కొక్కరు లక్షవాన రులం గలిపికొని పూర్వపశ్చిమోత్తరంబులకుం జని రంత హనుమ దంగదాదులు దక్షిణదిశకుం బోవునవసరంబున నాంజనేయునిం జీరి రాఘవుం డిట్లనియె. ౨౦౫.

క. అనఘాత్మనీవుసీతం
గనుఁగొనఁజాలుదువునాదుకార్యమునీచే
తనుసిద్ధించునుగావునఁ
గొనుమీయుంగరముసకియగుఱుతెలుఁగుటకై. ౨౦౬.

క. ఇమ్ముద్రికజానకికిఁ
సమ్మతిమీఱంగనొసఁగిచానశిరోర
త్నమ్మొఁగైకొనివేగమె
రమ్మాచనియస్మదంతరంగంబలరన్. ౨౦౭.

వ. అని యంగుళీయకం బొసంగి జానకిచందం బేర్పడ నెఱింగించి దీవించి పుచ్చిన నుప్పొంగి యమ్ముద్రిక శిరంబున నిడికొని సాష్టాంగ వందనం బాచరించి రామచంద్రునితోడ నాంజనేయుం డిట్లనియె.

క. దేవాదేవరపదముల
భావంబుననిల్పిలంకభస్మమొనర్తు
న్రావణునిగుట్టెఱిఁగిసీ
దేవింగనివత్తుఁగానితిరుగనుమరలన్. ౨౦౮.

వ. అని పల్కి యంబరంబు వగుల నార్చుచు నంగదాదులం గూడి సీతాన్వేషణం బొనర్ప దక్షిణంబున కరిగె నంత ననుజవానరేంద్ర సహితుం డై రాఘవుండు సుఖం బుండు నయ్యెడ. ౨౧౦.

గీ. ఒనరఁబూర్వపశ్చిమోత్తరములకేగి
నట్టిప్లవగవర్యులన్నిదిశల

కరిగియరిగిమెచటనవనిజఁగానక
మఱలివచ్చిరాజ్ఞమఱవకరసి. ౨౧౧.
గీ. అపుడురఘుకులుండునర్కసంభవుఁడును
దక్షిణంబుఁజనినవృక్షచరులు
నెట్టివార్తఁదెత్తురేమగునోయని
తలఁకుచుండిరొండుతలఁపుమాని. ౨౧౨.
సీ. అంతపంతముమీఱనంగదాదులుగూడి
చనిచనిపురములశైలములను
వనములఁగోనలవరతటాకంబులఁ
బొదలనుగుహలనఁభూజములను
జానకినరయుచుమానినిదప్పిచే
సొలసిఘోరాటవిఁజొచ్చిచనఁగ
నచ్చోటనీలాభ్రభమనన్నొప్పియొకదైత్యుఁ
డడ్డమైనిలిచియత్యాగ్రహమున
నోరిమారీచతనయుండనురుభుజుండ
నిందునాయునికికతముననింద్రుఁడైన
రావెఱచునింకమీరలేత్రోవఁబోవ
నొప్పునాహారముగఁగొందునిప్పుడనుచు. ౨౧౩.
క. కరములఁజాఁచుకరాఁగని
యురుజవముననంగదుండునొకపిడికిటఁదా
నురమునఁబొడువఁగదనుజుఁడు
ధరగిర్రికియఁగాలెరక్తధారలుదొరఁగన్. ౨౧౪.
వ. ఇవ్విధంబున నా రక్కసు నుక్కణంచి యక్కాననంబున నంగదాదులు క్షుత్పిపాసాపరవశులై జలంబులం గానక తిరుగుచున్న యవసరంబున.

క. కలకలమనియొకబిలమున
జలపక్షులువెడలఁగాంచిజలమచ్చోటం
గలదనితలఁచుచుఁగపులా
బిలమునడిగిచనిరిమీఁదిపెనుచీఁకటిలోన్. ౨౧౬.

గీ. అట్టిఘోరతమమునతివేగఁగ్రమియించి
భానుకోటిదీప్యమానమైన
హేమపురముఁగాంచియెందునిర్మానుష్య
మగుటకతిశయించితెగువఁజొచ్చి. ౨౧౭.

చ. పురముననెల్లచోఁదిరిగిపోవఁగమార్గముగానరామికి
న్గురుభుజులాత్మఁజింతిలుచుఁగొన్నిదినంబులమీఁదరాజమం
దిరమునెఱింగియందుఁజనిధీరతతోఁదపమాచరించునా
క్కరమణిఁగాంచిపల్కిరితగన్వినయోక్తులఁదాల్మిమీఱఁగాన్. ౨౧౮.

క. ఓతన్వియిప్పురీవర
మీతఱిఁబాడడరియున్నదిందొంటిగనీ
రీతిఁదపమాచరించెద
వీతెఱఁగేల్పడఁగఁదెల్పుమిప్పుడుమాతోన్. ౨౧౯.

వ. అనిన నప్పొలంతి యయ్యగచరోత్తములం గాంచి యిట్లనియె.

సీ. అబ్జజువరముననసురాధినాథుఁడౌ
మయుఁడీపురముహేమమయముగాఁగ
నిర్మించితమిమించినిందుసంపదహేమ
యనునాతితోసౌఖ్యమందుచుండ
నింద్రుఁడాతనిఁద్రుంచిహేమనుగొనిపోవ
నన్నాతిప్రియసఖిసగుటఁజేసి

తదనుజ్ఞ నిచ్చోటఁ దప మొనర్చుచునుండు
    ననుస్వయంప్రభ యండ్రు వినుఁడు మీర
లెచటనుండుదురీయెడ కేకతమున
    ననుగుదెంచితి రేతెఱఁగింపుఁడనుచుఁ బల్క
సంగడాములునన తెఱంగతివతోడఁ
    జెప్పుమనవుడు హనుమంతుఁ డప్పుడనియె. ౨౨౧.

చ. వనజహితాన్వయుండు నృపవర్యుఁడు రాముఁడు దండ్రి పంపున
న్వనమున నుండుచో నతని పత్ని ధరాసుతఁ గొంచు రావణుం
డను దనుజుండు హాలుటయు నద్దురితాత్ము తెఱంగెఱింగి రం
డని మము భానుజుండనుపనన్ని దెసల్వరికించి కాంచుచున్. ౨౨౨.

క. కడుదప్పి నొక బిలము వెం
    బడి డిగి యిప్పురముఁ గనియు బహుదినములుగా
వెడలుటకుఁ ద్రోవఁ గానమి
    నడలుచునున్నార మిచట నతివరో వింటే. ౨౨౩.

క. మమ్మీపురి వెడలించి ప్రి
    యమ్ములరం బనిచెదేని యవనీతనయ
న్నమ్మతి నరయం బోయెద
    మమ్మా యని వేఁడ నాస్వయంప్రభ యపుడున్. ౨౨౪.

గీ. వానరుల కెల్ల ఫలజల వాంఛ దీర్చి
    కనులు మోడ్పంగ నియమించి కరుణఁ బెంచి
బిలము వెడలించి చనియె గంభీరయగుచు
    నిజతపోమహిమంబున నిమిషమునను. ౨౨౫.

వ. ఇట్లు మృత్యువక్త్రంబుఁ జొచ్చి వెడలువడువున వనచరప్రముఖు లబ్బిలంబు వెడలి యద్దివ్యవనితాప్రభావంబున కచ్చెరు వందుచుం

జని మహేంద్రాద్రి డాసి యందఖిలదిశల నవనిజ నరసి కానక
నిరాశఁ జెంది యంద యొక్కచో నివసించి చింతిల్లుచుండుతఱి నాంజ
నేయాదులం గని యంగదుం డిట్లనియె. ౧౨౬.

క. ఇనజుఁడనుజ్ఞ యొసంగిన
దినముల్గ్రిమ్మరియుం జెరామధీరుని దేవిం
గనలేమి జిత్తవ్రోయిన
మనలన్సుగ్రీవుఁ డేలమన్నన చేయున్. ౧౨౭.

గీ. అతని చేతఁ జిక్కి హతమాటకం బెనిం
తటను వెడలినట్టి పటుబిలమునఁ
జొచ్చియుంద మదియు సురనరాభేద్యమా
ననిన వాయుసూనుఁ డనియె నపుడు. ౧౨౮.

క. రామున కపకృతిగాని
భూమింజోరఁబడిన నెందుఁబోయిన మనల
న్సౌమిత్రిచేతి కాండము
లేమాడ్కి న్విడువనేర దెఱుఁగుము మదిలోన్. ౧౨౯.

గీ. అచ్చటికిఁ జని ప్రాణంబు లర్కజునకు
నొసఁగుట యె మేలుగాదె నొండు తెఱఁగు
గాఁగ మడియంగఁ దలఁపుము క్రమముతోడ
ననిన నంగదుఁ డందఱ నపుడు గాంచి. ౧౩౦.

క. ప్రాయోపవేశమున మన
మీయెడఁ బ్రాణానిలముల నెట్లైనను బోఁ
జేయఁ దగు ననఁగఁ గపివరు
లాయితులై రవ్విధమున కతివేగమునన్. ౧౩౧.

వ. అంత నయ్యగచరోత్తములు దర్భశయ్యాతలంబులం బవ్వళించి యి
ట్టట్టుఁ బొరలుచు నాత్మబంధువర్గంబులం దలంచి వగచుచున్న యెడఁ
దద్గిరిగుహాంతరంబున వసించుఖగకులాధీశుం డగుసంపాతి మరణో
ద్యుక్తులై ధరణీతలంబునం బడి యున్న వానరులం గాంచి దైవ
కృతంబునం దనకాహారం బబ్బె నని చెలంగుచుం బరతేరం గని
యంగదుండు హనుమదాదులతో నిట్లనియె ౨౩౨.

గీ. దశరథుండుఁజచ్చెదనుజుచేతజటాయు
వడఁగెరాముకోలఁగెడసెవాలి
ప్రాణమెడలఁగలముపతిభీతినీరీతిఁ
గైకవరముచేతఁగలిగెనింత. ౨౩౩.

క. నగముపయినుండియల్లదె
జగదద్భుతకరముగాఁగఁజనుదెంచెడునా
ఖగరాజంబునుగంటిరె
తెగిమనలభుజింపవచ్చుతెఱఁగగుఁగాదే. ౨౩౪.

వ. అని యంగదుండు పల్కుటయు జటాయువుమరణంబునుడులు కర్ణ
రంధ్రంబుల ముల్కులక్రియ నాటిన మహాశోకాక్రాంతుండై పర
తెంచి సంపాతి యవ్వానరశ్రేష్ఠుల డగ్గరి యిట్లనియె. ౨౩౫.

గీ. అనఘులారజటాయునగ్రజుఁడను
వినుఁడుసంపాతియనియెడువిహగవిభుఁడ
ననుజుఁబోవడిఁగానకీయద్రియందు
వెలసియుండుదుమీచేతవింటినేఁడు. ౨౩౬.

గీ. ఆజటాయువుదానేలనవనిఁగూలె
నెవ్వఁడేరీతిఁగావించెనెఱుఁగఁదెల్పుఁ

డనినవిని వాలినందనుండా ఖగేంద్రు
నాదరంబునఁగాంచియిట్లనియెనపుడు. ౨౩౭.

సీ. సంపాతివినుముదశరథాత్మజన్ములు
రామసౌమిత్రులరణ్యమునను
సంచరింపఁగ రాము సతిసీత నెత్తుక
రావణుండరుగ నాత్రోవయందు
నడ్డమైపోరుజటాయువునటుత్రుంచి
దనుజుండుస నెనంత దాశరథులు
సుగ్రీవుకడఁజేరిసురనాథసుతుఁగూల్చి
జనకజనరయమమ్మనుపుటయును
వనములద్రులుపురములువరుసతోడ
వెదకికానకయిచ్చోటవెతలఁగుందు
చున్నవారము రావణుండున్న పురము
దెలిసియున్నను దెల్పుముధీరవర్య. ౨౩౮.

వ. అనిన నా ఖగేంద్రుం డనుజుండు హతుం డగుట కత్యంతదుఃఖి తాత్ముం డై యచ్చేరువ నున్నజలంబులం గ్రుంకి మఱల నేతెంచి యంగదుం గాంచి యిట్లనియె. ౨౩౯.

క. మునుకైలాసనగంబున
ననుజుండేనును జెలంగియతిముదమలర
న్ననుచుండియుజనసత్వము
లను దెలియంగోరిమిగులలావుననపుడున్. ౨౪౦.

క. ఇనమండలమునకెగయన
తనిరక్షిన్చటయుగముదగ్ధంబయిచ

య్యానీయచలముపైఁబడి
యనుదినమిచ్చటనెయుండుమనటునిటుచనఁగన్. ౨౪౧.

క. నాతనయుండుసుపార్శ్వుం
డాతతబలయుతుఁడునాకునాహారంబు
న్బ్రీతినొసంగుచునొకనాఁ
డాతఁడుదడవగుచువచ్చియపుడిట్లనియెన్. ౨౪౨.

క. రావణుఁడొక్కనృపాలుని
దేవింగొనిపాఱుచుండదీనోక్తులచే
నావెలఁదిరోదనంబును
గావింపఁగమింటనిల్చికాంచుచునుంటిన్. ౨౪౩.

వ. కావున నింత తడ వయ్యె నని సుపార్శ్వుండు నాతోడ నెఱింగించి యుండె నద్దురాత్ముండు జానకిం గొనిపోవుట నిక్కం బగు నది యునుం గాక. ౨౪౪.

క. కాకుత్స్థునిసతినరయుచు
నీకడకగచరులువచ్చినిలువఁగఁదక్క
ల్నీకుంబొడమునటంచుని
శాకముమునిమున్ను తెల్పియరిగెన్నాతోన్. ౨౪౫.

వ. అట్లు గావున. ౨౪౬.

క. ఇదెనాపక్షంబులుపెం
పొదవంగలిగెననిదివికినురవడిఁజనియు
ల్లదెలంకలోనసీత
న్వదలకకనుఁగొంటివినుఁడువనచరులారా. ౨౪౭.

క. జలనిధిపైశతయోజన
ములదూరంబుననుబక్షిముఖునిలయంబు

న్వాలయునులంకానామం
బలరఁగఁదత్పురినిసీతనరయుఁడువరుసన్. ౨౪౮.

క. మీకార్యసిద్ధియయ్యెడుఁ
దేకువతోఁజనుఁడటంచుఁదెరువెఱిఁగింపం
బ్రాకటమతులైవానరు
లాకడలింగానఁబోయిరతివేగమునన్. ౨౪౯.

వ. ఇట్లు సంపాతిచే రావణునినివాసం బగులంకానగరంబునకు మార్గం బెఱింగి యంగదాదులు చని చని. ౨౫౦.

మ. కనిరభ్రంకషఘూర్ణమానభయకృత్కల్లోలమాలోత్పత
ద్ఘనవాతూలయుతాంబుబిందుహృతపద్మాకామినీనిత్యఖే
లనజాయాసదినేశమండలతలాక్రాంతస్థితోపేంద్రముం
గనటన్నక్రతిమింగిలప్రముఖరేఖాసాంద్రమున్ సంద్రమున్. ౨౫౧.

చ. ఇటుపొడఁగాంచివృక్షచరులెల్లరునుల్లములంగలంగియా
ర్భటములుమానియొండొరులుపాటిదలిర్పఁగనిమ్మహాంబుధిం
బటుగతిఁదాఁటనోపుఘనబాహుబలుండెవఁడొక్కొ—యంచున
చ్చటబెగడొందుచుండఁగనిచయ్యనవాలితనూజుఁడిట్లనున్. ౨౫౨

క. మీమీజవసత్వంబుల
ధీమంతులరబ్ధిదాఁటుతెఱఁగెఱిఁగింపుం
డీమాడ్కిననుచునాతోఁ
దామసమింకేలయనినఁదరుచరులపుడున్. ౨౫౩.

క. పదిగజుఁడుగవాక్షుండి
ర్వదిగవయుఁడుముప్పదియుశరభుఁడెన్నఁగన
ల్వదిగంధమాదనుండేఁ
బదియోజనములునుదాఁటబలియురమనిరన్. ౨౫౪.

క. అఱువది మైందుఁడు డెబ్బది
గుఱిఁగొని ద్వివిదుండెగుర నగుననఁగ నవుడు
న్నెఱి యెనుబది యోజనములు
వెఱవక దారుండు జంఘ వేయుదు ననియెన్. ౨౫౫.

గీ. జాంబవంతుండు ముదిమిచేఁ జాలడస్సి
యుండు కతమునఁ దొంబది యోజనములు
దాఁటెద నటన్న నీలుండు దాను దొంబ
దయిదు తగఁ జెంగలించెద ననుచుఁ బలికె. ౨౫౬.

గీ. అంగదుఁడు ధైర్యమున నిమ్మహాంబురాశిఁ
దనరు శతయోజనము లేను దాఁటఁగలను
మఱలి రానోపనని విని మది నెఱింగి
జాంబవంతుండు వల్కెఁ గార్యంబు దోఁప. ౨౫౭.

క. నూఱుతిగలుగఁ గమనకి
ట్లారయఁ బని యేమటంచు ననిలాత్మజునిం
జీరి వినుతింపుచు నెలమి
వారిజభవభవుఁడు జాంబవంతుం డనియెన్. ౨౫౮.

చ. వనరుహనేత్ర జానకి నవశ్యముఁ గాంతువటంచుఁ గాదె య
వ్వనజహితాన్వయుండు నుఁధ్రువంబుగ నిన్ను తియించి పంచెనీ
వననిధి సప్తకంబయిన వాయుజవంబున దాఁటఁ జాలు నీ
కనఘ యిదెంత వింత వినుమద్రిచరుల్ని నుఁబోల నేర్తురే. ౨౫౯.

క. సరసిజసంభవుఁడర్థి
న్నరములచే బాధ లెపు డెసంగక యుండ
న్వరములొసంగఁ జెసీసరి
గురుబలయుతుఁ జెందుఁ గలఁడు కుతలమునందున్. ౨౬౦.

క. కావునరామునికార్యం
  బేవగనైననుఘటింపనీయెడమదిలో
భావింపుమధిపుపంపు
  న్గావింపుముసద్యశంబుఁగాంచుముపుడమిన్. ౨౬౧.

వ. అని జాంబవంతుం డగ్గించుటయు నాంజనేయుం డత్యంతోత్సాహంబున నుప్పొంగి యుంగదాదులం గని యిట్లనియె. ౨౬౨.

క. కపివర్యులార మీకృప
  నిపుడేనీయబ్ధిదాఁటియినకులునిసతిం
జపలుఁడగు రావణాసురు
  నిపురింబొడఁగాంచివత్తు నేర్పుదలిర్పన్. ౨౬౩.

గీ. పోయివచ్చెదననిపల్కి భూరిసత్వుఁ
  డలమహేంద్రాచలం బెక్కి యర్కుపగిదిఁ
దేజరిల్లుచు లంక పైదృష్టియుగ్మ
  ముంచి హృదిరాము నెంచి కుప్పించి దాఁటె. ౨౬౪.

క. రావణు ప్రాణానిలమిఁక
  నీవిధమున నేగయుననుచు నెంచఁగించు క్రియం
బావని రౌద్రరసంబపు
  డావిర్భవమందనరిగె నంబరచరుఁడై. ౨౬౫.

వ. ఇట్లు హనుమంతుం డనంతసత్వుండై చండమారుతోద్దండసత్వరంబునఁ బఱచుచున్నయెడ నయ్యుదధిమధ్యంబున మైనాకుం డను పర్వతశ్రేష్ఠుం డబ్ధీంద్రుననుమతంబునం బొడసూపి తనయందు విశ్రమించి చనునది యని వేఁడుటయు నాంజనేయుండు రాముకార్యంబు నిర్వహించి మరలుచో నట్లు గావించెదనని పల్కి వీడ్కొల్పి యవ్వలం జన నప్పుడు. ౨౬౬.

క. బలవైరి యాంజనేయుని
యలవుచలం బేర్పడఁగ సురస నిచ్చిన నదియుం
బలురక్కసియై కపికుల
తిలకు నకడ్డంబు దోఁచి ధీరతఁ బలికెన్. ౨౧౭.

క. దైవకృతంబున నాకు
న్నీవాహారంబ వగుచు నిలిచితి వింక
న్నా వదనగహ్వరంబున
వేవేగమె చొరుమటన్న విని యతఁ డనియెన్. ౨౧౮.

గీ. కలికి వినుము రాముకార్యార్థమై యేను
బోవుచున్నవాఁడఁ బోయి మఱలి
వచ్చుచోట నీదు వాంఛ నెనర్చెదఁ
దొలఁగు మనిన దేవదూతి యపుడు. ౨౧౯.

క. నినుఁ గ్రమింగక పోనిత్తునె
యని దశదిశలఁ ద్రువభీషణాకారముతోఁ
దనవక్త్రబిలంబుఁ దెఱచి
చను దేరం గాంచి కోపసంభరితుండై. ౨౨౦.

క. పదియోజనముల పొడవునఁ
బదపడి తన మేను బెంచెఁ బవనజుఁ డపుడి
ర్వదియోజనములు దెఱచె
న్వదలక సురసయును నైజవదనకుహరమున్. ౨౨౧.

వ. ఇట్లొండొరులు శరీరవక్త్రబిలంబులం బెంపుచు శతయోజనాయతు లగుటయు వాయుజుండు సూక్ష్మరూపంబునఁ దద్వదనగహ్వరంబుఁ జొచ్చి వెడలి యెనుటం దోఁచి యిట్లనియె. ౨౨౨.

చ. లలనరొ నీదుకోర్కె సఫలంబొనరించితినింక నేనుబోఁ
దలఁతునటన్న మెచ్చిశుభదంబగుదీవెనయిచ్చిపుచ్చియ
ప్పొలఁతుకదివ్యదేహయయిపోయెదివంబునకాంజనేయుఁడు
న్జలనిధిదాఁటఁగాఁదలఁచిసత్వరమేగుచునుండనత్తఱిన్. ౨౬౩.

గీ. వనధిలోనుండిసింహికయనెడుదైత్య
కాంతశతయోజనాయతాక్రాంతయగుచు
ననిలజునినీడఁగనిగ్రహింగనతఁడునిలిచి
పోవరామికిఖిన్నతఁబొందియపుడు. ౨౬౪.

క. ఛాయాగ్రాహిణియంచును
వాయుతనూజుండెఱింగివచ్చితదుదరం
బాయెడనుజొచ్చిదానవి
కాయంబవలీలఁజీల్చికడువడివెడలెన్. ౨౬౫.

వ. ఇట్లు రాహుగ్రస్తుండై విడువంబడు విభాకరుండునుంబోలె నాంజ నేయుండు సింహికోదరంబు వెడలి మహాప్రభావసంపన్నుండై యతివేగంబున శతయోజనవిస్తీర్ణం బగునర్ణవం బవతీర్ణం బొనర్చి లంకాపురసమీపంబునం గల సువేలాచలంబున విడిసె నంత.

క. కరుణాకరజగదభినుత
శరణాగతదీనపాలసద్గుణజాలా
ధరణీధరధరమురసం
హరణారణనిపుణకౌస్తుభాద్యాభరణా. ౨౬౬.

తోటకవృత్తము. కలిదోషమహాంబుదగంధవహా
బలిబంధనకృత్పదపంకరుహా
విలయార్ణవసంస్థితవిశ్వహితా
విలసత్కనకాంబరవేదనుతా. ౨౬౭.

గద్యము. ఇది శ్రీమదుత్తరరంగనాథకరుణాకటాక్ష వీక్షాసమాగత సరస కవితావైదుషీప్రవీణ పరమవైష్ణవకులకలశజలనిధిసుధాకర రామానుజ దేశికగర్భశుక్తిముక్తాఫలాయమాన శృంగారసారసంగ్రహాభిఖ్య లక్షణగ్రంథనిర్మాణధురీణ ప్రహ్లాదచరితయక్షగానవిధాననిధాన గానవిద్యానూన పాండితీస్థాన రంగయాభిధాన ప్రణీతంబైన శ్రీమద్రామోదయం బనుమహాపురాణంబునందుఁ గిష్కింధాకాండం బనునది చతుర్థాశ్వాసము.

---

## సుందరకాండము.

---

క. శ్రీరామాకుచకుంకుమ
సారాంకితవక్షనిఖిలసంయమిరక్షా
నీరజభవముఖసురమం
దారోత్తరరంగధామదానవభీమా. ౧.

వ. అవధరింపుము. ౨.

క. పావని శ్రీరఘురాముని
దేవిం బొడఁగానఁ బూనిధృతి మీఱఁగఁ బా
రావారమొక్క కాలువ
కైవడి వడి దాఁటె నమరగణములు వొగడన్. ౩.

వ. ఇట్లగాధం బగుపాథోనిధి నవలీలం దాఁటి తాలతక్కోలహింతాల రసాలనారికేళపనసాశ్వత్థప్రముఖభూజాతంబులును, గంధగజఖడ్గ గవయకంఠీరవశరభశార్దూలవరాహమహిషాద్యనేకమృగకోలాహలారావంబును, గలిగి మహాభయదోద్రేకంబును నై యొప్పును వేలాచలాగ్రభాగంబున నిలిచి యప్పుడు. ౪.

మ. కనియెన్గంధవహాత్మజుండుమణిసంకాశస్ఫురద్భూరివ
ప్రనికాయంబునుభర్మగోపురగృహప్రాసాదసోపానహ
ర్మ్యనవీనోన్నతసౌధముల్దనుజభీమధ్వానకోలాహలం
బునుమాతంగశతాంగసైంధవశతంబుల్గల్గులంకాపురిన్. ౫.

క. అన్నగరీవరవిభవముఁ
గన్నారంగాంచి మెచ్చి కరువలిసుతుఁడ

త్యున్నతమగునీసంపద
లన్నియుదశవదనుఁడేలనాఁడిపుచ్చెన్. ౬.

వ. అని తలంచుచు మఱియు నాత్మగతంబున. ౭.

క. పగలీపురమునఁజొచ్చినఁ
బగలౌనసురాధినాథభటులకునాకు
న్జగముకనుగ్రుంకఁబోవం
దగుననియప్పర్వతమునఁదలఁగకయుండెన్. ౮.

వ. అంత. ౯.

చ. దనుజునిచేతఁజిక్కి జనితంబగుశోకమునందుస్రుక్కునా
జనకసుతావిలాపమునుసమ్మతిమాన్పఁగఁగోరివచ్చెనీ
యనిలజుఁడేవెలుంగనదనో నెయటంచుమదిందలంచిచ
య్యనఁజనెనోయనంగనపరాంబుధిఁగ్రుంకెనినుండునత్తఱిన్. ౧౦.

క. భూరితరారుణమైసం
ధ్యారాగంబంబరమునఁదగనొప్పారె
న్మారుతమువీవఁదొడఁగెన
పారంబుగఖగములునికిపట్లంజేరెన్. ౧౧.

సీ. రాజ్యలక్ష్మిదొఱంగినరమణదక్కె
లంకయుబ్బంగిఁగన్పడునింకనన్న
కరణిదిశలెల్లగాఢాంధకారమెచ్చి
కలయఁబర్వెనువేతెఱఁగానరాక. ౧౨.

క. మేలగునరుగుముదనుజుల
నేలంగూల్పుమనిసురలనిలజునిమీఁదన్
లీలంజల్లినముత్తెపుఁ
బ్రాలనఁగాఁదోఁచెమింటభములమితములై. ౧౩.

మ. తమమంతంతఁ దొలంగ జక్కవల మొత్తంబుల్మదిం గ్రుంగ సాం
ద్రము నీరమ్ములు పొంగ జారిణుల చిత్తంబుల్గలంగన్వాసం
గుముదంబుల్పరసిం జెలంగ దశదిక్కుల్తేజరిల్లంగఁ గం
జములున్వ్రాడి ముడుంగ నింగిన పుడుం జంద్రుండు దోఁచెన్ దగన్. ౧౪.

క. పవనజుఁ డవనిజ నారయ
దివిజులు వెట్టించినట్టి దీపంబనఁగా
భువినెల్లడల వెలుంగుచుఁ
బవలుగ నొనరించి కుముద బాంధవుఁ డొప్పెన్. ౧౫.

గీ. అంత మారుతి రామపదాంబుజముల
మదినిఁ గీల్కొల్పి మార్జాలమాత్రుఁ డగుచుఁ
దనువు దాఁచు కలంక యుత్తరపు ద్వార
మలవడఁగఁ జొచ్చి చనుచున్న యవసరమున. ౧౬.

క. పెనుభూతము వడువున నొక
దనుజాంగన ఘోరశూలధారిణి యగుచుం
జను దెంచి యడ్డమై తన
కనుఁగొనలం దగ్నులొలుకఁగా నిట్లనియెన్. ౧౭.

క. ఎవ్వఁడ వీవగ చరయి
ట్లివ్వననిధి దాఁటి లంక కెంతే వడితో
నెవ్వరి పంపున వచ్చితి
వవ్విధ మెఱిఁగింపుమని యనిలజుఁ డనియెన్. ౧౮.

క. కడు వడి గానడ్డంబై
పొడ సూపితివెవతె వీవిపుడు నిజమెఱుఁగ
న్నుడువు మనాదు తెఱంగే
ర్పడఁ దెల్పెదఁ బిదప ననిన రక్కసి వల్కెన్. ౧౯.

గీ. రావణునియాజ్ఞనెపుడీపురంబునందు
    నలయుచుండుదులంకిణియంద్రువినుము
సురవరులకైననుమీఱిచొరఁగ రామి
    నరయకిటురాఁదగునెవనచరుఁడనీకు. ౨౦.

వ. అనిన హనుమంతుం డిట్లనియె. ౨౧.

క. ఇయ్యెడఫలములుమిగులం
    దియ్యనయనవినియునేగుదెంచితినీఁకనో
తొయ్యలినన్నుఁబోనిమ్మని
    చయ్యనఁజనుచుండఁగాంచిసరభసమొప్పన్. ౨౨.

క. శూలముఁజేకొనిలంకిణి
    కాలాగ్నిజ్వాలలొప్పఁగామండుచువా
తూలతనయువక్షంబును
    దూలంబొడువఁగనతండుదోర్బలశక్తిన్. ౨౩.

క. కరముష్టిఁబూనిలంకిణి
    యురమునసడరింపనదియునుబ్బుదొలంగ
న్ధరణీస్థలిఁబడిహీన
    స్వరమునసగ్గించియనిలజాతునకనియెన్. ౨౪.

క. మునుగమలజుండునాతో
    ననియెంగపివర్యుఁడొక్కఁడరుదెంచినిను
న్దనముష్టిఁబొడుచునాఁడే
    దనుజక్షయమగునటంచుఁదప్పదరుగుమా. ౨౫.

వ. అని పల్కి దీవించి లంకిణి నిజదేహంబుఁ బాసి సుగతిం జెందె నంత
నాంజనేయుండు. ౨౬.

క. బలుముష్టి వలనలంకిణి
 నిలఁగూలిచిసురలవినుతులెసఁగఁగమదిలోఁ
జెలఁగుచురాఘవుపదములఁ
 దలఁచుచురావణునిరాజధానింజొచ్చెన్. ౨౭.

వ. ఇట్లు చొచ్చి. ౨౮.

సీ. కొమరొప్పబంగారుకోటలఁగొమ్మల
 గోపురంబులమణికొత్తళముల
వీథులరచ్చలవిఫణిమార్గంబుల
 నుప్పరిగలఁజల్వచప్పరముల
శరరథహయగజశాలలమేడల
 హర్మ్యతలముల దేవాలయములఁ
జారుసౌధములభండారపుగృహముల
 గొప్పమండపములఁగుట్టిమముల
మంత్రులనికేతనములసామంతులిండ్లఁ
 దంత్రపాలుర నెలవులఁదగుతెఱఁగుల
సందుగొందుల నెల్లనిస్సంశయముగ
 సరసిజనకజఁగానకయనిలసుతుఁడు. ౨౯.

సీ. అలవిభీషణుగేహమతికాయునిలయంబు
 దేవాంతకునియిల్లుత్రిశిరునునిక-
కుంభకర్ణునిసెజ్జకుంభునిసదనంబు
 మఱియునక్షకుమారుమందిరంబు
ఇంద్రజిత్తునిఘనహేమనివేశనా
 యగ్నివర్ణునివిశాలాలయంబు

అతిబలుండైననరాంతకువేశ్మంబు
ధైర్యాబ్ధియగుమహోదరునినగరు
జంబుమాలినిశాంతంబుసర్వరోము
భవనమండనంబమ్మహాపార్శ్వసద్మ
మాదిగాఁజనియందందునవనిజాత
నారయుచుఁగానఁగాలేమినవలఁజనుచు. ౩౦.

సీ. వరులతోఁబెనఁగెడువనితలనుపరతి
సేయుచేడెలనిద్రఁజెందుచెలులఁ
బాలయల్కఁగాంతులనలయించుకొమ్మల
మధుగ్రోలిసొక్కినమానవతుల
నింపుగావీణవాయించెడుభామల
హాయిమీఱఁగఁబాడునలరుఁబోండ్ల
నృత్యంబొనర్చెడునీలాహివేణుల
విటులకైతిరిగెడువెలఁదుకలను
గాంచుచునుసీతపోవడిఁగానలేక
కరువలిసుతుండుపురమెల్లఁగలయవెదకి
రావణాంతఃపురమునధారాళముగను
నడచికక్ష్యాంతరంబులుగడచికడచి. ౩౧.

మ. సురగంధర్వపతంగయక్షవసురక్షోగుహ్యకాహీంద్రకి
న్నరసాధ్యాంగనలెల్లనొక్కమొగిదీనత్వంబునంగుందుచు
న్నిరతంబుంజెఱనున్నశాలలవెసన్నేర్పొప్పఁజర్చించితా
నరుదారావణుకేళిమందిరముడాయంబోయియందొక్కచోన్. ౩౨.

క. అలకాపతితోడనుము
న్నలుకన్సంగరమొనర్చియసురాధీశుం

డలవడఁగఁగయిక్కొనినని
    ర్మలతరమైనట్టిమణివిమానమునందున్. 33.

సీ. నిరుపమంబగురుజ్మణిదీపకళికలు
    బలసియిర్వంకల వెలుఁగుచుండ
మెయినలందినదివ్యమృగనాభిగంధంబు
    ఘుమ్మనిదిశలెల్లఁ గ్రమ్ముకొనఁగఁ
గరకంకణంబులుగల్లుగల్లనిమ్రోయ
    రమణులునాలవట్టములువీవ
నరగనుమోడ్పులనతివలుదూఁగుచు
    మత్తతఁబదములనొత్తుచుండ
నమరగంధర్వసతులుగానములుసలుప
    నీటుమీఱఁగసుమశయ్యనిద్రఁజెందు
రావణునిఁబొడఁగాంచియారాయటంచు
    మెచ్చితలయూఁచిహనుమంతుఁడిచ్చనపుడు. 34.

క. ఈమహితభోగసంపద
    లీమహిపైఁగలయఁద్రోసెనిన్నీ చూఁడుశ్రీ
రామునిభుజవిక్రమములఁ
    దామదినిసుమంతమైనఁదలఁపకయకటా. 35.

క. అనితలఁచుచుదనుజునిశ
    య్యనుజలదముపొంతఁగాననగుమెఱుఁగుక్రియ
న్గనుపట్టెడుమందోదరి
    ననిలజుఁడటుకాంచిసీతయనుభ్రమఁదోఁపన్. 36.

క. సీతనుబొడఁగంటినిబ్ర
    ఖ్యాతివహించితినిధరణిఁగాకుత్స్థునకు

స్త్రీరతియొనర్చితినని కపి
జాతివికారములుఁ గొంతసలుపుచుఁ బిదప౯. ౩౭.

గీ. మఱియుఁ దెలివొంది శ్రీరామమహీపభూమి
జాతజనకనృపాత్మజసత్యచరిత
దానవునిఁ గోరునే మధుపానియకట
యిట్లు నేనేల భ్రమఁగొంటి నెఱుకమాని. ౩౮.

వ. అని మదిం దూఱుచు నవ్విమానంబునం దనేకసుందరీమణుల సురాధినాథు ననంగసంగరంబునం బెనంగి సొక్కించి పుచ్చి సొమ్మసిల్లి యుండంమఁ బవ్వళించి కుచంబులం బయలుపఱచి వలువలు దొలంగించి తొడలమెఱుంగులు దెలియం బొరలుచు నిద్రించుచుండుటం గాంచి యాంజనేయుండు మనంబున రామకార్యార్థం బీ రామల మర్మంబులం గంటి నొండు గా దని తలంచి యంతఃపురం బంతయు నారసి మనుజభామ నెందుఁ గానమికి వగచుచుం బురంబు వెడలి తత్సమీపంబున హాటకమయమహావప్రవేష్టితం బై యొప్పునుద్యానంబుఁ బొడఁగాంచి డగ్గఱి. ౩౯.

గీ. కోటపైనెక్కి మెల్లనఁ దోఁటకరిగి
కడఁగి కావలివారలు గానరాక
ఫలకుసుమసంభరితమగు పాదపముల
నపుడు కనుఁగొని మెచ్చుచుఁ గపికులుండు. ౪౦.

చ. కొలఁకులఁ గాంచి మించి ఘనకూలములం బరికించి గొప్పలౌ
పులినతలంబులం దఱిసి పూఁబొదలన్గని కేళికాగృహం
బులఁ దిలకించి సాలములపొంత విలోకనమాచరించి తా
నలయుచు నల్లనల్లనుచు నచ్చటికచ్చటికేగి చూచుచు౯. ౪౧.

క. ఆవనమధ్యంబునన
ప్పావనిపొడఁగని యెదనుజభటులెల్లపుడున్
తానుగవసింపనున్నత
మైవెలసెడుపసిఁడిమేడ నద్భుత మొప్పన్. ౪౨.

వ. అమ్మందిరంబునం దెల్లెడలం దిరిగి ధరణిజం గానక మహాచింతాకులితస్వాంతుం డగుచు నాంజనేయుండు దనమనంబున నిట్లని వితర్కింపం దొణంగె. ౪౩.

సీ. లంక నెయ్యెడలనిశ్శంకతనరసియు
జనకజ నేఁగానఁజాలనైతి
దనుజుఁడంబరగతిఁ దనుఁదెచ్చుచోఁ దప్పి
యంబుధిఁ దూలెనో యలంతఁ జెంది
విభు నెడఁబాసిన విరహాగ్ని చేఁజిక్కి
మడిసెనో తనువుపై మమత మాని
కాకున్న నిచ్చటి కఠినరాక్షసులను
గనుఁగొని నీల్గెనో కడుభయమున
నిద్దురాత్మకుఁ డెచ్చటికేని దాఁచఁ
బంచెనో యొరులకుఁ గానఁబడకయుండ
నింక నే మొనరింతు నెట్లింతిఁ గాంతు
భానుకులజునితో నెట్లుపలుకరింతు. ౪౪.

చ. జనకజఁ గాననైతి నన జయ్యన రాఘవుఁ డీల్గు నన్నకై
యనుజుఁడు మ్రంగు వీరిఁ గనినప్పుడె భానుజుఁ డంగదాదులె
ల్లను మడియంగఁ జొత్తురవలన్ మునివృత్తి నిగాననంబునం
బనివడి యేఁ జరింతునొకొ భావమునం దెటు సైఁతు నక్కటా. ౪౫.

వ. అని పెద్దయుం బ్రొద్దు చింతించి ధైర్యం బవలంబించి హనుమం
తుండు దనమనంబున మఱియు నిట్లనియె. ౪౬.

చ. సురపతిముఖ్యదిక్పతులశూరతఁబట్టికలంతునొండెనీ
ధరణిసమస్తశైలసహితంబుగవ్రక్కలొనర్తునొండెది
ద్దిరఁదిరుగంగలంకనుదధిన్బడఁద్రోయుదునొండెనిట్లునా
వరబలశక్తిఁజూపసురవర్యులుమైథిలిజాడఁదెల్పరే. ౪౭.

గీ. ఇట్లుసేయుదునని మది నెంచియచటి
మేడపైనెక్కిమఱితత్సమీపభూమి
నలరుచున్నయశోకవనాంతరంబు
నందునొక్కధరిత్రీరుహంబుక్రింద. ౪౮.

సీ. కన్నీరుమున్నీటికాల్వలైపాఱంగఁ
బొగలుచుఁబలుమాఱువగచివగచి
హారామహారామయనిచీరివేసారి
ధరణీస్థలినిదూలిపొరలిపొరలి
కరముఁజెక్కిటఁజేర్చికడుచింతలకునోర్చి
నిట్టూర్పుపుచ్చుచునిలిచినిలిచి
దేహంబుపైరోసిదిక్కులఁబరికించి
కుటిలభావముదోఁపగుందికుంది
మహిబిడాలసమూహంబుమధ్యమునను
గడగడవడంకురాచిల్కకరణిదోఁప
నసురకాంతలనడుమనుదెసఁదొరంగి
యున్నజానకిఁగాంచివాయుజుఁడుమించి. ౪౯.

గీ. ఈపొలంతిచూడభూపుత్రిగాఁబోలు
ననితలంచిమేడనపుడుడిగ్గి

యతిముదంబునొందియంగుష్ఠమాత్రుఁడై
    యనిలజుండశోకవనముఁజొచ్చె. ౫౦.

వ. ఇట్లతిలాఘవంబున నద్దైత్యకామినీనివహంబునకుం గానంబడకుండం జని తచ్ఛింశుపావృక్షం బెక్కి తదీయశాఖాగ్రంబునందుండి. ౫౧.

క. ఉడుగనికన్నీరొలుకఁగ
    నడలుచుహారామరామయనురవమెసఁగ
న్నుడువుచుదానవకాంతల
    నడుమన్విలపించుచున్ననాతింగనియెన్. ౫౨.

వ. ఇట్లపారం బగుదుఃఖార్ణవంబున మునింగి దరిఁ గానం జాలక పలవింపుచున్న ధరణీతనూజాతం గాంచి యాంజనేయుండు మనంబునం దత్తఱింపుచు నమ్మానినీమణిశోకంబు నివారింప సమకట్టి సమయం బరయుచుండె నంత. ౫౩.

సీ. రావణుండారాత్రిరాజీవముఖసీత
    పైఁగోర్కిఁదనమదిఁబట్టలేక
వేవేగమేల్కనివివిధమాల్యాంబరా
    భరణాద్యలంకృతుల్వరఁగఁజేసి
సరిఁగూడిదేవసుందరులుసితచ్ఛత్ర
    చామరంబులనూనిప్రేమనడువఁ
గరదీపికలువట్టియురగకన్యామణు
    ల్పార్శ్వభాగంబులబలసికొల్వఁ
దవిలిగంధర్వసతులుగీతములువాడ
    నపుడుమందోదరియువెంటనరుగుదేర
నయ్యశోకవనంబునకబ్బురముఁగ
    నేగుదెంచిధరాసుతకెదుటనిలిచె. ౫౪.

క. వచ్చినదనుజునితమకం
బిచ్చందలపోసివగచియెంతయుఁగ్రోధం
బెచ్చితలవాంచియుండఁగ
నచ్చెలువంజూచిరావణాసురుఁడనియెన్. ౫౫.

సీ. వెలఁదినీవేటికివికృతవేషంబున
నడలుచునుండెదవనుదినంబు
నీరూపవిభవంబునీవిలాసంబుక
న్నీటిపాలొనరింపనీతియగునె
సకలసంపదలనాసరిఁబోలరింద్రాదు
లన్నియునీదిగానెన్నఁదగదె
వలయుభోగములనవ్వారిగామదిమెచ్చి
కొల్లలాడుముప్రియముల్లసిల్ల
నింకనీబేలతనమేలయింతులెల్ల
నిన్నుఁగొలువంగనన్నేలునిక్కువముగ
మంకుతనములుమానినిశ్శంకఁబూని
రమ్మునామందిరమునకురాజవదన. ౫౬.

క. రాముఁడురాఁగలఁడంచును
గోమలితలపోయవలదుకుతలమునందుం
గామచరత్వముమనుజుల
కేమాడ్కినగలుగనేర్చునెఱుఁగఁగరాదే. ౫౭.

మ. పురుహూతప్రముఖాదితేయగణములొప్పారంగలేకేనిరం
తరమున్భృత్యులభంగిఁగొల్చెదరుకాంతారంబునంజేరిత్రి
మ్మరురాముండుపయోధిదాఁటియిటకేమార్గంబునన్వచ్చిభీ
కరవృత్తిన్ననుగెల్వనేర్చునరభోజుల్గారెదైత్యోత్తముల్. ౫౮.

క. అడియాసలేలయింక
　　న్విడువుము రాఘవుని సుమతవేడుక మాటల్
న్నుడువుచు మది మెప్పింపుచుఁ
　　బడతీనను గూడి భాగ్యపదవిం గనుమా. ౫౯.

వ. అని యిట్లు మదాంధుం డై కామోద్రేకంబునం బల్కు రావణుని పల్కులు ములుకులం బోలి కర్ణరంధ్రంబులు గాఁడిన ఘోరదవానలంబు కరణి మండుచు నప్పరమపతివ్రతాతిలకం బగు జానకి తృణంబుఁ గేలం బూని యిట్లనియె. ౬౦.

క. పాపపు దనుజుఁడ యిటువలె
　　నాపతియగు రాముఁ బాసి నన్నిచటికిఁ దే
నోపితివి విధియొకగెలుపని
　　యీపగిదిం బ్రేలనేల నెఱుఁగని బుద్ధిన్. ౬౧.

క. పరసతినిఁ గోరు చెనఁటికి
　　సిరియున్నా యువు సుగులము చెడునటుగాన
న్నరగుననన్నాసఁగి నృపతి
　　వరు శరణము జొరుము నిన్న వశ్యముఁ గాచున్. ౬౨.

క. రాముఁడసుర సందోహావి
　　రాముఁడు సర్వభువనాభిరాముఁడు సుగుణ
స్తోముఁడు పటుఘోరాహవ
　　భీముఁడు నీవతని గెల్చు బిరుద వె చెపుమా. ౬౩.

చ. క్షితిపరసీరుహాప్త కులసింధుసుధాకరుఁడస్త్రశస్త్రసం
　　తతులకు సద్గురుండు భుజదర్పిత ధైర్యపరాక్రమోజ్జ్వలుం
　　డతులిత భోగ భాగ్యవిభవాతిశయంబుల మేటి రాఘవుం
　　డతనికి నీకు హస్తిమశకాంతరమౌఁగద పోల్పరావణా. ౬౪.

గీ. వనధిబంధించివచ్చిసీతనువ్రచ్చి
భూతబేతాళములకుసంప్రీతినొసఁగి
లంకనిర్మూలమొనరించిలావుమెఱసి
రాఘవుఁడునన్నుఁగొనిపోవురాజసమున. ౬౬.

వ. అనిన విని రావణుండు రోషతామ్రనేత్రుండై బాడబానలంబుభంగి మండుచుఁ జంద్రహాసంబుఁ గేలం గొని జానకిం దెగవ్రేయం గమకించుటయు గడగడ వడంకి మహాభయోద్రేకం బందుచు.

క. హా రామరామయనుచు
న్బొరునవేడ్చుచునుసీతపుడమిం బడఁగా
నారసియామందోదరి
వారించెన్విభునియిట్లువలదనిబలిమిన్. ౬౭.

గీ. అంతఁబోవక రావణుఁడాగ్రహమున
నచటఁగావలియుండుదైత్యాంగనలను
జూచిమాసద్వయముననాసొమ్ముఁజేయుఁ
డట్లుకాకున్నవధియింపుఁడనుచుఁబల్కి. ౬౮.

క. పురమునకరిగినదానవ
తరుణులుపలుమఱుఁగడంగితమతమనేర్పు
లెఱయఁబ్రబోధించుటయును
ధరణిజవినరామిఁ జేడ్వఁదలకొనునంతన్. ౬౯.

గీ. త్రిజటయనునాతిమైథిలిదీనదశను
గాంచిమదికోర్సియందుండకయతోలంగి
యరిగినిద్రించిమేల్కనియచటికంత
మఱలఁజనుదెంచిదనుజరామలకునని యె. ౭౦.

క. కలకంఠులారవినుఁడో క
కలఁగంటి్రాఘవుండుగజరాజముపై
నెలకొనియనుజుఁడుచామర
ములువీవఁగఁదూర్యనాదములతోఁ రాఁగన్. ౨౧.

గీ. రావణాసురుండురక్తసిక్తాంగుఁడై
కనులజలములొలుకఖరమునెక్కి
దక్షిణంబుననఁగదనుజులంబుధిఁగూల
నెఱిఁగికాంత లెల్ల నేడ్వఁగంటి. ౨౨.

క. నాకలదప్పుడువినుఁడా
కాకుత్స్థునకిపుడుజయముగలుగుటయెనిజం
బీకాంతనెందుపల్కక
మీకడలంజనుఁడటన్న మెలఁతుక లెల్లన్. ౨౩.

క. నిమురింపనరిగిరంతట
నదయుండైతన్నుఁజంపనాజ్ఞయొసఁగునా
త్రిదశారిపల్కు లెల్లను
మదిఁదలఁచుకవగవఁదొణఁగె మైథిలియపుడున్. ౨౪.

గీ. జనకభూపాలునింటనుజననమంది
తనరిదశరథుకోడలన్ ఘనతఁగాంచి
రాముభార్యయనఁగనభిరామనయ్యుఁ
గఠినదైత్యులచేఁజావఁగలిగెనకట. ౨౫

చ. ననుదనుజుండుదెచ్చుటయునాప్రియనాయకుఁడైనరాముఁడ
వ్వనమునదీనభావమునవంతలఁగుందుచునెందుఁబోయెనో
కనుఁగొనఁగల్గు టెన్నఁడొకో కట్టిఁడిదైవమునేఁడువీనిచే
తనుబడిచావుమేగునని తాలిఖియించెనిఁకేమిసేయుదున్. ౨౬.

గీ. దశరథాత్మజుఁడంబుధి దాఁటినన్ను
మఱలఁగొనిపోవునెడు నీమాటకల్ల
దీర్ఘకుంతలములఁ గంఠదేశమునను
వేఁగఁగీలించి ప్రాణంబు విడుచుటొప్పు. ౭౭

గీ. అనుచు నురిఁ బ్రోసికొనసీత యొనయఁగాంచి
యింకఁ దడయంగరాదని పొంకమలర
మ్రానిమీఁద నెయుండి యమ్మగువతోడఁ
బవనతనయుండు మానవభాషననియె. ౭౮

ఉ. ఓ వసుధాతనూజ విను మొప్పఁగ రాముఁడు మాల్యవంతము
న్నావెనరించి మర్కటభటప్రకటంబుగనున్న వాఁడిఁకన్
రావణముఖ్యదైత్యుల దురంబున నుక్కణఁగించి నిన్నుఁ గొం
పోవునవశ్యమిప్పలుకు బుద్ధి నెఱుంగఁగదమ్మ కోమలీ. ౭౯

క. అనియ శరీరికరణిఁ బ
ల్కినవిని తలయెత్తి కాంచి కీడుగఁ గలలో
వనచరముఁ గంటిననుచును
దననిద్రయెఱుంగమికిని దలఁకుచు మఱియున్. ౮౦

గీ. ఎచటనుండివచ్చె నీయగచరుఁడు నా
బాంధవుండువోలెఁ బలుకఁదొడఁగె
మనుజభాషలుర్వి మర్కటం బెఱుఁగునే
దనుజమాయలివియుఁ దలఁపననుచు. ౮౧

క. జనకజదలవాంచుటయు
న్దనునమ్మిమి నెఱిఁగి వాయుతనయుఁడు వృక్షం
బనువునడిగి వచ్చి నిలిచి
వనజాక్షిం గాంచి మ్రొక్కి వలగొని తెలిపెన్. ౮౨

గీ. అమ్మహీకూర్మిపతినినిన్నలరఁగూర్పఁ
జాలుబంటనునామాటసత్యముగను
మదినెఱుంగుమిదిమెరామమనుజవిభుని
యంగుళీయకమనిచూపనతివపలికె. ౧౩.

క. దనుజులమాయలవలనన్
ఘనతరదుఃఖంబులొందుకతమునఁశ్రీరా
మునియుంగరంబుఁగనులం
గనినిజమనినమ్మఁజాలకపివరవినుమా. ౧౪.

ఉ. సీతలిదంద్రులెవ్వరిలసీయునికెయ్యెడ నేక్రమంబునన్
భూతలనాథుఁడైనరఘుపుంగవుసఖ్యమొనర్చినాఁడవీ
వాతనిసుందరాకృతియునర్మిలిసోదరురూపరేఖలె
ట్లీతఱిఁదెల్పెదేనిఁదగనెంతునునిశ్చయబుద్ధిఁదోఁపఁగాన్. ౧౫.

వ. అనిన జానకిం గాంచి యాంజనేయుం డిట్లనియె. ౧౬.

క. అనిలునివరమునననంజన
యనువనచరకాంతగాంచినట్టితనయుఁడ
న్హనుమంతుఁడనెడివాఁడ
న్వినుమర్కజుమంత్రినగుచువెలయుదునిలలోన్. ౧౭.

గీ. అతనిభార్యనుగైకొనియగ్రజుఁడగు
వాలిసుగ్రీవుఁదోలధీవరులతోడ
నపుడుపరతెంచిఋశ్యమూకాద్రిఁజేరి
యొనరసచ్చోటనుండుచోనొక్కనాఁడు. ౧౮.

సీ. దండకాటవిలోనదశరథాత్మజులవం
చించిరావణుఁడునిన్గొంచురాఁగ

నా వేళఋశ్యమూకాద్రిపైమముఁగాంచి
　　పొలఁతినీతోడవులుముడిచివైచి
వచ్చితివదివుచ్చివలనొప్పదాఁచితి
　　మంతటరాఘవుండనుజుఁగూడి
చింతింపుచునువనసీమఁగ్రుమ్మరుచువే
　　చనుదేరఁగాంచినేనినజునకును
సఖ్యమొనరింపవాలినిసంహరించి
　　పరఁగసుగ్రీవునకురాజ్యపదవినొసఁగె
నట్టిరామునియాజ్ఞకైయతఁడుగినిసి
　　నగచరులనిన్నరయఁబంచెనలుదెసలకు. ౮౯.

గీ. దక్షిణంబునకేముగొందఱముఱాఁగ
　　వారినటుడించియేమించివార్ధిదాఁటి
కదిసిలంకాపురంబెల్లఁగలయవెదకి
　　వనములోపలనినుఁగంటివాలుఁగంటి. ౯౦.

వ. అని పల్కి హనుమంతుండు ధరణీసుతం గాంచి మఱియు ని ట్లనియె.

క. రామునివరసౌందర్యం
　　బేమనివర్ణింపనేర్తునెఱిఁగినయంతం
గోమలితెల్పెదవినుమా
　　నీమదిసంచేహమెడలనిక్కంబలరన్. ౯౧.

సీ. సురుచిరనీలాభ్రశుభకరాంగమువాఁడు
　　కమలపత్రవిలోచనములవాఁడు
పూర్ణేందుమండలస్ఫురితాననమువాఁడు
　　లలితజటావల్కలములవాఁడు

కీర్తింపదరసమగ్రీవంబుచెలఁగువాఁ
డాజానుబాహువులలరువాఁడు
చక్కనిపీనవక్షస్స్థలిగలవాఁడు
కంఠీరవావలగ్నంబువాఁడు
భానువంశాబ్ధిచంద్రుండుపటుబలుండు
సకలలోకైకశరణ్యుండుసద్గుణుండు
రమణిరఘురాముఁడాదినారాయణుండు
పొగడఁదరమానభాషాధిపునకునైన. ౯౩.

గీ. ఆతనికిసోదరుండుహేమాంభగాత్రుఁ
డరికులారణ్యఘోరదవానలుండు
చండకోదండమండితోద్దండభుజుఁడు
లక్ష్మణుఁడెన్నఁగాశుభలక్షణుండు. ౯౪.

వ. అని రామలక్ష్మణులరూపసౌందర్యాదిగుణవిశేషంబు లెఱింగింప నిజం బెఱింగి యంతరంగంబున నుప్పొంగి జానకి యా ప్లవంగపుంగవుం డొసంగినయంగుళీయకం బుత్తమాంగంబున నిడికొని యపాంగంబుల నొత్తి యక్కునం జేర్చి మూర్ఛిల్లి క్రమ్మరం దెలి వొంది యాంజనేయుం గాంచి యిట్లనియె. ౯౫.

గీ. అనిలసత్పుత్ర రామునియంగుళీయ
కంబుఁగనినంతనాఁడుజీవంబుమఱలె
నీకతంబునబ్రతికితినిశ్చయముగ
నిందుకేనేమిప్రతిసేయనెఱుఁగనయ్య. ౯౬.

క. కాకుత్స్థునికరుణన్నతి
యాకల్పంబుగనువెలయుమనిదీవింప

న్లోకైకమాతయగుసీ
తాకాంతన్గాంచిపవనతనయుఁడునతుఁడై. ౯౭.

గీ. అబ్జభవభవముఖ్యులకందరాని
నీదుసత్కృపఁబడసితినిన్నుఁజూడఁ
గంటినాజన్మమీడేఱెఁగడమలేక
పావనుఁడనైతినసీతవలికెమఱియు. ౯౮.

క. అనఘాత్మరామభద్రుఁడు
ననుఁబాసినమొదలుతామనంబునఁజింతం
బెనఁగుచుననుజునిఁగూడుక
వనమునసైరించియున్నవాఁడేచెపుమా. ౯౯.

వ. అనిన హనుమంతుం డి ట్లనియె. ౧౦౦.

సీ. నినుఁబాసినదిమొదల్నిమిషమాత్రంబేని
మదినూఱడిల్లఁడుమనుజవిభుఁడు
హాసీతహాసీతయనుదీనరవమునఁ
బలుమాఱువిలపించుఁబరితపించుఁ
గన్నులబాష్పముల్గ్రమ్మఁగానేడ్చుచుఁ
బుడమిపైఁబడిమూర్ఛఁబొందులేచు
నాహారనిద్రాదులన్నియువర్జించి
యెనలేనివిరహాబ్ధినీఁదుచుండుఁ
గాననేఁజనినీవార్తఁగ్రమముదోఁపఁ
దెలుపవినిరామభద్రుండుదటవుఁబెంచి
వనచరులఁగూడివచ్చిరావణునిఁద్రుంచి
నిన్నుఁదోడ్కొనిపోవుటనిజమువినుము. ౧౦౧.

వ. అనిన జానకి రాముని దలంచి శోకించి పావనిం గాంచి యి ట్లనియె.

క. పుడమీశుఁబాసినేనీ
యెడననిలజపడెడునిడుమ లెల్లనిపుడునీ
వెడయకకనినదియేకద
తడయకచనిపతికిఁదెల్పఁదగునీకనఘా. ౧౦౩.

క. పదినెలలుగడయఁద్రోసితి
వదలకబాధించుదైత్యవనితలచేఁబెం
పొదవఁగనికనోర్వఁగలే
నిదిసమయమునన్నుఁబ్రోవనినకులజునకున్. ౧౦౪.

క. మునుచిత్రకూటముననసుఁ
జెనకినకాకంబుపైనిశితశరరాజం
బునుబఱపినట్టిమక్కువ
మనమునమఱవవలదనుచుమారుతిచెపుమా. ౧౦౫.

క. ననువిడువకరక్షించెద
ననియనలముసాక్షిగాఁగనలరవివాహం
బునజనకునిచేఁగొనియి
ట్లనదంగావించుటొప్పదనుముకపీంద్రా. ౧౦౬.

చ. తనకులకాంతనొక్కరుఁడుదాఁగొనిపోవఁగనూరకుండుటెం
దునుమగపాడిగాదధికదుర్యశమాననియుంటిఁగాకనా
మనమునఁదావకాంఘ్రులఁగ్రమంబుననిల్పినదాననంచునే
ననుటలుగాఁగనీవుతగనారఘువీరునకేర్పరింపుమా. ౧౦౭.

క. అదిగాకలక్ష్మణునితోఁ
బదపడివినిపింపుపరమపావనుఁడవుని
న్నదయతఁబల్కినఫలముం
గొదవఘటింపకయచాలఁగుడిచితిననుచున్. ౧౦౮.

క. మారుతినీవెచ్చోనే
మాఱకచనిరాఘవులనుమర్కటవిభునిం
జేరివినిపించివేగమె
వారలఁదోడ్తెమ్ముపొమ్మువాయుజవమునన్. ౧౦౯.

వ. అనిన వాయుజుం డిట్లనియె. ౧౧౦.

గీ. రాఘవులఁదోడితెచ్చెదరమణినేను
రిక్తకరమునఁబోవుటయుక్తమగునె
నీశిరోరత్నమొసఁగుమునిజముదోఁప
ననినజానకివల్కెనాఘునునితోడ. ౧౧౧.

క. నీవిసుమంతగఁదోఁచెద
వీవననిధినెట్లుదాఁటితెలుఁగఁగనాకుం
బావనినీనిజరూపం
బీవిధమనిచూపురత్నమిచ్చెదననినన్. ౧౧౨.

గీ. భువికినభమునకేకమైపొడవుచూపి
పరఁగనక్షత్రపఙ్క్తితోనొరసికొనుచు
భూరితరకాయుఁడైవాయుపుత్రుఁడలరె
విశ్వరూపంబుఁగైకొన్నవిష్ణుఁడనఁగ. ౧౧౩.

వ. అంత నయ్యగచరోత్తమునద్భుతాకారంబుఁ గని జానకి మనంబున భయం బంది ప్రార్థించుటయు నతండు యథారూపంబుఁ గైకొని ప్రమొక్కినం జేరం బిలిచి నిజశిరోరత్నం బొసంగి దీవించి పుచ్చిన వీడ్కొని యమ్మారుతి తనరాక రావణున కెఱింగించికాని యూరకె చనుట యుచితంబు గా దని తలంచి తద్వనంబునం బ్రవేశించి.

క. ఒకతరువుఁబెఱికిభూరుహ
నికరంబులపైనివైవనిలిచినవఖిలం

బొకటొకటి నెరసికొనుచు
న్సకలమునిర్మూలమయ్యెసరభసమొప్పన్. ౧౧౫.

గీ. సీతవెలసియున్న శింశుపావృక్షంబు
దక్కఁదక్కనట్టితరుల నెల్ల
నేలపాలొనర్చెనిమిషమాత్రంబున
వాయుజుఁడుప్రచండవాయువనఁగ. ౧౧౬.

వ. ఇట్లమితబలోత్సాహంబులు నిగుడ విజృంభించి యశోకారామంబు విరామం బొనర్చుటయుఁ దన్మహీరుహంబులం గల సకలపక్షికులంబులు కలకలధ్వానంబులు సెలంగ నలుగడలం బర్వఁ దదారావంబు విని వనపాలకు లగుదైత్యజాలంబులు దిగ్గన మేల్కాంచి కరవాలంబులం గైకొని మారుతిం డాసి. ౧౧౭.

క. పొడువుఁడుపట్టుఁడుకట్టుఁడు
గడుఁగ్రొవ్వునవానరుండుకాననభూమి
న్వెడలిచనుదెంచిమనవన
మడలకపెకలించివైచెనకటాయనుచున్. ౧౧౮.

గీ. ఒండొరులుపైఁగదియ వాయుజుండుచెలఁగి
లావుమెఱయంగనపుడువాలంబుఁబెంచి
పదిఁటినూఱింటివేయింటినదిమిపట్టి
ధరణిపైఁగొట్టిపోవైచెదర్పమొప్ప. ౧౧౯.

వ. ఇట్లనిలజుండు వనపాలు రగునెనిమిదివేలదనుజవర్గంబుల నిరవశేషం బొనర్చిన జానకీదేవియెడం గావలి యుండుదానవాంగనలు వాపోవుచుం బఱచి రావణుం గాంచి తద్వృత్తాంతంబు విన్నవించుటయుం బ్రళయకాలకాలుండునుంబోలె నతండు రోషజాజ్వల్యమానుం డై యిట్లనియె. ౧౨౦.

క. వనచరుఁడెవ్వండంబుధి
ననువుననెబ్భంగిదాఁటెనతిధీరుండై
వనముఁబెకలించిదనుజులఁ
బనివడియెట్టుత్రుంచెఁదెలియఁబల్కుఁడునాతోన్. ౧౨౧.

వ. అనిన దనుజాంగన లిట్లనిరి. ౧౨౨.

సీ. వానరుండొక్కండువలనొప్పఁజనుదెంచి
తొలుతవైదేహితోఁబలుకరించి
తనమేనుబెంచియుద్దండానిలునిఁబోలి
వనమెల్లఁబెకలించివైచిపిదపఁ
గావలివారినొక్కటఁబట్టిపడఁగూల్చి
వెలయుచున్నాఁడువీరుఁడగుచు
రామునిపంపునరాఁబోలుఁగాదేని
ధరణిజవసియించుతరువుదక్కఁ
దక్కినమహీరుహంబులనుక్కుమిగిలి
కలయనిలఁద్రుంచివైవఁగఁగార్యమేమి
యతనిపోవడిజానకినడుగుటయును
దానెఱుఁగనంచుదాఁచెడుదానవేంద్ర. ౧౨౩.

వ అనిన విని రావణుండు మహోగ్రానలుం డన మండి యప్పుడు.

చ. ఎనుబదివేలకింకరులనిద్ధబలాఢ్యులఘోరరూపులం
బనిచినవారహంకృతులభాసిలిపట్టిసశూలముఖ్యసా
ధనములుపూనివచ్చితజ్జీదద్రణముంబరికింపఁగోరిచ
య్యనఁబఱతెంచెనోయననహర్పతిదోఁచెదిశల్వెలుంగఁగాన్.

గీ. ఇనుఁడువ్రేడమునంతనెనలేనికడిమిమై
దనుజభటులునడచియనిలసుతునిఁ

దాఁకియస్త్రశస్త్రతతులనొప్పించుచో
నతఁడెఱింగియప్పుడచలుఁడగుచు. ౧౨౬.

వ. అద్దనుజానీకంబులం గని యిట్లనియె. ౧౨౭.

క. వనచరవిభుఁడగుసుగ్రీ
వునిసచివుఁడరాముబంటనుర్వీసుతకా
మనుజేశుకుశలమేర్పడ
వినిపింపనవచ్చినాఁడవినుఁడనిలజుఁడన్. ౧౨౮.

క. హనుమంతుఁడండ్రునన్ను
న్దనుజకులాంతకుఁడననుచుఁదలఁపకమీర
ల్చెనకియెటుపోవనగునని
మనమునకోపాగ్నిలొలుకమారుతియపుడున్. ౧౨౯.

సీ. వాలమంకించిదైత్యులనోలిఁబట్టి
పృథివిపైఁగొట్టిపీనుఁగుపెంటలుగను
జేసినిశ్శేషమొనరించిచెలఁగిమకర
తోరణమునెక్కివెలసెగంభీరుఁడగుచు. ౧౩౦.

వ. అంత ఫణిహారులవలనఁ దద్వృత్తాంతం బంతయు నెఱింగి క్రోధసం
రక్తలోచనుండై రావణుండు. ౧౩౧.

గీ. ధీరుఁడగుపింగళాక్షునిదీర్ఘజిహ్వుఁ
బ్రబలునశ్మవక్షునిమఱివక్త్రనాసు
బలునిశార్దూలముఖునిఁదద్బలయుతముగ
నరిగియవ్వానరునిఁద్రుంపుఁడనుచుఁబనిచె. ౧౩౨.

గీ. వారలత్యుగ్రగర్వదుర్వారులగుచు
రథగజాశ్వపదాతివర్గములఁగూడి

దిశలుఘూర్ణిల్లఁగడుఁబఱతెంచియుంప
గములనొక్కటఁబావనిఁగప్పనతఁడు. ౧౩౩.

క. కాలునిపాశమనఁగఁదగు
వాలము చేనసురబలమువసుధాస్థలిపైఁ
గూలిచిరథవారణహయ
జాలంబులయురములడిచిజాగ్రతదోఃపట. ౧౩౪.

సీ. ధరణికిలంఘించితగదీర్ఘజిహ్వుని
బిఱబిఱనాలికఁబెఱికిచంపె
వాలంబుననుగట్టివసుధపైఁబడఁగొట్టి
పింగళాక్షునిగ్రుడ్లుపెఱికివైచె
వడినశ్మవక్షునివక్షంబుపెనుముష్టి
నడరించిమించిపెంపుడుగఁజేసె
వక్త్రనాసునిఁగిట్టివరనఖంబులవ్రచ్చి
విసరిభూతములకువిందొనర్చెఁ
దాడరిశార్దూలముఖునిఁగాళ్లొడిసిపట్టి
గిరగిరఁద్రిప్పియంతకపురికిఁబనిచె
నాహవక్రీడలిటుసల్పియనిలసుతుఁడు
తోరణస్తంభమెక్కెసంతోషమలర. ౧౩౫.

వ. అంత హతశేషు లగుదైత్యు లురుజవంబున నరిగి యత్తెఱం గెఱిం
గించిన. ౧౩౬.

సీ. దశకంఠుఁడత్యుగ్రదహనునిగతిరేఁగి
తనమంత్రితనయులైతనరురక్త
రోమునిశతజిహ్వురుధిరలోచనునినా
స్తనితహాస్యునిశూలదంష్ట్రునమిత

ఖలుదుర్ముఖుని వ్యాఘ్రకబళుని వేఁజీరి
వనచరుఁడునిమిరండనుచుఁబనుపఁ
జతురంగబలములసంఖ్యముల్గొలువంగ
నద్దైత్యసప్తకంబపుడుచెలఁగి
వరశతాంగంబులెక్కితీవ్రముగనరిగి
ధరణిగంపింపసింహనాదములమించి
ఘోరశస్త్రాస్త్రజాలముల్గురియుటయును
బావనిచలింపకన్నిటిఁబాయఁద్రోసి. ౧౩౨.

సీ. నిజవాలమునఁజుట్టిగజవాజిసంఘంబు
లొక్కటవిసరుచుఁజక్కడంచి
ఘనసాలమునమేటిదనుజాళినెల్లను
మఱలిపోవఁగనీకమహినిఁగూల్చి
వరరథంబులపైజవంబునలంఘించి
చరణఘాతములచేనుఱుముచేసి
దానవేంద్రామాత్యతనయులనేడ్వుర
దురమునఁనెదిరించిదోర్బలంబు
పెంపలరమించివధియించిపితృగణాధి
నాథుపురిఁజేరఁబంచియున్నతివహించి
తోరణమునెక్కియపుడువాతూలసుతుఁడు
గనుఁగొనుచునుండెరణకేళిఁదనివిసనక. ౧౩౩.

వ. అంతఁ దద్వృత్తాంతంబు విని రావణుం డంతకంతకు నగ్గలంబై ప్రజ్వరిల్లురోషాగ్నిజ్వాలాభీలలోచనుం డై ప్రహస్తామాత్యనందనుం డగు జంబుమాలిం బనిచిన వాఁడును మణిగణదేదీప్యమానం బైనరథంబు నారోహణం బొనర్చి సకలపరివారసమేతుం డై దివ్యాస్త్రశస్త్రాది

సాధనంబులు ధరించి ధనుష్టంకారంబున దిక్కులు పిక్కటిల్లం
జేయుచుం బఱతెంచి యాంజనేయుం దాఁకి కులాచలంబుఁ గప్పువర్ష
ధారలం బోలి శరపరంపరలు గురియ నతండు. ౧౩౯.

క. దనుజునిశరములనెల్లం
దనకరమునఁబట్టివిఱిచిధరణీస్థలికొ
య్యనలంఘించిపెనుశిలను
గొనిదైత్యునివైచెనధికకోపస్ఫూర్తిన్. ౧౪౦.

క. వాఁడంబకదశకంబున
నోడకతచ్ఛిలనడంచియురవడినురము
న్గాఁడనొకశక్తివ్రేయుడుఁ
బోడిమిఁబోవిడకప్లవగపుంగవుఁడలుకన్. ౧౪౧.

క. భూరుహమువెఱికిసరగున
నారాతుసుపైనివైవనతఁడతిధృతిచే
మారుతిశీర్షమువగులఁగఁ
గ్రూరాస్త్రమువఱపియార్చెఁగుతలంబద్రువన్. ౧౪౨.

వ. ఇట్లియ్యిరువురు నన్యోన్యభీషణారావంబులు నింగి ముట్టం జెలం
గింపుచుం బోరునెడ నాంజనేయుండు పాదఘట్టనంబున వానిరథ
రథ్యంబుల నుగ్గొనర్చి ధనుర్దండంబు ఖండించుటయును విరథుండై
యప్పుడు. ౧౪౩.

గీ. వాలుకేలఁబూనిలీలతోఁబఱతేర
నలుకపొడమిమారుతాత్మజుండు
ఘోరముష్టిఁబొడువఁగులిశాహతినిఁబడు
శైలమనఁగజంబుమాలిగూలె. ౧౪౪.

క. తక్కినదైత్యులలోపల
  నొక్కండేనియునునిల్వనోడిపఱచియా
రక్కసులతేనిఁగనియపు
  డిక్కువచెడిజంబుమాలియిలఁగూలెననన్. ౧౪౫.

గీ. వినిదశాననుండువిస్మయమందుచు
  జంబుమాలిఁదలఁచిచాలవగచి
యింకనెవ్వఁడోపునీమర్కటునిఁద్రుంప
  ననుచునాత్మనెంచియార్తిబెంచి. ౧౪౬.

వ. ఇట్లు రావణుండు చింతించి విరూపాక్షయూపాక్షభాసవర్ణప్రఘస దుర్ధను లనుపంచసేనాగ్రగుల రావించి యవ్వనచరాధముం జంపి విజయంబుఁ గాంచి వచ్చునది యని యాజ్ఞాపించి పుచ్చుటయు నప్పుడు. ౧౪౭.

సీ. దనుజులేవురుఁగూడిదర్పోద్ధతినిమీఱి
  రణభేరిమొఱయించిరహినిమించి
యరదంబులెక్కిశస్త్రాస్త్రసంపన్నులై
  కలకలధ్వనులునాకంబుఁగప్ప
వరరథకరిహయవ్రాతయుతంబగు
  సేనలిర్వంకలఁజెలఁగినడవ
సింహనాదంబులుశింజినీటంకృతు
  ల్దిశలెల్లఘూర్ణిల్లఁదీవ్రగతుల
వెడలిచనుదెంచివానరవీరుఁదాఁకి
  శూలముద్గరహలకరవాలముఖ్య
సాధనంబులవైవఁగఁజాలఁగినిసి
  యనిలజుఁడుమింటికెగయదుర్ధనుఁడునెగిరి. ౧౪౮.

క. కడువడిశరములఁ బొదువఁగఁ
బొడువునకుంబోయి వాయుపుత్త్రుఁడసురుపైఁ
బడుటయు వాఁడప్పాటునఁ
బొడిపొడియై పెంపుదూలి పుడమిం బడియెన్. ౧౪౯.

వ. అంత. ౧౫౦.

క. యూపాక్షవిరూపాక్షులు
కోపంబున ముద్గరములఁ గొని వైవంగా
నాపావని తోడ నెదురొ
టోపంబున నెగయుటయుఁ గఠోరత వారల్. ౧౫౧.

గీ. ముద్గరములఁ ద్రిప్పి మోఁదుచుఁ బవమాన
తనయుఁ డెలుక మాసి ధరణిఁ గూలి
తెలిసి యొక్క తరువు ధీరతఁ జేకొని
యెగసి వైచి దనుజయుగముఁ ద్రుంచె. ౧౫౨.

గీ. వారిపాటుఁ గనియ వారితసత్త్వులై
బలసి భాసకర్ణ ప్రఘసులపుడు
వాయుసుతునిఁ గదిసి వరశరవర్షంబు
లడరఁ జేయ నాతఁ డాగ్రహించి. ౧౫౩.

క. కులశైల మొకటి గైకొని
చలమున నా రక్కసులను జక్కడఁచుటయుం
దలలొడలు గానరాకయ
పలుచిద్రుపలుగాఁగఁ బడిరి బహుచోద్యముగాన్. ౧౫౪.

గీ. అంతఁ జిక్కిన బలముల ననిలసుతుఁడు
వాలమంకించి విసరుచు నేలఁ గూల్చఁ

ఘోరఘోరంబుగా నెత్తుటేఱులమరె
భూతబేతాళములకు సంప్రీతిదోఁప. ౧౫౫.

వ. ఇట్లు. ౧౫౬.

గీ. పంచసేనాగ్రగులఁ ద్రుంచి పవనసుతుఁడు
తోరణము నెక్కి వెలసె సంతోషమమర
నంతహతశేషులరుదెంచి యసురనాయ
కునకెఱిఁగింపవినిసభికులకు ననియె. ౧౫౭.

చ. వనచరుఁ డొక్కఁ డెక్కువజవంబున నంబుధి దాఁటివచ్చి నా
వనముఁ బెకల్చి రాత్రిచరవర్గములం బరిమార్చి మించె నె
వ్వని నటుఁ బంచినన్ మఱలి వచ్చుట లేదిది యేమి చిత్రమో
దనుజవధార్థ మంతకుఁడు దా నిటుల య్యెనొ కాన రాదుగా. ౧౫౮.

క. ఏలోకంబున నరసిన
నీలావుఁ జలంబుఁ గలదె యిలఁ గ్రోఁతికి నే
లీల వధియింపఁబడునో కో
చాలన్ వెఱఁగయ్యె వీనిఁ జర్చింపంగన్. ౧౫౯.

క. అని చింతఁ బెనఁగుచుండెడు
దనుజేంద్రునిఁ గాంచి యక్షతనయుఁడు వల్కె
న్ననుఁ బంపుమధిప వేగమె
వనచరునిం బట్టి తెత్తు వదలక యటకున్. ౧౬౦.

వ. అని యిట్లు విధిప్రేరణంబునం బల్కు నక్షకుమారు నగ్గించి జాగ్రత
దోఁప నమ్మర్కటాధముం జంపి రమ్మని రావణుండు దీవించి పుచ్చిన
నతండును. ౧౬౧.

గీ. పసిఁడిరథమెక్కి ఘనధనుష్పాణియగుచు
శింజినీటంకృతులదిశల్ చెవుడువడఁగ

ధరణిగంపింపనేతెంచుదళముతోడ
నక్షుఁడరుదెంచితాఁకెనయ్యనిలసుతుని. ౧౬౨.

క. శరవర్షంబులుగురియుచు
వరబలసంపన్నుఁడగుచువ్రాలెడుదనుజుం
బరికించియనిలసూనుఁడు
సరకుగొనండయ్యెవానిశస్త్రాస్త్రంబుల్. ౧౬౩.

క. ఇమ్మెయిఁదనకాండంబులు
వమ్మైచనుటెఱిఁగిదానవప్రవరుఁడుకో
పమ్ముననొకదివ్యాస్త్రం
బమ్మారుతిశిరమువగులనార్చుచుఁబఱపెఁ. ౧౬౪.

వ. అయ్యమోఘాస్త్రంబు పావనిఫాలంబున నాటి రుధిరప్రవాహంబు తోడ ధరణీతలంబునం బడఁ ద్రోయుటయు నతండు మూర్ఛిల్లి క్రమ్మఱఁ దెలివొంది ప్రళయకాలరుద్రుం డనం బొలిచి వాని రథంబుపై కుఱికి సారథిం దునిమి సైంధవంబులం గూల్చి శరాసనంబు ఖండించి శతాంగంబు శకలంబు గావించిన విరథుండై ధరణీతలంబునకు లంఘించి రోషతామ్రాక్షులు ప్రజ్వరిల్ల నయ్యక్షుండు. ౧౬౫.

క. వాలునుబలకయుఁగొనియువ
లీలన్దివికెగయుటయునులెక్కింపకతా
నోలిఁబెరిఁగియద్దనుజుని
తోలాఘవమొప్పనెగసితోలఁగనికినుకర్. ౧౬౬.

గీ. పదములొడిసిపట్టిబలువిడితోరణ
స్తంభముననుగొట్టిసరభసమున

శమనుపురికిఁబని చెనమరులుగొనియాడ
    మారుతాత్మజుండు ధీరుఁడగుచు. ౧౬౭.

క. అని మొనసతుఁడువడఁగాఁ
    గనుఁగొని దనుజాళివఱచికల తెఱఁగెల్ల
న్వినిపింపఁబజ్క్తివదనుఁడు
    దనమదిఁ బెనుశోకవహ్ని దలకొనవగ చెక్. ౧౬౮.

వ. ఇట్లతునిం బేర్కొని మహాచింతాక్రాంతుండై పలవింపు చున్న జనకునిం గాంచి యింద్రజిత్తిట్లనియె ౧౬౯.

క. దనుజాధినాథయీాక్రియ
    మనమునశోకింపనేలమర్కటకీటం
బునుబట్టి తెత్తునన్నుం
    బనుపుముసందియముమానిపటుహర్షమునన్. ౧౭౦.

వ. అనిన నమ్మేఘనాదునకు దశగ్రీవుం డిట్లనియె. ౧౭౧.

క. నాకన్న నధికబలుఁడవు
    పాకారిప్రముఖవిబుధభయదాకృతివీ
వాకపివర్యుంబట్టుక
    నాకడకుం దెమ్ముపొమ్మనం బ్రముదితుఁడై. ౧౭౨.

మ. ఘనభేరీరవమంబరంబువగులంగా మ్రోయఁగోలాహల
    ధ్వనులొప్పన్బలము లెసలంగవరగర్వస్ఫారచేతస్కుఁడై
    యనలార్కప్రభఁబొల్చుహాటకరథంబారోహణంబందితాఁ
    జనుదెంచెన్వడినింద్రజిత్తుసుమహాసాంద్రప్రతాపంబునన్. ౧౭౩.

వ. ఇట్లరుదెంచి తోరణస్తంభోపరిసందీప్యమానుండగుపావనిం గాంచి రోషజాజ్వల్యమానాక్షుండై యింద్రజిత్తుండు. ౧౭౪.

గీ. చాపనిర్ఘోషమునదిశల్సంచలింప
భూరిశరవృష్టిపుంఖానుపుంఖముగను
గురియనన్నిటిఁదనకేలఁగొనిమలంచి
యవనిపైలీలలంఘించియనిలసుతుఁడు. ౧౬౫.

కం. ఘనసాలముసహామూలము
గనుదగఁబెకలించితనదుకరముననిడికా
లునిగతినార్చుచుఁబరువిడిఁ
జనుదెంచిసురారిఁదాఁకెసంరంభమునన్. ౧౬౬.

కం. సూతునిఁబొరిగొనితురగ
వ్రాతంబులఁగూల్చిరథమువ్రయ్యలుగాఁగ
న్భూతలమునఁదూలఁజఱచి
యాతోరణమెక్కి వెలసెనచలముభంగిన్. ౧౬౭.

కం. వనచరవీరునిచేనిటు
తనరథరథ్యములువ్రెలియధరణికివడిలం
ఘనమొనరించిదశానన
తనయుఁడుబడబాగ్నిగతినుదగ్రుండగుచున్. ౧౬౮.

గీ. అనిలజునిపైనిరౌద్రాస్త్రమడరఁబఱప
నతఁడుహరవీర్యసంభూతుఁడగుటకతనఁ
దద్విశిఖమేమొనర్పకతలఁగుటయును
గాంచినివ్వెఱఁగందుచుఁగనలిమఱియు. ౧౬౯.

కం. వాయవ్యాస్త్రమువేయుడు
వాయుతనూభవుఁడుగానవానరవీరుం
డాయస్త్రంబునఁద్రుంగమి
నాయెడభావించిరావణాత్మజుఁడంతన్. ౧౭౦.

మ. అతిరోషానలభీషణుండగు దుర్బ్రహ్మాస్త్రంబుసంధించితా
నతివేగంబుననేయఁగానదిసురేంద్రాదుల్భయంబందన
భ్రతలిద్దివ్యవిమానములైదరఘోరంబొప్పఁగాలాంతక
ప్రతిభన్వేపఱతెంచివాయుతనయున్బంధించిత్రోసెద్ధరన్. ౧౮౧.

క. వనజభవాస్త్రంబునన
యనిలజునకుఁజావులేమినద్భుతభంగిం
గనియింద్రజిత్తుఁడతనిం
గొనిదశముఖుకడకుఁబోవఁగోరిభటులతోన్. ౧౮౨.

గీ. వానరునిఁగట్టుఁడనిపల్క—వారలపుడు
ఘనతరంబులౌత్రాళ్లఁ జేఁగట్టితేర
నింద్రజిత్తుండుజనితండ్రికెఱఁగినిలిచి
మారుతాత్మజుఁగాన్పించెధీరుఁడగుచు. ౧౮౩.

వ. ఇట్లు విజయంబుఁ జేకొని పఱతెంచినకొడుకుకడిందికి సంతసించి యాలింగనం బొనర్చి తనకట్టెదుట నతిభీకరాకారుం డగుచు నాసీనుం డై యున్నహనుమంతుం గాంచి క్రోధారుణితలోచనుం డై రావణుం డిట్లనియె. ౧౮౪.

చ. వనచరమత్పురిన్ద్రిదశవర్యులకైననుదేఱిచూడరా
దనునెడనీవుసొచ్చివనమాఱడివుచ్చియహీనసత్త్వలా
దనుజులఁగొందఱందునిమిధైర్యమునన్విలసిల్లునిన్ను నా
ఘనతరఖడ్గరాజమునఖండ మొనర్పకపోవనిత్తునే. ౧౮౫.

క. నీవెవ్వఁడ వేవడువున
నీవననిధిదాఁటివచ్చితెవ్వఁడువంచె
న్భావించినిజమువల్కుమ
నావినియిట్లనియెఁబవననందనుఁడపుడున్. ౧౮౬.

ఉ. రావణ నన్నెఱుంగవట రాపటువిక్రమధుర్యుఁడైనసు
గ్రీవునకేనమాత్యుఁడనరిందముఁడౌ రఘురాముబంటనా
భూవరుపంపునజ్జనకపుత్త్రినిఁగానఁగవచ్చితంజనా
దేవిసుతుండనిప్డుసుమతిన్హనుమంతుఁడటండ్రునన్నెఱుఁగ. ౧౮౭.

క. నీవనమునశ్రీరాముని
దేవింగనిసేమమెల్లఁదెల్పిమఱలుచో
నేవచ్చినతెఱఁగేర్పడ
భావమునన్నీకుఁదెలియఁబడఁజేయుటకై. ౧౮౮.

చ. వనముఁబెకల్చిదైత్యభటవర్గములంబరిమార్చికింకరా
ళినిఁబొరివుచ్చిమంత్రిజులలీలవధించియుజంబుమాలినిం
దునియఁగఁజేసియక్షుపటుదోర్బలమున్హరియించినిన్నుఁగ
న్గొనఁగఁదలంచివచ్చితిటకుంగదరావినరానిశాచరా. ౧౮౯.

వ. అనిన రావణుం డిట్లనియె. ౧౯౦.

గీ. రాముఁడెట్టివాఁడురణబలమేపాటి
యతనిమిత్త్రుఁడైనయర్కసుతున
కొనరనిన్నుఁబోలువనచరభటులెంద
ఱెఱుఁగఁబల్కుమిప్పుడేర్పడంగ. ౧౯౧.

వ. అనిన హనుమంతుం డిట్లనియె. ౧౯౨.

గీ. తొడరినినుఁబట్టిచెఱనిడివిడిచిపుచ్చు
కార్తవీర్యార్జుననిఁద్రుంచిఘనతకెక్క
పరశురామునిబాహువిస్ఫురణనణఁచి
నట్టిరఘువీరువిక్రమంబరయవలదె. ౧౯౩.

క. నినుఁదనతోఁకఁగట్టుక
వననిధులన్ముంచినట్టివాలినొకశరం

బునఁడునిమిన కాకుత్థ్సుని
ఘనతరశౌర్యంబుఁ బొగడఁ గాఁదరమగునే. ౯౪.

క. నాకన్న నధికసత్త్వుల
నేకులఁ గపిభటులు గొల్వ నెప్పుడు నిన్నుం
జేకొనక త్రుంపఁ గోరుచు
నాకమలహితాత్మజన్ముఁ డరయుచునుండున్. ౯౫.

వ. కావున. ౯౬.

క. వినుమా నేఁ దెల్పెడు మతి
ననుమానము మాని రఘుకులాగ్రణిపదము
ల్గనుమా సీత నొసఁగి శర
ణనుమా మన్నించు నాతఁ డక్కిలి మీఱన్. ౯౭.

మ. అటుగా దేని రఘూద్వహుండు నిజబాహాటోపసందీప్తుఁడై
పటుబాణాహతి నిన్ను నీబలములన్ భస్మంబుగాఁ జేసి సం
కటముల్ మాన్చి ధరాసుతం గొనుచు వేడ్కం బోవు నిక్కంబు నీ
కిటు లేలా బలవద్విరోధమునకై యిచ్చింప మూఢాత్మకా. ౯౮.

క. అనుటయు దానవనాయకుఁ
డనుపమతరరోషభీషణాకారుం డై
వనచరుని దునుముఁ డనుచును
దనభటులకు నాజ్ఞ యొసఁగుతఱి నడ్డంబై. ౯౯.

సీ. వినయభూషణుండు విఖ్యాతచరితుండు
సత్యభాషణుండు సాధుహితుఁడు
శాంతశమదమాదిసద్గుణగణధుర్యుఁ
డగు విభీషణుండు వగచి పలికె. ౧౦౦.

క. అసురారివినుముపతిబం
 ధమరం జేయంగవచ్చియరులఁగనినచోఁ
దమయేలికనగ్గించుట
 క్రమమొప్పఁగభటులకిదిస్వకార్యముగాదే. ౨౦౧.

గీ. దూతలేమేనితమతమతోఁచినట్లు
 వదరుచుండుదురవియెల్లమదిఁదలంచి
సైరణఁదొఱఁగిరౌద్రరసంబుఁబూని
 తగిలితెగఁజూచుటయురాజధర్మమగునె. ౨౦౨.

క. సుతులనుహితులనుయతుల
 న్నుతులన్దూతలనుమనుమఁజనునేవినునీ
మతిఁగోపముగలిగినరఘు
 పతిపైఁబోవంగరాదెపటుశౌర్యమునన్. ౨౦౩.

గీ. అట్లుగాదేనిపీనినీయలుకదాలుకఁ
 దగినదండనమొకకొంతఁదగనొనర్చి
పుచ్చుమనసురాధీశుఁడిచ్చమెచ్చి
 దనుజభటులనుజీరియిట్లనియెనపుడు. ౨౦౪.

క. మనపురమెల్లనుద్రిప్పుచుఁ
 బనివడియీక్రోఁతితోఁకబలుచేలములం
గొనిచుట్టికాల్చిపుచ్చుం
 డనవినిదానవులుచెలఁగియాగ్రహవృత్తిన్. ౨౦౫.

క. అందఱుగుములైవాయుజు
 నందందంగేలిచేసియప్పురమెల్ల
న్నందులుగొందులుద్రిప్పుచు
 సందడిగానరిగిరధికసంభ్రమమొప్పన్. ౨౦౬.

వ. ఇట్లప్పురంబున నెల్లెడలం ద్రిప్పి తోడ్తెచ్చి యొక్కచో. ౨౦౭.

క. మనవారలఁ బెక్కండ్ర
న్దునుమినయీచెనఁటిక్రోఁతిదొంగ కెనటంచు
న్బనుచేలంబులు తైలం
బునఁదడిపియుబంతికరణిఁబొందికమీఱన్. ౨౦౮.

సీ. వాలమునఁజుట్టియందగ్నిఁగీలుకొల్పఁ
బటుతరంబుగలంకకుత్పాతకేతు
వృద వెనోయనఁబెనుమంటలోలినుండె
దనుజభటులెల్లఁగలకలధ్వనులఁజెలఁగ. ౨౦౯.

క. అంతఁ దద్వృత్తాంతం బంతయు నసురకాంతలవలన నెఱింగి జానకి మనంబునం జింతించి వైశ్వానరు నుద్దేశించి యిట్లనియె. ౨౧౦.

గీ. ఘనుఁడు రాముఁడు సత్యసంకల్పుఁడేని
నవనిపై నేఁబతివ్రతనగుదు నేని
వానరోత్తముపైఁ గృపఁ బూనిపరమ
శీతలతఁబొంది పాలింపు శిఖివరేణ్య. ౨౧౧.

వ. అని యిట్లు జనకనందన ధనంజయునిం బ్రార్థించుచుండె నంత వాయుజుండు జ్వాలాభీలవాలాగ్ని మహాశీతలత్వంబునం బొల్చుటయు నచ్చెరు వందుచుం దనమనంబున నిట్లనియె. ౨౧౨.

క. అనిలుఁడుదనసఖుఁడగుట
న్మనమునననలుండునన్ను మన్నించెనొకా
దనువొందధరాసుతదీ
వెనఁగాఁబోలుననిమదివివేకించితగన్. ౨౧౩.

గీ. బ్రహ్మమంత్రంబులవ్వేళఁ బ్రస్తుతింప
బ్రహ్మపాశంబువదలుఁడుఁబవనసుతుఁడు

పెరిఁగితనమేనుఁ బెంచిగంభీరుఁడగుచు
నసురబంధనములఁ ద్రెంచియార్భటించె. ౨౧౪.

వ. అంత. ౨౧౫.

క. అనలుండయ్యనిలతనూ
జునిసోఁకకయుండనగ్ని సూక్తంబులుతా
వనములనిల్పిజపింపం
జనుక్రియనపరాబ్ధికరిగెనస్తాశ్వుండున్. ౨౧౬.

వ. ఇట్లు మార్తాండుం డస్తంగతుం డగుటయు నమ్మారుతి దను వెన్దగిలి గేలిచేయుచుం బఱతెంచుదానవతండంబులఁ గండడంచి విజృంభించి రావణుమందిరంబున కుద్గమించి వాలాగ్నిం గీల్కొల్పుటయు భుగు ల్భుగుల్లనుపొగ లెగయ ధగద్ధగాయమానుం డై యనలుండు మింటి నంటి పెన్మంటలతోడఁ బ్రజ్వరిల్లం గని సంతసించి యప్పుడు.

సీ. కుప్పించిమణికొల్వుకూటముల్దరికొల్పి
మేడలుగోడలుఁగూడఁద్రోసి
భండారగృహములభస్మంబుగాఁజూచి
గజహయశాలలుగాల్చివైచి
పటుసౌధములనుజప్పరములుమసిఁజేసి
గోపురంబులనేలఁగూల్చిమించి
శయ్యాగృహంబులుచయ్యనమాయించి
వరచంద్రశాలలువహ్నికొసఁగి
వాడవాడలకునుసురవడిగఁదిరిగి
తగవిభీషణుగేహంబుదక్కనొకటఁ
గలయలంకాపురంబెల్లబలియుఁడగుచు
దహనమొనరించెనవ్వాయుతనయుఁడపుడు. ౨౧౭.

సీ. దాశరథిపటుఘోరప్రతాపవహ్ని
లంకపైఁబర్వునీక్రియనింకనన్న
కరణిఁబెనుమంటలెగసినాకంబునిండి
తేజరిల్లవిమానముల్దిశలఁబఱచె. ౨౧౯.

క. మునుదిక్పాలురనెల్లం
బనివడిబాధించినట్టిఫలముఁగుడువకే
చనవచ్చునెదశముఖుఁడం
చనుక్రియబడబాగ్నివెలసెనప్పురిలోనన్. ౨౨౦.

వ. అట్టియెడ. ౨౨౧.

సీ. తలలుఁజీరలుఁగాలధైర్యంబుఁబోఁదోలి
పరువిడినలుదెసల్బాఱువారు
తమతమహితబంధుతతిగములుఁగాంచి
ఖిన్నతయడరదుఃఖించువారు
మఱిఁగిసురాపానమత్తులైసుఖసుప్తి
నొంచెఱుంగమినగ్నిమండువారు
చెలులఁగౌఁగిటఁబట్టితెలివిమాయఁగవారి
తోడనెపెనుమంటఁదూలువారు
మదనకదనంబుననుసొక్కిమమతఁజిక్కి
బుద్ధిదిగనాడియందందెపొలియువారు
నగుచులంకాపురంబుననఖిలదైత్య
భూరిశోకారవంబులుబొడమెనంత. ౨౨౨.

వ. ఇట్లాంజనేయుం డప్పురంబున నెల్లెడలం ద్రిమ్మరి సమస్తంబును దహించి మైథిలియు సమసెనకా తలంచి భయంబంది తనమనంబున నిట్లనియె. ౨౨౩.

క. కనులున్గానక క్రొవ్వున
జనకజ నిష్ఠురముతోన సమయించితినే
నినవంశజునకు నేమని
వినిపింతు న్దలఁప కేల వివశుఁడ నైతిన్. ౨౨౪.

వ. అని చింతింపుచుం గొంతతడవునకుం గ్రమ్మఱం దెలివొంది డెందంబున ని ట్లని వితర్కించె. ౨౨౫.

క. ఏతల్లి దీవెనలచే
సీతతినావాలరోమ మేనియుఁ గాల్పం
భీతిల్లెన నలుఁడా ధర
ణీతనయకు భయము పుట్టు నే శిఖవలనన్. ౨౨౬.

గీ. అట్టు లేల కల్గున నిమతిధృతిఁ బూని
యవనిజాత తాపమార్చు కరణి
వాలవహ్ని విషధికీలాలముల నార్చి
యనిలజుండ శోకవనికిఁ జనియె. ౨౨౭.

క. తనుఁ గాంచి దనుజకాంతలు
మనమున దిగులొందితోలఁగ మరుదాత్మజుఁడా
జనకజఁ గని వినతుం డై
తనకరములు మోడ్చి పలికె ధైర్యస్ఫూర్తిన్. ౨౨౮.

క. అమ్మా జనకజ నాదుభు
జమ్మున నాసీనయగుము సత్వరను బ్రభా
తమ్మగుటకు మును రాముప
దమ్ములఁ గాన్పింతు సమ్ముదమ్మున సీతన్. ౨౨౯.

వ. అనిన నాంజనేయునిం గాంచి దరహసితవదనారవింద యగుచు ధరణీతనూజాత యి ట్లనియె. ౨30.

క. అన్నా మారుతినీవిపు
డెన్నం బ్రియసుతుఁడవగుదు వేనీవెంట
న్మన్నన తోఁ జనుదెంచినఁ
జిన్నతనంబగుటగాదు చెప్పెద వినుమా. ౨౩౧.

ఉ. భానుకులాబ్ధిచంద్రుఁడు కృపానిధి రాఘవుఁ డెన్ని భంగుల
న్దానరుదెంచి రావణునిఁ దద్బలయుక్తముగా రణంబునం
బూనివధించినన్నుఁ గొనిపోవక సద్యశ మొందఁగల్గునే
వానరవీర పొమ్ము రఘువర్యునిఁ దెమ్ము ప్రియమ్ము మీఱఁగన్. ౨౩౨.

వ. అనిన నాంజనేయుం డిట్లనియె. ౨౩౩.

క. ఇదె పోయి తెత్తు జననీ
సదయాత్ముం డైన రామచంద్రునిఁ గనుదు
ర్మదుఁడగు దశముఖుఁ డీల్గును
మదిసూఱటఁ జెందుమనుచు మారుతి మఱలెన్. ౨౩౪.

వ. ఇట్లవనిజ న్వీడ్కొని యట్టహాసంబున వెడలి వప్రంబులఁ దన్ని పరిఖలం దాఁటుచుఁ బాదఘాతంబున మహీరుహంబులఁ గూల్చుచు నచ్చటచ్చట మెలంగు దనుజభటులఁ బలాయితు లొనర్చుచుం బఱతెంచి సువేలాచలం బెక్కె యాంజనేయుండు. ౨౩౫.

క. అతిరభసంబున నపుడా
క్షితిభృచ్ఛృంగములు గ్రుంగ శిలలు దొలంగం
గుతలంబు ద్రుంగ జవసం
యుతుఁడై కుప్పించి దాఁటె నుదధి నగధృతిన్. ౨౩౬.

సీ. సాగరము దాఁటునెడ మధ్యభాగమునను
దోఁచు మైనాకమందు సంతుష్టిఁ జెంది

తన్నగముఁబుచ్చిజలధియుత్తరతటంబు
నందఁజనుదెంచినిలిచెనయ్యనిలసుతుఁడు. ౨౩౭.

క. ఈవిధముననరుదెంచిన
యావాయుతనూజుఁగాంచియంగదముఖ్యు
ల్భావముననలరిసీతా
దేవితెఱంగడుగనతఁడుదెలియంబలికెన్. ౨౩౮.

చ. అగచరవీరులారవినుఁడంబుధిదాఁటిదశాస్యుపట్టణం
బగుచువెలుంగులంకఁగనియయ్యెడనొక్కవనాంతరంబునం
బొగలుచునున్నభూమిజకుభూపతియుంగరమిచ్చియింతిచేఁ
దగుమణిఁగొంచునిచ్చటికిఁదప్పకవచ్చితినేనుమీకృపన్. ౨౩౯.

వ. అనిన విని యగచరోత్తము లాంజనేయుం గౌఁగిలించుకొని యగ్గిం
పుచు నందఱుం గూడి యత్యుత్సాహంబున నొక్కచో నివసించి
యున్నయెడ నంగదుం డి ట్లనియె. ౨౪౦.

క. మనముందఱమబ్ధిఁగడచి
దనుజావళితోడఁగూడదశకంధరునిం
దునిమిమహీతనయనువేఁ
గొనిచనిరొప్పింపఁదగఁగౌకుతలేశునకున్. ౨౪౧.

వ. అనిన నంగదుం గాంచి జాంబవంతుం డి ట్లనియె. ౨౪౨.

క. వననిధిదాఁటంజాలమి
మనమెల్లన్వెతలుజెందమారుతిదాని
ప్పనికియ్యకొనియొనర్చె
జ్జననాథునికార్యమెల్లసమకూఱెనిఁకన్. ౨౪౩.

గీ. అచటికేగితెలుపనర్కనందనుఁడును
రాఘవుండునువినిరయనుమీఱ

నెట్లొనర్పఁడందురట్లేమఱకచేయ
నొప్పులెండుపోద మొప్పమీఱ. ౨౪౪.

వ. అని జాంబవంతుండు వలుకుటయు నెల్లవార లియ్యకొని యా రాత్రి యంభోనిధిప్రాంతంబున విశ్రమించి యమ్మఱునాఁ డచ్చోటుఁ గదలి వనంబులు నగంబులుం దాఁటి యందందు నివసింపుచు సుగ్రీవుని మధువనంబుఁ జేరం జనుదెంచునప్పు డగచరావళు లంగదుం గాంచి యి ట్లనిరి. ౨౪౫.

క. వనములనుమిగులఁగ్రుమ్మటి
ఘనతరదాహంబుకతనఁగడుడస్సితిమొ
య్యనమనసుగ్రీవునిమధు
వనమొనరఁగఁజొచ్చియందువాంఛలుదీఱన్. ౨౪౬.

గీ. తేనియలుగ్రోలిఫలములఁదృప్తినొంది
తరులనీడలనొకకొంతతడవునిలిచి
యవలఁబోవంగఁదగునననంగదుండు
ప్లవగులనుగాంచిపలికెసంభ్రమముదక్కి. ౨౪౭.

క. ఉగ్రతరశాసనుండగు
సుగ్రీవునిమధువనంబుఁజొచ్చినమనపై
నాగ్రహవృత్తిఁగడంగఁడె
జాగ్రతదోఁపంగనిపుడెచనఁదగునవలన్. ౨౪౮.

వ. అనిన విని యయ్యగచరోత్తము లి ట్లనిరి. ౨౪౯.

గీ. రామభూవరేణ్యురమణితెఱంగెల్ల
నరసివచ్చినారమట్లుగాన
మనలనాగ్రహించిమర్దింపఁగానోడు
వృక్షచరవిభుండువెఱవనేల. ౨౫౦.

వ. అని పల్కుటయు నంగదాదు లానందం బంది సందడించుచు నందఱుం
గూడి మధువనప్రవేశం బొనర్చి. ౨౫౧.

సీ. తరువులపై నెక్కితప్పకంతయుఁ బ్రాఁకి
    కాయలాకులఁ ద్రుంచిగాసిచేసి
కొమ్మలవిఱిచిసుమమ్ములమహిరాల్చి
    లతలుద్రెంచిద్విరేఫతతినఱంచి
ఖగములబెదరించిఖంబున కెగయించి
    శాఖలఁజివ్వునఁజెంగలించి
కుంభినియుద్రువంగఁగుప్పించిమేన్పించి
    కొనచెవుల్ జిక్కించికొక్కరించి
కలకలధ్వానములదిశల్గ్రిందుకొనఁగ
    వలయునెడలకుఁజనియురవడినిమీఱి
బహుతరంబులుమధురసఫలములరసి
    భక్షణమొనర్చిరవ్వేళవృక్షచరులు. ౨౫౨.

క. కొలఁకులనుడిగ్గికలఁచుచు
    నలరులపొదలెల్లఁబెఱికియటువైచుచుఁబు
వ్వులతేనెలానిసూనియు
    బలురభసమొనర్చిరంతఁబ్లవగులుగుములై. ౨౫౩.

వ. ఇవ్విధంబున మధువనం బాఱడి వుచ్చుచు నెదురులేక విహరించు
చుండుకపిబలంబులం గాంచి తద్వనపాలకుం డగుదధిముఖుం డరు
దెంచి యార్భటించి యిట్లనియె. ౨౫౪.

క. ఇదిరాజవనమటంచును
    మదినొక్కింతయునెఱుకమానియకటదు

ర్మదమునఁ గలఁపందగునే
పదపడఁ డనిత లుమఁబంచె భటులఁ గడిమిన్. ౨౫౫.

గీ. అంతఁ గోప మెత్తియుం గదాసులు గూడి
దధిముఖుని ముఖంబు ధరణి మోఁది
మొనసి యీడ్వ వాఁడు మొఱ వెట్టుచును బోటి
భానుసుతునిఁ జేరి పలికె నిట్లు. ౨౫౬.

క. వనచర నాయక మనమధు
వనమున కిపుడంగదాదివలిముఖు లెల్లం
జనుదెంచి గాసి చేయం
గని పోఁదోలుటయు నన్నుఁ గడుకోపముతోన్. ౨౫౭.

గీ. పాడిచిత్రోయుటయును బోరున భవదంఘ్రు
లరయ వచ్చితి నన నాగ్రహించి
తపనతనయుఁ డట్టి కపులను దండింపఁ
దలఁచు టెఱిఁగి రాముతమ్ముఁ డనియె. ౨౫౮.

గీ. కపికులాధీశ నీయాజ్ఞఁ గడిచి వనము
నందు సారనంగదాదుల కెలవి యగునె
వారు మైథిలిఁ బొడఁగన్న వారుగాన
నిట్టి సాహస మొనరించి రెఱుఁగవలదె. ౨౫౯.

క. రామసహాయులగుటచేఁ
బ్రేమన్మన్నించి వారిఁ బిలిపింపు మన
న్నామరసాప్తతనూజుఁడు
సౌమిత్రిమృదూక్తికలరి శాంతహృదయుఁడై. ౨౬౦.

గీ. దధిముఖునిఁ గాంచి పలికె నత్తరుచరాళి
    సీత తెఱఁగెల్లఁ దెలిసి వచ్చిన కతమున
మదిని సైరించినాఁడ నీవది యెఱింగి
    పొమ్ము వారలఁ బుత్తెమ్ము సమ్ముదమున. ౨౬౧.

వ. అని పల్కిన దధిముఖుండు మఱలం జని యంగదప్రముఖులకు వందనం బొనర్చి సుగ్రీవుం డరుదేరం బంచె విచ్చేయుం డనిన నెల్ల వారలుం గూడి వికసితాననపద్మంబులతోడఁ జనుదెంచి రామలక్ష్మణ వనచరాధీశులకుం గ్రమక్రమంబునం బ్రణామంబు లొనర్చుటయు నప్పు డాంజనేయుండు రామచంద్రచరణకంజయుగళసాన్నిధ్యంబున నిలువంబడి యంజలీబద్ధకరకమలుం డగుచు నిట్లనియె. ౨౬౨.

క. కంటిం జానకి నంబుధి
    నొంటరినై దాఁటి లంక కుఱవడఁ జని యం
దింటింట వెదకి తుదిఁ గా
    వెంట నశోకవని నొక్క విటపము క్రిందన్. ౨౬౩.

సీ. మున్నిటి వఱద లై యొన్నంగ రేవగ
    ల్మిమ్ము మీఱని కన్నీటితోడ
మలినాంబరముఁ గట్టి మహిపైని బొరలుచు
    ధూళిదూసరితాంగపాళితోడ
నుపవాసముల స్రుక్కి యొండొండ నిట్టూర్పు
    లడరంగఁ బుచ్చుచు నార్తితోడ
హా రామ హా రామ యనదగాఁ జేసి తె
    యని పల్కు దీననిస్స్వనముతోడ

వెతలఁగుందుచునుండమీ వెలఁదియనుచుఁ
దెలిసిచని మ్రొక్కి యూఱటవలికియుంగ
రంబొసఁగి చెలితలమానికంబుఁగొనుచు
వనధిలంఘించివచ్చితివసుమతీశ. ౨౬౪.

క. అనివిన్నవించిమారుతి
దనచేజనకజయొసంగుతలమానికము
య్యనవర్పించినఁగైకొని
మనుకులుఁడక్కునను జేర్చిమహిమూర్ఛిల్లెన్. ౨౬౫.

గీ. అంతఁదెలివొందిరఘురాముఁడనిలసుతునిఁ
జెంతకునుజీరికౌఁగిటఁజేర్చిమెచ్చి
యనఘనీవింకమఱలుచోనంబుజాక్షి
యేమిపల్కెనునాతోడనెఱుఁగఁజెపుమ. ౨౬౬.

వ. అనిన హనుమంతుం డిట్లనియె. ౨౬౭.

క. అనలముసాక్షిగనినుఁబా
యననుచుఁజేకొనియునిప్పుడనదగఁజేయఁ
జనునేయనిసీతోడ
-న్వినిపింపుమటంచుఁబలికెనంటెమహీశా. ౨౬౮.

క. అలచిత్రకూటమునవిల
సిలుతఱిఁబఱతెంచితన్నుఁజెనకినకాకిన్
బలుశరమునభంజించిన
యలఘుప్రియమోదుఁబోయెననుమనియెన్నృపా. ౨౬౯.

క. తనకామినినొక్కఁడుగొని
చననూరకయున్కినపయశముగల్గునుగా

పునఁ దెల్పితి భవదంఘ్రుల
నన వరతము మఱవ నంటి ననుమనె నధిపా. ౨౨౦.

గీ. వెతలు సెందితిఁ బది నెలల్ విభునిఁ బాసి
యింకఁ దడసిన నోర్వ లే నెట్టులైన
నన్నుఁ బ్రోవుమటంచును నాథునకును
విన్నపము నర్పుమని యొనవ్వేలఁ దిమిన్న. ౨౨౧.

వ. అని పల్కి లక్ష్మణుం గాంచి యాంజనేయుం డిట్లనియె. ౨౨౨.

గీ. పరమపుణ్య నిన్నుఁ బల్కి నఫలములు
గుడిచితి నొకభంగి కొదవ లేక
మదిని నొండు తలఁపు మాని మున్న నచేయు
మనుచుఁ దెల్పుమని యొసనఘ వింటె. ౨౨౩.

క. అని తెల్పి భానుజునకు
న్వనచర వీరులకు సీత వర్తన మెల్ల
న్వినిపింప నెల్లవారలు
గొనియాడిరి వాయుసుతుని గుణములనంతన్. ౨౨౪.

క. నవనీత చోరమురదా
నవమదగర్వాంధతమసనలినాప్తసుధా 
ర్ణవశయన పీతవసనా
నవసారసపత్త్ర నేత్ర నవ్యచరిత్రా. ౨౨౫.

మాలిని. నిరుపమగుణధామా నిత్యకల్యాణసీమా
పరమమునిజనపాలావర్ణితామర్త్యజాలా
పరనివహవినాశా భానుకోటిప్రకాశా
సురుచిరమణిభూషా సుస్థిరానంతవేషా. ౨౨౬.

గద్యము. ఇది శ్రీమదుత్తరరంగనాథకరుణాకటాక్ష వీక్షాసమాగత సరస కవితావైదుషీప్రవీణ పరమవైష్ణవకులకలశజలనిధిసుధాకర రామానుజ దేశికగర్భశుక్తిముక్తాఫలాయమాన శృంగారసారసంగ్రహాభిఖ్యలక్షణగ్రంథనిర్మాణధురీణ ప్రహ్లాదచరిత యక్షగానవిధాననిధాన గానవిద్యానూన పాండితీస్థాన రంగయాభిధాన ప్రణీతంబైన శ్రీమద్రామాభ్యుదయం బనుమహాపురాణంబునందు సుందరకాండం బనునది పంచమాశ్వాసము.,